నిది పాఠశాలలలోను, కళాశాలలలోను, ప్రాచ్యభాషకు సంబంధించెడు విద్యార్థులకు నెల్లప్పుడు ప్రధాన పాఠ్యగ్రంథముగా నుండఁదగిన యుత్తమోత్తమ కృతి.

పైన నుదహరింపఁబడిన శాంతిసమరము, స్వరాజ్యసమరము, భావలహరి, ఆంధ్రప్రతిష్ఠ మొదలుగాఁగల సత్యకవిగారి యితర కృతులును కళాశాలాదులలో ముఖ్యముగ నీ స్వరాజ్యయుగమునఁ బాఠ్యగ్రంథములుగ గౌరవింపఁబడఁదగ్గవి. ఇంచుమించుగా నిన్న మొన్నటివరకు దాస్యశృంఖలకు గురియైయున్న మాతృదేశమును మనసులో నుంచుకొని తదీయ పురోభివృద్ధి శ్రేయస్సులకు ముఖ్యాధారముగఁ గలము చేతఁబూని సిద్ధి పొందిన వీరి గ్రంథరత్నములు యావద్దేశము వెలుఁగులఁ గులికెడు ఈ స్వపరిపాలన యుగములోఁ బాఠశాలలయందుఁ బ్రముఖ పాఠ్యగ్రంథములుగ నుండవలయుననుటఁ గేవల మెచ్చులకుఁ జెప్పెడిమాటకాదు. అసలైన స్వాభావిక కృత్యమది; మరియు, జాతీయప్రభుత్వమునకది విధ్యుక్తధర్మము. దేశీయ ప్రభుత్వమిపుడు వీరిని వీరిగ్రంథములను గౌరవించుట నిజముగఁ దన్నుఁదా గౌరవించుకొనుట. దేశభాషలకు శ్రేయోదాయకముగ సాహిత్యరాజకీయరంగాలలో సమముగఁ గలమును గదను ద్రొక్కించి తద్ద్వారా కవితారాజకీయములకుఁ గల యవినాభావసంబంధమును రూఢిపరచెడు ఇట్టి జాతీయమహాకవులను అసలైన జాతీయ ప్రభుత్వము, ముఖ్యముగ, ఆంధ్రప్రభుత్వమెన్నఁడైన గౌరవింపకుండ నుండఁగలదా ?

కాని, నేఁటివఱకు సత్యకవిగారికి ప్రభుత్వములో న్యాయము జరిగినట్లగపించదు. ఎందకు రాజధానీనగరమునఁ బ్రభుత్వము వారిచే నెలకొలుపఁబడిన తెలుఁగు ఎకాడమీ కూడా ఈ మహాకవిని దలపెట్టకున్నది. ఇది యెంతయు విచారింపఁదగ్గ విషయము. అందుఁగల సముచితస్థాన మలంకరించుట కీనాఁడీయన తగిన వారసుఁడు. ఇందుకుఁ బైన వివరముగఁ జూపఁబడిన వీరి రచనలే సాక్షి. ఈలోటిఁక ముందైనను దీరక పోదని యస్మదాదుల దృఢవిశ్వాసము. ఏది యెట్లున్నను, అనన్యమైన వీరి సరస్వతీమాహాత్మ్యము నేఁడు జాతీయ కవి శ్రేణిలో వీరికి విశిష్టస్థానమును పర్వరచియే యున్నది. అది యచంచలము, మరియు, అనశ్వరము. వెనుక తన దేశ క్షేమముకొరకుఁ దన కవితాజీవితమును ధారపోసి చిట్టచివర కఖండముగా రాజసన్మానము లందుకొనిన ఫ్రెంచిమహాకవి "వాల్టైరు"వలె వీరును దుదకు ఘనమైన ప్రభుత్వగౌరవమును బడయకపోరని నా దృఢవిశ్వాసము. నిగ్గైన దేశపురోగతికి సర్వ సమర్థతఁగల జాతీయమహాకవుల కలమే ప్రధానసాధనము. కాఁబట్టి, సర్వవిధముల దేశాభివృద్ధి నభిలషించెడు జాతీయ ప్రభుత్వమెన్నఁడైనఁ బ్రజ్ఞాపటిష్ఠతఁగల యిట్టి జాతీయ మహాకవుల నాదరించి గౌరవించుట తప్పమియే కాఁగలదు.

నేఁడు శాశ్వతీకృతమై పొడతెంచెడు భారత ప్రతిష్ఠకు మూలాధార మల వాల్మీకి.వ్యాస కాళిదాసాదులయు నన్నయ తిక్కనాదులయు బ్రహ్మాండమైన భాషాసేవ. అంతులేని దేశసం స్థితికిఁ బరిపూర్ణసమర్థతఁగల మహాకవి ప్రబలమైన వెన్నముక

కదా. ఈ నగ్నసత్యమును వెనుక చాళుక్య విద్యానగరముల వంటి పెద్దపెద్ద ప్రభుత్వములు గుర్తించినవి. ఆయా యుగములును అన్వర్థములైనవి. అంతవరకెందుకు ? నిన్న మొన్నటి వరకుఁగల పిఠాపుర విజయనగరములవంటి చిన్నచిన్న సంస్థానములుగూడ ఈ సత్యార్థమును గ్రహింపఁజాలినవి. దిగ్దంతుల వంటి మహాకవులను బండితులను ఆదరగౌరవంబులతోఁ బోషించి దివ్యతరమైన వివిధవాఙ్మయసంభూతికి మూలమై చరితార్థములైనవి. దేశదాస్య మోక్షముకొరకు—

భరతఖండమ్ము చక్కని పాడియావు
హిందువులు లేగదూడలై యేడ్చుచుండ
తెల్లవారను గడుసరి గొల్లవారు
పితుకుచున్నారు మూతులు బిగియఁగట్టి.

ఈ మాదిరిగా అనన్యమైన కవితాశంఖమును బూరించిన సుప్రసిద్ధమహాకవి శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంపంతులుగారు కూడ ఆ చిన్న సంస్థానములలో నొకటియగు పీఠికాపురాస్థానకవి. ఆంధ్రదేశములోఁ జిలకమర్తి లక్ష్మీనరసింహముగారి నెరుఁగనివారొక్కరునుండరు. ఆయన దిగంతయశోవిశాలుఁడు. తెలుఁగు సాహిత్యరంగములో ఆయన వాల్టైరువంటి జాతీయ మహాకవి.

అటువంటి మహామహులకు అట్టి చిన్నసంస్థానములాధారభూతములై దేశమును వాఙ్మయముగా బ్రహ్మాండాభివృద్ధితో

నిండింపఁగలిగినట్టి ఒక ఆంధ్రప్రదేశమువంటి పెద్దప్రభుత్వములు తదియుక్తమైన నిష్పత్తికి ఎంత యెక్కువఁగనైనను పాటుపడఁ గలవు. మరియు అది వానికి విధ్యుక్తధర్మమే కాని మరొండు గాదు. కాఁబట్టి, నేఁటికి సుమారు పాతికేండ్లకుఁ బై చిలుకు కాలమునుండి సాహితీక్షేత్రమునఁ దేకదీక్షమై నిరాఘాటముగఁ బర్యటించుచున్న సత్యాకవిగారు ముఖ్యముగా నేఁడు జాతీయ ప్రభుత్వమెంతయు గౌరవింపఁదగ్గ జాతీయమహాకవియనుట కేవలము స్వభావోక్తి. ఆ చిలకమర్తి మహాకవికి ఈయన యల్లుఁడు; మరియు మహాకవికులీనుఁడు; తదుపరి సుప్రసిద్ధుడు. వీరి యుత్తమరచనల మొత్తముసంఖ్య నేఁటికి ఇరువదియైదుకుఁ పెక్కువ తాకుండ నున్నది. అందు ఈ మహాకవి కాళిదాసు వంటి గ్రంథములు చాలమట్టుకుఁ బ్రజాదరణవల్ల ముద్రితములై దేశమును ఆనందములో ముంచివైచినవి.

మహోత్కృష్ట గ్రంథమైన యీ "మహాకవి కాళిదాసు"ను అంకితము పొందఁజాలిన భూస్వామి శ్రీ పలివెల లక్ష్మీనారాయణరావుగారెంతయు ధన్యులు. వీరు సుప్రసిద్ధ జమీందారును గవి పండితాభిమానియు మహాదాతయునగు శ్రీ పలివెల సింగయ్య పంతులుగారి దత్తపుత్రులు. నేఁడు వీరొనర్చిన యీ మహత్తర కార్యమువల్ల నొకవైపు వీరి వంశమును మరొకవైపు మా రుద్రమకోటయు జరితార్థములైనవి. ఇదంతయుఁ దండ్రిగారి యవిరళదానఫలము కావచ్చును. ఎవరైనను, ధనాధికులు గావచ్చును, జమీందారులుగావచ్చును, మం

ప్రతులుగావచ్చును, కాని యపూర్వమగు నిట్టి మహాగ్రంథము నంకిత మొందజాలుట సాధారణ విషయముకాదు—అఖండమైన జన్మాంతర పుణ్యవిశేషము. కనుక, లక్ష్మీనారాయణరావుగారి యదృష్టము చాలా గొప్పది. వీరింకను ఈదేవిధముగఁ దమకుఁ దమ దేశమునకు నఖండకీర్తిని సంపాదింపఁగలరని యస్మదాదుల విశ్వాసము.

గ్రంథకర్తయగు సత్యకవిగారి రచనలలోఁ గొన్ని యముద్రితము లున్నవని పైన వివరించితిని. వానిలో గాంధి మహాత్ముని జీవితచరిత్ర యొకఁటి. అది సంస్కృతభాషలో వ్రాయఁబడిన యుద్గ్రంథమనియుఁ జైనఁ జెప్పియున్నాను. మరి, యది యింతవరకు అముద్రితముగా నుండవలసిన గ్రంథము కాదు. గాంధిమహాత్ముఁడే జీవించియున్న, అది నేఁటి కేనాఁడో ప్రకటితమై యుండెడిది.

విశేషమైన ధనవ్యయాధిక్యమువల్లఁ గావలసిన ప్రచురణ మది. ఒకప్పుడు భారతప్రధాని శ్రీ జవహర్లాల్ నెహ్రూ తదీయ మైన ప్రచురణ విషయము నుద్దేశించి సత్యకవిగారికి వ్రాయించి పుత్తెంచిన యుత్తరమును గలదు.

No. 2942 P S (1)/48
PRIME MINISTER'S SECRETARIAT,
NEW DELHI.
2nd April, 1948.

Dear sir,

The Prime Minister desires me to thank you for your letter of the 10th February, 1948, and to say that it has been forwarded to Dr. Rajendra Prasad, the Congress President, for necessary action.

Your's truly,
(Sd.) Dwarakanath Kachru,
Private Secretary to the Prime Minister.

Shree Dwivedi Satya Kavi
Satavadhani, Seetampet,
Rajahmundry (S.India).

ఇది దాని సంపూర్ణస్వరూపముగల ప్రతి. అడుగడుగున మహాత్ముని మృదుమధురహృదయమును గనఁబరచెడు ఈ యుత్తరముయొక్క ప్రతికూలత నలుసంతయు నున్నట్లగుపించదు. ఇఁకఁ గేవలమొక సమయ ప్రాతికూల్యమే దాని నింతవరకు నిట్లు నిలిపియుండవచ్చునని తోచుచున్నది. ప్రభుత్వము వివిధ భాషల యభివృద్ధికిఁ గంకణము కట్టుకొనియున్న యీ ప్రజాస్వామ్యయుగములో ఆ మహాగ్రంథమిక నైనను వెలుఁగులోనికి

లేకపోదని మా విశ్వాసము. మొత్తముమీద, వీరివన్నియుఁ ప్రజాహృదయములను ఆకర్షించెడు దేశవర్ధన రచనలు. అందువల్ల అవి మరలమరల ముద్రితములు కావలసినవే కాని, యేదో యొక పర్యాయము ముద్రితములై మరుగుపడఁ దగ్గవి కావు. మరి యందుకుఁ దగిన సమర్థతఁగల ప్రచురణగృహమును గనిపింపదు. ఇఁక దొరతనమువారి ఎకాడమీ లున్నవి. వాని కది యొక యసాధ్యకృతియుఁ గాదు కాఁబట్టి, లోకశ్రేయస్సునకు మూలమగు ఆ కార్యనిర్వహణకు అవి సర్వవిధములఁ బూనుకొనవచ్చును. అసలు మహాగ్రంథమగు ఈ "మహాకవి కాళిదాసు"ను ఆంధ్రప్రదేశ ఎకాడమీయే ప్రచురించియున్న దానికొక విధమైన మహత్తరకీర్తి లభించియుండెడిది. ఇప్పుడైనను మించిపోలేదు. దీని పునర్ముద్రణ మెంతయు ఆవశ్యకమైయున్నది. దానికైనను అది పూనుకొనవచ్చును. అప్పుడది పూర్తిగాఁ గాకున్నఁ గొంతయైనను లభింపకపోదు.

నేఁడు భారతమహాకవిగాఁ బ్రపంచములోని యన్ని దేశముల చేతను అఖండముగాఁ బూజింపబడుచున్న కాళిదాస మహాకవి నేటికి ఇంచుమించుగ రెండువేలయేండ్లనాఁటి పుణ్యపురుషుఁడు. భారతప్రభుత్వమును అమ్మహామహితాత్ముని ఈమధ్య ఉజ్జయినిలో అఖండముగాఁ బూజించినది. ఇప్పుడు భారత చైనాదేశాల సరిహద్దుల నిర్ణీతికిఁ గూడ తదీయరచనలు మనప్రధానమంత్రి శ్రీ నెహ్రూకు ఆధారభూతములై యున్నవి. పుట్టినది మొదలుకొని యింతవరకుఁ బ్రపంచములో నేకైక

మహాకవిగా నిరుపమ కీర్తి వైభవములతో బ్రహ్మాండముగాఁ బ్రకాశించుచున్న దివ్యపురుషుఁడు మహాకవి కాళిదాసు. అటువంటి మహామహుని జీవితకృతులను బురస్కరించుకొని లేక లేక యింతకాలమునకుఁ బ్రప్రథమముగా నేఁడు తెలుఁగులో ఉదయించిన సమగ్ర విమర్శ గ్రంథ మీ "మహాకవి కాళిదాసు". ఇటువంటప్పుడిది సర్వవిధముల దేశాభివృద్ధినభిలషించెడు జాతీయ ప్రభుత్వములకుఁ గడుంగడు ఆదరణీయమైన గ్రంథరాజమనుట కేవలము సహజోక్తి. మరియు, వివిధభాషలలోనికిఁ గూడ ఇది తర్జుమా కాదగ్గయుత్కృష్టకృతి. అదిప్రభుత్వమువారుచేయింపఁ దగ్గ కర్జము. ఒక్కొక్కప్పుడు పెద్దపెద్ద సంస్థలవల్లఁగూడ నెర వేరఁజాలని యీ మహోత్కృష్టకృతి యిప్పుడొకేయొక చేతి మీదుగా నిట్లు నిర్వహింపఁగలుగుట తెలుఁగుదేశ మెంతయు గర్వించి యానందింపఁదగ్గ విషయవిశేషము. శుభమస్తు.

రుద్రిమకోట
20—4—1960.

భాషాసేవకుడు,
శిలిగం జగన్నాథం.

---

# గ్రంథస్థ ముఖ్య విషయములు

## ఋతుసంహారము 1.

గ్రంథకర్తృత్వ నిర్ణీతి, వత్సభట్టీయ కాళిదాసీయములు లోకమునకు గ్రంథమిచ్చెడు సదుపదేశములు. ప్రకృతివర్ణనలు, కాళిదాసుని ప్రేమసిద్ధాంతము, రఘువంశ కుమార సంభవాదులు ఋతుసంహారము, ప్రకృతి మానవుల సంబంధము.

కు మా ర సం భ వ ము 2.

గ్రంథపరిమితి విచారణ, కథానుక్రమణిక, ప్రకృతిమాన వుల చుట్టరికము, మమ్మట విశ్వనాథుల యభిప్రాయము, కాళిదాసుని భావము. వ్యాకరణము, భవహారశబ్దముల చర్చ, గ్రంథ కథామూల నిర్ణయము, ప్రకృతి.

మే ఘ దూ త ము 3.

గ్రంథపరిమితి విచారణ, కృతిస్థాన నిర్ణయము, ప్రకృతి వర్ణన, చిత్రీకరణనైపుణి, భామహుడు, షేక్స్పియరు కాళిదాసులు, మేఘదూతము ఖండకావ్యము, ఇతర ఖండకావ్యములు, మేఘదూతము ప్రాచ్యపాశ్చాత్య పండితులు.

ర ఘు వ ం శ ము 4.

గ్రంథప్రసక్తి, నాయికానాయక నిర్వచనము, రసకథనము, వర్ణనావిశేషములు, గ్రంధపరిమితి నిర్ణయము, వ్యాకరణ విశేషములు,కథావిభాగము, రఘువంశ రామాయణములు, రఘువంశ పద్మపురాణములు, అలంకారముల ప్రయుక్తి, అతిధి పరిపాలన, రాజతత్వము, సీతాసందేశము, ఆదర్శప్రభుత్వము, దిలీపరఘురామ నరేంద్రులు, వివిధశాస్త్రవిషయములు, రఘువంశ ప్రజాప్రభుత్వము, వేదయుగము నాటి పరిపాలనా పద్ధతి, ఇక్ష్వాకులనాటి ప్రభుత్వపద్ధతి, రామాయణ భారత కాలముల నాటి యేకనాయక బహునాయక ప్రభుత్వములు, బౌద్ధయుగమునాటి పాలనాపద్ధతి, అశోకగుప్తరాజుల కాలములనాటి ప్రభుత్వ పద్ధతులు, ప్రభుత్వవిధానములు పాణిని కాత్యాయన పతంజలి మహర్షులు, కథామూల నిర్ణీతి, కాళిదాసుని కాలము ప్రజాప్రభుత్వములు, కాళిదాసుని కవిత్వము.

శ్రీమత్పరదేవతాయైనమః

# అంకితము

కం॥ సిరియును వాణియు గౌరియు
నిరతము రుద్రమ్మకోట నెసఁగెడువానిన్
సిరిసుతుఁ బలివెల వంశ్యుని
నరయుత శుభదృష్టి లక్ష్మినారాయణునిన్.

గీ. ఆరువేల నియోగి బ్రాహ్మణుఁడు కలిమి
కనువుఁగల మేటిగాఁడెఁ గట్టిన మనీషి
కశ్యపీయమ్ము గోత్రమ్ముఁగల యవీయ
సుఁడు యజుశ్శాఖ పెద్దవంగడమువాఁడు.

శా॥ ఆతం డెంతయు గౌరవంబుగఁ
దదీయం బైనగేహాన సు
స్నాతుండై యొకనాఁడు నన్గని
యనన్యానూనప్రాముఖ్యమౌ
ఏతద్దివ్యనవీనగ్రంథమును
నాకిమ్మంకితంబంచుఁ దాఁ
జేతఃప్రీతినొసంగెఁ దమ్ములము
వాసిన్నాకు సాపేక్షుఁడై.

గీ. అంకితములందుఁబొసఁగుమాహాత్మ్యమతని
కంతగా నచ్చుఁజెప్పిన యార్యమిత్రుఁ
డరయ శిలిగమువారి గృహమ్మువాఁడు
నై తలిర్చెడు అలజగన్నాథుఁడవునా !

గీ. అయినఁగావచ్చు నెనవచ్చునతఁడు నడల
వెనుక మాతాత చెళపిళ్ళ వేంకటకవి
శిష్యుఁడును నందివాడవంశీయుఁడయిన
లలిత గుణి యల వెంకటరత్నకవికి.

ఉ. పీరునువారెకాని, కనిపింపరుపో
యటువంటి మంచివ్యా
పారులు, దండడిన్జగతిపై నెటు
చూచిన నెప్పుడు న్జమీం
దారులయొద్దఁ ; గావున, నతండు
కడుంగడు ధన్యుఁ ; డట్టియా
దారుఁడు గీర్తికాముఁడు తదంచిత
మిత్రుఁడుగాఁ బొసంగుటన్

గీ. సర్వసాధారణంబుగ జగమునందు
లచ్చిపిల్లలసొమ్ము వ్యర్థవ్యయమ్ము
లకె గమించెడు సంఘమర్యాదఁబట్టి
ఇక్కడదియేమొ!మార్పుకన్పించునేఁడు.

కం. కృత్తికర్తయుఁ గృతిభర్తయు
మతిమంతుఁడు లోటులేనిస్థితిమంతుఁడు స
ద్గతరత శిలిగం గృహాజుఁడు
స్తుతిపాత్రుండతనికిఁక నితోఽధికఫక్కిన్.

గీ. అతని వంశ పరిభూత్యాదియైన చరిత
మింక వివరింపఁబడఁదగ్గ దిప్పుడిచట
ఉన్నదున్నట్లు కన్నట్లు విన్నయట్లు
సరవివచియింతు నిఁక దానిఁజక్కపరచి.

ఉ. ఖమ్మముమెట్టుమండలమొకండు
రహించుఁదెలుంగుగడ్డ; నం
దమ్మలుగుమ్మరించెడు ప్రదేశ
మెసంగెడుఁబాలవంచనా
మమ్మన; దానికిందగి సుమారొక
నల్వదిమైళ్ళ దూరమం
దిమ్మలమన్కి గ్రామమొకఁడేర్పడు
రుద్రిమకోట పేరిటన్

మ. అది గోదావరియొడ్డునందుగల; 
దత్యంతమ్ము సంపూతమై
పొదలున్నిత్యమురామపాదతల
వాఃపూరంబ యందుంట;
నందుదయంబొందెనుబల్వేలా
న్వయమునం,దుచ్చావచప్రాభవా
స్పదుఁడై సింగయనామముంగల
సదాచారుండొకండిమ్ముగన్.

గీ. ఆయజుశ్శాఖి తనకు అర్ధాంగి కాఁగఁ
బరిణయంబయ్యె జగ్గమ్మ భవ్యభంగిఁ
దనయుఁడుదయించె ఆవిప్రదంపతులకు
అంత నరసింహరావను నట్టి ప్రమతి.

గీ. బరిణయంబాడె వెంకటనరసమాంబ
నాతఁడాపయి; వారల కంత, సింగ
యాఖ్యుఁడుదయించె;నతనికర్ధాంగులైరి
యంత, గంగమ్మకామేశ్వరమ్మలెలమి.

శా॥ అంతం డెంతయుఁ జెప్పుకోఁదగిన
బ్రహ్మాండప్రభాభాసియై
దాతృత్వంబునఁ బేరుఁగాంచెను,
మహీదైవాళికిన్ మాన్యముల్
చేతఃస్ఫూర్తినొసంగుచున్, గవి
బుధాశీర్వాదముల్బొందుచున్
సాతత్యమ్ముతదీయపోషకుఁడునై,
సంస్థానియై, స్థానియై.

వ. పోచవరము, ఆర్యాయపల్లి, నార్లవరము, బుట్టాయి
గూడెము, నరసింగపేట, కొత్తారుగొమ్ము, వెంకన్న
గూడెము, రుద్రమకోట, రామచంద్రాపురము, కోయిద,
కట్కూరు;—

ఉ. ఈ మొదలైనగ్రామముల
కేడ్తెరఁదా, వివిధాధిపత్యభూ
స్వామిగ సొంతగ్రామమున
వాసమెనర్చుచు, అర్థికోటికిన్
భూములుసొమ్ములిచ్చుచుఁ,
బ్రభూతసమజ్యగడించె,సాటిభూ
స్వాములమించి దుడ్డుఁగల
వాఁడయి సింగయతెన్నుగడ్డలన్.

ఉ ఎందునులో తెరుంగని యహీనధనాదికుడై ;నను, న్మనో
నందనతన్ ఘటింపఁగలనందనుఁడొక్కఁడుగూడలేమి,ఆ
నందములేకపోయె అలనాయకమౌళికిఁ; బుత్రసంపదన్
జెందని సద్మముల్సిరులు చిల్కవుగా, సిరులెన్నిఁగల్గినన్.

మరియు, వంశమ్మునిలుపసామర్థ్యమొలయు
సుతుఁడులేకున్న, మునుముందుగతులుసున్న
యనుచు, నాతఁడు దత్తుఁగై కొనుటకపుడు
కడఁగె; నతఁడును ఔరస కల్యుఁ డగుట.

కం. గుంటూరిమండలంబున
కంటుక బాపట్లయున్న; దచటకు దాపై
పంటలకిరవగు నండూ,
ర్పంటవలంతిన్రహించు; రైగణ ఖనియై.

సీ. అచట అన్నమరాజను నట్టి యింటి
పేరుఁగలవాఁడు, గలవాఁడు, పెద్దమనిషి.
కలఁడు, హనుమంతరావనుఘనుఁడొకండు
అతని కర్థాంగి యయ్యెఁ, దా నన్నపూర్ణ.

కం. వారలు, కొడుకుంగోడలు
నై, రల సీతమ్మసుబ్బయాఖ్యల కెలమిన్
వారికి, సుతుఁడై లక్ష్మీ
నారాయణుఁడుదితుఁడయ్యె, నంచితజనియై.

శా॥ స్ఫారోదారుఁడు, గశ్యపీయుఁడును,
ఆపస్తంబసూత్రుండునున్
ధీరుం, డాదొర, సింగయాభిధుఁడు;
ప్రీతిం దేరి ప్రోల్లాసియై
భారద్వాజ పవిత్రగోత్రు నలి
యబ్బాయిన్, మనోవాంఛ దై
వారన్దత్తునిగాఁగ్రహించె;
గుల శశ్వద్దీప దేశీయునిన్.

గీ. అతఁడు పాదము పెట్టిన యవసరంబు
ఎంతమంచిదో! సింగయ్య, కంత, నార
సుండుజన్మించెఁ గ్రమముగ, సుతుఁడొకండు
అతఁడ నరసింగరావు, తదనుజుఁ డిపుడు.

గీ. అట్టులన్నమరాజు గృహమ్మువాఁడు
తుదకుఁ బలివెలవారి పుత్రుఁడుగ మారి
యువిదసుబ్బాంబికన్ బేర్మినుద్వహించె
లలితగుణఖని లక్ష్మినారాయణుండు.

గీ. బాబుసింగయ దానాల పంటయేమొ!
యతనికంతటఁ గ్రమముగ, నామెయందుఁ
బుత్రికా పుత్ర సంతతి పుష్కలముగఁ
గలిగెఁ; గలకల లాడుఁ బెవ్వెలగృహమ్ము.

వ. విశాలాక్షి, సుబ్బారావు, సుందరమ్మ, వెంకటరమణారావు;
—ఇదియిప్పటివరకుఁగల తదీయసంతానము.

గీ. అతఁడే, నేఁడు కృతిభర్తయై యశస్వి
త నగడించిన శాశ్వత ధన్యజీవి;
సార్థకంబైన, దతని భాగ్యంబుతుదకు;
వంశమునుగాంచు, నున్నతిప్రథవహించి.

ఉ. నీవును నీగృహంబు మరి నీకులవర్గము బంధుజాతియున్
భావుకమైన దిప్పు, డనవద్యతచెంది; తరించినారు పో
యావిలమేర్చి నీదుజనకాదులు; గైకొనుమయ్య! తుష్టిమై
దీవన లంపినారు భవదీయకృతింగని వారు, ధీవరా!

ఇంద్రుఁడునుజంద్రుఁ డంచుస్తుతించులోకో- !
యంకితం బన్నఁగాదు, మహానుభావ !
యిహపరంబుల ముక్తి ఘటించు జీవి;
కం తెరుంగని సద్యశం బది యమర్చి.

దానికి డబ్బుగావలెయథార్థముగా;
అది లేనినాఁడు, త
ద్ధ్యానమె కష్టమౌఁ; గనుక,తప్పక
సిల్కొనియుండుటొప్పు బో
[illegible]నము నిండియున్నపుడు సజ్జనుఁ;
[illegible]యి, యోగమున్న మా
ధానమొసంగిన న్సుముఖతన్బడు
నోయి ! తదర్థకోశముల్.

అంతియేకాని, కేవల మర్థ మట్టి
క్రియలసాధింపఁజాల;దారెండుఁగలిసి
రావలయునోయి! యపుడ, తల్లబ్ధినిజము
లలితగృహగణ్య ! లక్ష్మీనారాయణార్య !

అటులెటులౌనటంచు, మరి,
యచ్చెరువుం దలయెత్తవచ్చు; ఉ
ద్భటధనధాన్యముల్గలభవాదృశులున్,
భవ దుత్తము ల్విశం
కటముగనున్న నేఁటి సుయుగంబున;
నిట్లొక సీక యీ సము
త్కటయశమబ్బ,టింతకు
నితాంతనిదర్శనమయ్య!రై పతీ!

చ. ధనియు,జమీనుదారుఁడు,నుదారుఁడు,
ప్రాభవమున్న వాఁడు, నీ
జనకు; డతండె, యంకితప్రశస్తిని
గైకొనలేకపోయె; ప
మనెదొ, తదీయ భాగ్యమిపుడాత్మ
కులంబున నీకదక్కెఁ; నీ
ధనికత, యోగము, న్నమతఁదాల్చెనో!
యింతకుఁ. బల్వెలాన్వయా !

చ. అదియునుగాక, వాఙ్మయమునం
దెనలేని యపూర్వతన్ బ్రియం
వదమగునిట్టి పెద్దకృతి, భాసుర
వాసమయబ్బెనన్నచో
అది, మరి, యెంతయోగము! మహాశయ!
యింత, కనశ్వరప్రథా
స్పదకులవర్ధనుండవగు భాగ్యము,
నిన్నెవరించెఁబో, యిటన్.

సీ. సతతభూధనధాన్యవితరణ ప్రముఖులై
ప్రథను జేకొనిరి మీవారు తొల్లి
అతులవిద్యాభోజనాది ప్రదాతలై
పేరుగైకొనిరి మావారు మున్ను
బహుగ్రామ వివిధాధిపత్యప్రవర్తులై
ప్రముఖతఁబడిరి మీవారు తొల్లి
పృథులవింజరపురీవిమల సంస్థానులై
ప్రబలతఁగొనిరి మావారు మున్ను

గీ. ప్రభుకులీయుఁడ వీవు; నేఁబ్రభుబుధేంద్రి
కవికులీయుఁడ; దొర వీవు, కవిని నేను
గలిసితిమి మన మిట శిలిగమ్మువలన
అరయ నేఁడిట్లు, లక్ష్మినారాయణార్య!

గీ. పొలములిచ్చిన ఘనులు నీపూర్వు;లవని
సర్వ మర్పణ చేసిన స్వార్థరహితు
లాత్మవంశ్యులు; ధనివి, విద్యాధనుండఁ
బరిచితులమైతి మంబికా కరుణ నేఁడు.

ఉ. ఎమ్మెయినైన, నన్నస లెరింగిరియె
యుందు; వొకప్డు పూర్వమీ
ఖమ్మముమెట్టు నే నమిత గౌరవ
మొందిన భవ్యసీమ; ది
వ్యమ్ముగ దుందుభీజనచయంబుల,
బ్రహ్మరథోపమానవా
హ్యమ్మున, గ్రామ మేగి విజయ
ధ్వనులన్ గృతిరాజభూషితా !

సీ. దేశమ్ము స్వాతంత్ర్యదీప్తి దీపింపంగ
సంతరించితి శాంతిసమరకృత్యా
జనతకున్ స్వారాజ్యచైతన్యమొదవింప
వ్రాయఁగల్గితి భావలహరి రచన
వసుధపైఁబూర్వాంధ్రవైభవోన్నతిఁజాట
రచియించియుంటి నాంధ్రప్రతిష్ఠ
ప్రజలలో సౌభాగ్యభావాలు రేకెత్త
గ్రంథించినాఁడ స్వరాజ్యసమర

చ. ధనియు,జమీనుదారుఁడు,నుదారుఁడు,
ప్రాభవమున్నవాఁడు, నీ
జనకు; డతండె, యంకితప్రశస్తిని
గైకొనలేకపోయె; ప
మనెదొ, తదీయ భాగ్యమిపుడాత్మ
కులంబున నీకదక్కె; నీ
ధనికత, యోగము, న్నమతఁదాల్చెనొ!
యింతకుఁ. బల్వెలాన్వయా !

చ. అదియునుగాక, వాఙ్మయమునం
దెనలేని యపూర్వతన్ బ్రియం
వదమగునిట్టి పెద్దకృతి, భాసుర
వాసమయబ్బెనన్నచో
అది, మరి, యెంతయోగము! మహాశయ!
యింత, కనశ్వరప్రథా
స్పదకులవర్ధనుండవగు భాగ్యము,
నిన్నెవరించెఁబో, యిటన్.

సీ. సతతభూధనధాన్యవితరణ ప్రముఖులై
ప్రథనుఁజేకొనిరి మీవారు తొల్లి
అతులవిద్యాభోజనాది ప్రదాతలై
పేరుగైకొనిరి మావారు మున్ను
బహుగ్రామ వివిధాధిపత్యప్రవర్తులై
ప్రముఖతఁబడిరి మీవారు తొల్లి
పృథులవింజరపురీవిమల సంస్థానులై
ప్రబలతఁగొనిరి మావారు మున్ను

ప్రసక్తమైయుండె నీవు నేఁడుఁబఱుపంగఁదగ్గ
కవికులీయుండ; వోర నీకుఁ, కొనని నేను
గలిసితిమి మన మిట్టి శిలగమ్మువలన
అరయ నేఁడిట్లు, లక్ష్మీనారాయణార్య!

హాలముల్లిచ్చిన ఘనులు నీపూర్వులవని
సర్వ మర్పణ చేసిన స్వార్థరహితు
లాత్మవంశ్యులు; ధనివి, విద్యాధనుండఁ
బరిచితులమైతి మంబికా కరుణ నేఁడు.

. మ్మొయినైన, నన్నస లెక్కింగిరాయె
యుంటు; వొకప్డు పూర్వమీ
ఖమ్మముమెట్టు నే నమిత గౌరవ
మొందిన భవ్యసీమ; ది
వ్యమ్ముగ దుందుభిజనచయంబుల,
బ్రహ్మరథోపమాన-వా
హ్యమ్మున, గ్రామ మేగి విజయ
ధ్వనులన్ గృతిరాజభూషితా !

దేశమ్ము స్వాతంత్ర్యదీప్తి దీపింపంగ
సంతరించితి శాంతిసమరకృత్య
జనతకున్ స్వారాజ్యచైతన్యమొదవింప
వ్రాయఁగల్గితి భావలహరి రచన
వసుధపైఁబూర్వాంధ్రవైభవోన్నతిఁజాట
రచియించియుంటి నాంధ్రప్రతిష్ఠ
ప్రజలలో సౌభాగ్యభావాలురేకెత్త
గ్రంథించినాఁడ స్వారాజ్యసమర

గీ. మింకనున్ బెక్కు గురుకృతుశేచి వ్రాసి
యిప్పు డీ పరిశోధన కృతి విశేష
మున్నగ్రథించితి లోకశుభోదయముగ
అందుకొనుమిఁక ఘనయశంబాంధ్రపుత్ర!

గీ. తలవని తలంపుగాఁ, బొందఁగలిగి తంకి
తంబు ఈ మహాకవి కాళిదాసు నిప్పు;
డదియుపో, మరి, భాగధేయమ్ము; మొట్ట
మొదటికృతియిది; కృతిరాజపూతచరిత!

సీ. అతిదయాహ్లాదయురా లాపరాశక్తి తా
నినుమడించిన శుభదృష్టిఁ జూడ
ఆంధ్ర పుణ్యక్షేత్రమైనభద్రాద్రిది —
వించిన సభ నన్ స్మరింపఁ జేయ
ఆల స్వరాజ్యసమరమంకితం బూనిన
శిలిగము కులపతి పిలువనంపఁ
గవియామునూల వెంకటశాస్త్రి శ్రీశాలి
దివ్యతరాదరాతిథ్య మీయ

గీ. ఇచట కేతెంచి నేనిప్పు డింతవరకు
నుండుటాయె,మరి,కృతిమహోత్సవమ్ము
జరుగుటాయెను బరిచితి పెరుగుటాయె
లక్ష్మినారాయణా ! కృతి రాజ గణ్య !

మ. అటు, శ్రీకాకుళ మండలం బిటు,
సమజ్యాఖండమద్రాస్మహో
కటకప్రాంతము, మధ్యనున్నధరణీ
ఖండంబునన్, వెండియున్

ఎలుల శ్రీముఖవిస్ఫురన్మాంత్రికమహా
నిష్పవస్థమందుక, మహో
న్మాదుతన్ విశ్రుతమైన గ్రంథ మిదిః
సౌభాగ్యంబహో, సీకిఁకన్

కం. కలిగినదానికిందగిన
కర్జై యొనర్చితి; మేలుబంతి కాఁ
గలిగితి వున్నవారి; కీఁకఁ,
దై కొనుమయ్య! త్వదీయులై నపూ
ర్వుల చరితార్థపద్ధతి;
నిరూఢిగఁ దండ్రినిమించు బిడ్డవై
యలఘుయశంబుపొందుము,
మహాశయ! మేలగు నీకు మీకిఁకన్

# కవీ!

సీ. నిన్న మొన్నటివాడవా? నీవు;కొన్ని
నందలేండ్లకు వెనుకటివాఁడ;వహహా !
యెంతదృఢమైనదో ! నీ యనంతకీర్తి
తనువు;కగ్గదుగదర ! సుంతయుఁ;గవీంద్ర !

సీ. ఎవరవో,యెప్పుడేమహీధవుని నిండు
కొలువు పుష్పింపఁజేసితో,తెలియదాయె
సుంతయైనను మాఘాదిసూరులట్టు
లాత్మకథ వ్రాయవై తిగదా;కవీంద్ర !

సీ. మధురగంభీర మార్దవమంజులమ్ము
భావయుక్తమ్ము,నీ కవిత్వప్రవాహ;
మందు,విహరించు శుభసమయమ్ములందు
నాలు కన్నీరు;నీచరిత్రమ్ముఁ దలఁచి.

మ. అలకాకుంతలనున్నతించునపు
డాహ్లాదమ్ము నుప్పొంగి వి
హ్వాలతాతన్మయతల్పిగిర్చి
వియదుద్యచ్ఛుభ్ర మందానిలం
బుల వీధిన్ప్రియురాలిగూడి
పలుసొంపు లిజమ్ము నాకాశ నా
వలలో మైరులొనర్చుచున్నటుల
భావంబౌఁ గవి శ్రేణికిన్.

మ. కాళీ మాతృపదాబ్జసేవనమునన్
గై కొన్న,నీదౌ కవి
త్వాలాపామృత నిర్ఝరీఝరుల
నీతగ్గొట్టుచున్నప్పుడో
కాళిదాస! త్వదీయచిత్రపటముల్
గన్పింపకున్నన్; కళా
శ్రీలం జిమ్మెడు;నీ ముఖాబ్జము,
కవిశ్రేణీమనోదృక్కులన్.

ఉ. నీ కవితాధునీమధుర
నీరకణాంతర భావలేశవుం
జాకము ప్రాచ్యమౌట,
మనప్రాచ్యకవుల్మదమొందవచ్చుఁ;గా
నీ,కవిసార్వభౌమ !
మునుపెట్టితపంబొనరించితో! ప్రజా
నీకము సర్వమున్;విడువ
నేరదు నీకవితావిహారముల్.

సీ. అజవిలాపమ్మునో రారఁబఠింపఁదాఁ
గటికివాఁడైన నక్కటికమూను
అలరతీరోదనం బాలకించిన గాజు
కన్నుసైతము నశ్రుకణమురాల్చు
యక్షప్రవాసము నరసిచూచిన వెల
యాలునున్ సాధ్వీత్వమందఁజూఁచుఁ
గణ్వునిపుత్రికాగమన దుఃఖంబెన్న
శిలయుసైతము నశ్రుజలముగార్చు

గీ. అచట దుష్యంతుడప్పుడాహ్లాదభరిత
హృదయుఁడై కురిపించిన పదరసమ్ము
తనివితీరగ మనసిచ్చి త్రావునేని
మైమరచు నిజంబెట్టి ధీమంతుఁడైన.

ఉ. ఇంతయశస్సుగాంచిన
కవీంద్రమహేంద్రుఁడవయ్యుఁగూడ;అ
వంతయు,నీ కథామధుర
వాహినిలో,హృదయైకహర్ష నౌ
కాంతిమఖాగమెక్కి కడు
హాయిదలిర్ప విహారముల్,నిర
త్యంతరవృత్తి సల్పుకొను
భాగ్యము,మాకిడవైతి;వోకవీ!

చ. పనసతొనల్ భుజించితివొ;
బాగుగ ద్రాక్షరసంబ్రగోలితో;
ఒనర ననాసపండ్లు;
నొకటొక్కటిగాఁదునుకల్పొనర్చి యు-
తునకలు,తియ్యనైన
హిమతోయములందగ నంజుకొంచు,భో
జనమొనరించితో;
కవితసల్పెదుపట్లఁ;గవీంద్రశేఖరా!

ఉ. పడియు లేనిదే,కవి కు
లేశ్వర! నీకవితాసరోవరం
బేమును:బొంపు,మాధ్వశ
కవీంద్రరసజ్ఞుల కింతహాయి సం
పాదన మెట్లగున్? అయిన,
పశ్చిమపండితులైన మార్క్డనల్
షూదిరి దూరదేశికులు,
మైమరవన్నిను మెచ్చు లెట్లహో !

మ. తలపస్థార మహీనివాసులగు
విద్వన్మాన్య పాశ్చాత్యపు
ష్కలవిద్వాంసులు నీకవిత్వరస
మాస్వాదించి మత్తిల్లి యా
వల,నాట్యంబొనరించిరంట!
ముదమాపన్ లేక;యోహో! భవ
ద్విలసత్కావ్యరసంబ గుత్తగొనెఁ
బృథ్వీలోక మెల్లన్;ప్రభూ!

ఉ. భారతభూమియంతయును,
బాలిశతాతిలతైల కూపమం
దూరెడి నేఁటికర్కశ
దినోదయవేళలఁగూడ,ఁపూర్వపున్

ఖ్యాతకీర్తి నిల్పెఁ,గవి
బ్రహ్మరపిందుర్గిని పేరితో,నిదే
ధారుణి వెండియున్
పసుపుఁదాల్చితివా? కవిశేఖరాగ్రణీ !

ఉ. మరపేమాత్రములేని నీదయిన
జన్మస్థానపున్ భక్తికిన్
పరమానందము; కాని, యాకవియు
స్వర్గంబేగె నుద్యద్యశః
స్వరము ల్మాతృమహీతలంబునకు
సంపాదించి; తత్ప్రీతమం
దొరుకెవ్వారిఁ కనర్హులో, యెవరి
సంయోగించెదో, సత్కవీ !

శ్రీమత్పరదేవతాయైనమః.

# మహాకవి కాళిదాసు

## ఋతుసంహారము.

ఋతుసంహారము కాళిదాసుని చిరుతకబ్బము. అది మూఁడు సర్గములతో నిండియున్నది. తదీయంబగు ముఖపత్రము రచయిత కాళిదాసని చెప్పుచున్నను, బంగీతమండలికిఁ గొంత కాలమువరకు నా పలుకులు నమ్మఁదగ్గవిగాఁ గనఁబడలేదు.

ఎవరో సామాన్యకవి వ్రాసి దానిని గాళిదాసుని పేరఁ బ్రచురించి యుండవచ్చునని వారి విశ్వాసము. సురుచిరములగు కాళిదాసుని తక్కుటి రచనల కది భావమునను భాషయందును వెనుకఁబడి యున్నది. సుప్రసిద్ధవ్యాఖ్యాత, నిరుపమ బుద్ధి శాలియు నగు మల్లినాథుఁడు దానిని వ్యాఖ్యానించక వీడిఁ బుచ్చెను. ఆలంకారికులు తమ తమ యలంకార గ్రంథములం దందలి శ్లోకముల నెందును నుదహరింపరైరి. ఇఁకఁ గవిమహాశయుని యితర కృతుల వెలుఁగులు చిలికెడు ఆ నైతికగుణ సంపదయు నయ్యెడఁ గనఁబడదు. కాబట్టి యది కాళిదాసీయము కానోపదు. ఇది వారి తుది పరిష్కృతి.

ఋతుసంహారము కాళిదాసుని మొట్టమొదటి రచన. అందువల్ల నా భాషాలాలిత్యము, ఆ భావగాంభీర్యము, ఆ నైతికగుణసంపద యందుఁ గనఁబడకపోయినఁ గనఁబడకపోవ

చ్చును. కాని, యాతని యితర కృతులలోఁ గల యాశైలీ సౌలభ్యము, ఆ ప్రసాదగుణము నందుఁ గొంతమట్టుకు సన సన్నని సువాసనలఁ జేరేచుచున్నవి.

ఆలంకారికు లందలి శ్లోకములను గైకొనలేదనుట వాస్తవమే. అయినను, పర్యాలోచనములఁ బరిపక్వదశతో మిసు మిల్లుగొలిపెడు కాని యితర కృతులతోనే వాని వ్యవహృతి పరిపూర్ణమై యుండవచ్చును. అప్పు డికఁ దొలికృతి యగు ఋతుసంహార మక్కఱయుండదు. మల్లినాథుఁడు మహా మహోపాధ్యాయుఁడు. ఋతుసంహారము గ్రథనసౌలభ్యముఁ గల చిన్నపొత్తము. కాబట్టి దానిని వ్యాఖ్యానింపవలసినంత యావశ్యకత యతనికి గోచరింపకపోయినది. కాబట్టి యక్కావ్య మెట్టుఁ జూచినను గాళిదాసుని రచనయే కాని మరొకఁడు గాదు. పండిత ప్రపంచమున బహుళసంఖ్యాకులీ తీర్పుపట్ల సౌముఖ్యము చూపుచున్నారు. ప్రకృతి మానవసంబంధముగా శృంగారపు బాటలలోఁ బర్యటింప మనసుపడిన కవిశేఖరుని తొలికబ్బము ఋతుసంహారము.

మహాకవి కావ్యమం దెందును భావేతి వృత్తముల మర్యాదలకు విరుద్ధముగఁ బర్యటించి యెఱుఁగఁడు. వత్సభట్టి క్రీ.శ. 5వ శతాబ్దముయొక్క రెండవభాగమునను్న మనీషి. మందసారులోని సూర్య దేవాలయమునం దతఁడు వ్రాసిన శిలాశాసన మొకఁడున్నది. మందసారు మాళవదేశములో

నిది. ఇది యిప్పటి పేరు. పూర్వమిది దశపురముగాఁ బ్రఖ్యాతమై యుండెడిది. ఆ శాసనమునుబట్టి చూచినను, ఋతుసంహారము కాళిదాసుని రచనగానే దర్శనమొసఁగుచున్నది. అది ప్రాచీనకృతియే కాని, కొందరు పండితు లూహించిన క్రీస్తుశకపు కవిరచన కాదనుట కా శిలాశాసన మొక ప్రబల నిదర్శనము.

పయోధరైః కుంకుమరాగపింజరైః,
సుఖోపసేవ్యైర్నవయౌవనోష్మభిః;
విలాసినీభిః పరిపీడితోరసః,
స్వపంతి శీతం పరిభూయ కామినః

ఋతు॥ 5—9

స్మరవశగతరుణజనవల్లభాంగనావిపులకాంతపీనోరూ
స్తనజఘనఘనాలింగన నిర్భర్త్సితతుహిన హిమవాతే.

వత్సభట్టి—౩౩.

పైది ఋతుసంహారములోని శ్లోకము. క్రిందిది వత్సభట్టి వ్రాసిన శిలాశాసనమందలి శ్లోకము. రెండింటిని బరిశీలించి చూచినఁ బారస్పరిక సంవాదములు కనఁబడుచున్నవి. అయినను, పై శ్లోకమందలి చక్కఁదనము క్రింది శ్లోకమున మృగ్యము. కాళిదాసుగారి ఋతుసంహారపు శ్లోకములుగా నుండునట్లు వ్రాయవలయునని యుత్సహించినాఁడు వత్సభట్టి.

కాని, యత్నము యాశించినతము ఫలితము కాఁజాలకపోయినది. అతఁ డొక కవిమాత్రుఁడే కాని, సిద్ధహస్తతఁగల మహాకవివంటివాఁడు కాఁడు

విద్యుత్వంతం లలితవనితాః సేంద్రచాపం సచిత్రాః,
సంగీతాయ ప్రహతమురజాః స్నిగ్ధగంభీరఘోషం;
అంతస్తోయం మణిమయభువస్తుంగమభ్రం లిహాగ్రాః,
ప్రాసాదాస్త్వాం తులయితుమలం యత్ర తైస్తైర్విశేషైః.

మేఘ—66.

చలత్పతాకా న్యబలాసనాథా,
న్యత్యర్థశుక్లా న్యధికోన్నతాని;
తడిల్లతా చిత్రసితాభ్రకూట,
తుల్యోపమానాని గృహాణియత్ర.

వత్సభట్టి-10.

ప్రకృత మీా రెండు శ్లోకములుఁగూడఁ బరామర్శనీయములు. పై శ్లోకము మేఘ సందేశీయము. క్రింది శ్లోకము వత్సభట్టిది. ఇక్కడను బైమాత్రిగఁ గొంత సదృశతఁ గలదు. అయినను మేఘదూత మందలి గ్రథన ఘనత వత్సభట్టీయమునఁ గనఁబడదు.

ఋతుసంహార మేఘదూతముల శ్లోకములకు వత్సభట్టీయ శ్లోకములకును ఇట్టి పోలిక యింకను విశేషించి కలదు. ఈ పోలిక కేవల మొకఁటి రెండుచోట్ల నున్న నిదేదో సాందర్భిక మనుకొనవచ్చును.

అట్లుగాక, విశేషించి పొరలాడుచున్నది. కాబట్టి యిది యైచ్ఛికమే కాని సాందర్భికముగాదు. ఇప్పుడు ఋతుసంహార మతిప్రాచీనకృతియనియు, దాని కీర్తోజ్జ్వలత్వ మేకాక, పూర్వమును బహుళపరిచారమున్నదనియుఁ దేటతెల్లమైనది.

ఋతుసంహారము ఋతువులను గురించి వ్రాయఁబడిన పొత్తము. సంవత్సరమునకు నారు ఋతువులు. ఈ యారు ఋతువులను అందలి యారు సర్గములు. నొక్కొక్క సర్గ మొక్కొక్క ఋతువుగ, వర్ణించి చూపుచున్నవి. ఋతువుల చరిత్రె వర్ణించిన మానవీయవిజ్ఞానము పరిపూర్తి కాఁజాలదు. అదియు మానవుల కవశ్యోపాస్యమే. కాబట్టి ఋతుసంహార, మది చిన్నపుస్తకమే యైనను, మానవకోటికి సర్వకాల సర్వావస్థలయందును అక్కరఁగల కాలవిజ్ఞానము నుపదేశించెడు దివ్యకృతియని నుడువవచ్చును. నవనవోన్మేషముఁగల రచన, లవి పెద్దవైనను చిన్నవైనను, ప్రజకు సమారాధ్యములే కాఁగలవు.

అకావ్యము గ్రీష్మఋతువర్ణనతో మొదలయినది. వసంతము ఋతువులరాణి. కాబట్టి యది వసంతర్తువుతో నారబ్ధమైయుండిన బాగుండెడిదని కొందరి తలపోత. ఎవరివో కొందరి తలపోతలుకంటెఁ గాళిదాసుగారి తలపోత యెంతేఁ బరిగణింపఁదగ్గది. వసంతఋతువు ఋతువులరాణి యనునది కాళిదా సెఱుఁగని విషయముకాదు. అందువల్లనే యతఁడు దానిని చివర కట్టిపెట్టి—

"ప్రచండసూర్యః స్పృహణీయ చంద్రమాః,
సదావగాహ క్షమవారి సంచయః;
దినాంతరమ్యోఽభ్యుపశాంతమన్మథో,
నిదాఘకాలోఽయ ముపాగతః ప్రియే!".

ఇట్లు వస్తునిర్దేశముగా నిదాఘసమయముతోఁ దన కావ్యము నారంభము చేసినాఁడు. కావ్యమందలి ఋతుచరిత్రమంతయు నొక ప్రేమికుఁడు తన ప్రేమికతోఁ జెప్పుచున్న కాలయాపన కథవలె నున్నది. మొదటినుండి తుదివరకు ప్రేమికా ప్రేమికులు శ్రోతృ కథకులై యున్నారు.

దినాంతరమ్యంబు నభ్యుపశాంత మన్మథమ్మునై నిదాఘకాలము దొరఁబడినది. పవళ్ళయందు సూర్యాతపము చండప్రచండత విజృంభిగు చున్నది. దోషాసమయము లందుఁ జంద్రుఁడు స్పృహణీయములగు చక్కని చంద్రికలను వెద చల్లుచున్నాఁడు. ఇఁక వారిసంచయ మన్నివేళల నవగాహక్షమమై యున్నది.

ఇది కేవలము జ్యేష్ఠాషాఢమాసము లందలి ప్రకృతి చిత్రీకృతికి దృఢతరమైన పునాది. ఒకవేళ మహాకవి కావ్యమును వసంతముతో మొదలుపెట్టిన మిగిలిన ఋతువర్ణనమంతయు నీరసమై యుండెడిది. కావ్యమందలి ఋతువర్ణన శృంగారమార్గగామి. అట్టి మొదల నది గ్రీష్మముతో నారంభమై వసంతముతో నంత మగుటయే సమంజసము. వసంతము

మిక్కిలి సురుచిరమైన సమయము. వస్తుజాతమందలి సురుచిర పదార్థములను ముందున నిల్పెట్టి తక్కిన పదార్థములతో వ్యవహృతి చేయుట మతిలోకోత్తరుల పరిపాటి. మహాకవి కాళిదాసుఁ డద్వితీయబుద్ధిశాలి. కావ్య మందలి యాద్యంతము లట్లు పొసఁగియుండుట కిదియే ప్రబలోపపత్తి.

దానం జేసి కావ్యమునకు సకలని మంచి సౌందర్యపుష్టి లభించినది. గ్రీష్మమునకు మానవులపైఁగల పలుకుబడి—

సముద్గతస్వేద చితాంగసంధయో,
విముచ్య వాసాంసి గురూణి సాంప్రతం;
స్తనేషు తన్వంశుక మున్నత స్తనాః,
నివేశయంతి ప్రమదాస్సయౌవనాః—7.

ఈ శ్లోకమునఁ గొంత కనఁబడుచున్నది. జవ్వనులు తాపమున కోర్వఁజాలమిఁ దమ స్తనోన్నతములందు దళసరి బట్టలను తీసివైచి సన్నని వస్త్రముల నుంచుకొనుచున్నారు. అవి కేవలము స్తనాంశుకములు. ఇఁకఁ గట్టుకొనుటకును వారు సన్నని చీరలనే వాడుదురను నర్థమును గూడ నీ శ్లోకము ధ్వనింపఁ జేయుచున్నది. నిదాఘకాలము నందొక యౌవనులే కా, రందరును దాపభారమువల్ల సన్నని బట్టలనే ధరింప నభిలషింతురు. కాని, కావ్యము శృంగారమార్గముగా నుదయించినది. అందువల్ల మహాకవి యువకవర్గమును మాత్రమే కైకొని నాఁడు.

సచందనాంబువ్యజనోద్భవానిలైః,
సహారయష్టిస్తన మండ లార్పణైః;
సవల్లకీ కాకలి గీత నిస్వనై,
ర్విబోధ్యతేసుప్త ఇవాద్యమన్మథః.—8.

ఈ శ్లోకమునందు వాపులుకుబడి యింకను ప్రబలమైయున్నది. చందన ద్రవముతోఁగూడిన వ్యజనానిలమ్ములు, హారయుతంబులగు స్తనమండలంబుల సమర్పణాలు, వల్లకీసమన్వితంబులగు కాకలీగీత నిస్వనమ్ములుఁగలిసి యంత వరకుఁ బ్రసుప్తుని వలె నున్న మన్మథుని మేల్కొల్పుచున్నవి.

ఇంకేమున్నది! అతఁడు నిద్రలేచియు లేవఁగనే చైత్రయాత్రకు బయలుదేరఁగలఁడు. అందుకుఁ దగినసన్నాహమంతయు సంసిద్ధమైయున్నది. యువతీయువకుల మనస్సులన్నియు నిఁక నతని ప్రభుత్వాధీనములు. అతని ప్రభుత్వమందు ప్రోషితత్వ మొక గొప్ప నేరముగాఁ బరిగణింపఁబడుచున్నది. దానికి విధింపఁబడెడు దండన దుస్సహము. ఈ—

అసహ్యవాతోద్ధత రేణుమండలా,
ప్రచండసూర్యాతపతాపితా మహీ;
న శక్యతే ద్రష్టుమపి ప్రవాసిభిః,
ప్రియా వియోగానల దగ్ధమానసైః.

శ్లోక మదే విషయమును బురస్కరించుకొని యేమేమో యుపన్యసించుచున్నది. పంటవలంతి దుర్భరవాతోద్ధత రేణు

మండలంబు, ప్రచండసూర్యాతప తాపితంబునై ప్రియావి యోగానల దగ్ధమానసులగు ప్రవాసులకుఁ జూడ నలవికా కుండ నున్నదఁట. ఇదంతయుఁ బ్రకృతికి మానవజాతిపైఁ గల ప్రాబల్య వినరీకృతియందలి మచ్చుతునుక.

ఇఁకఁ దదీయ ప్రాభవము పశుపక్ష్యాదు లందును ఎట్లు చెలాయించుచున్నదో గమనించవలసియున్నది. అటవీమధ్య దేశమందలి మృగములు భృశమ్మగఁ బ్రచండాతప తాపితమ్ము లయిపోయినవి.

తృషాధిక్యమువల్లఁ దదీయములగు తాలువులును బరి శుష్కము లైపోయినవి. పానీయావశ్యకత మితిమీరిపోయి నది. ఏమియుఁ దోచమి నొక్కసారి పైకిఁ జూచినవి. అది కేవలము భిన్నాంజన సన్నిభంబగు నభము. కామార్తులు ప్రకృతి కృపణులు. కాబట్టి యది పానీయ జలంబని భ్రమపడి పరుగులెత్త సాగినవి. ఈ—

శ్వసితి విహగవర్గః శీర్ణపర్ణ ద్రుమస్థః,
కపికులముపయాతి క్లాంతమద్రేర్నికుంజం;
భ్రమతిగవయయూథః సర్వతస్తోయమిచ్ఛన్,
శరభకులమజిహ్వంప్రోద్ధరత్యంబుకూపాత్ -23.

శ్లోక మీ విషయమును ఇంకను నొక్కి చెప్పుచున్నది. శీర్ణ పర్ణద్రుమస్థంబగు విహగవర్గము తాపశ్వాసలతో సమాచితమై యున్నది. కపికులము నితాంతక్లాంతమై నగనికుంజమును జేరుచున్నది. ఇఁక గవయయూథము జలాపేక్ష నంతటఁ దిరు

గుచున్నవి. ఈ భేకములు కూపాంబువులను దెచ్చుకొను చున్నవి

> విశుష్కకంఠాహృతశీకరాంభసః,
> గభస్తిభిర్భానుమతో௨నుతాపితాః;
> ప్రవృద్ధతృష్ణోపహతా జలార్థినో,
> న దంతినో కేసరిణో௨పి బిభ్యతి. —1౫.

దప్పిగొనినపుడు సమయము విచిత్ర మేమనఁగా దిమ్మరియున్న వేదండములు సింహ మగపడినను భయపడకున్నవఁట. పాములు గ్రీష్మ తీక్ష్ణతాపము తాళఁజాలక నెమలిపింఛముల నీడలకుఁ జేరుచున్నవఁట.

సహజముగా సింహ వేదండములకుఁ నితరేతర బంధుత్వములేదు. మయూర ఫణులును బరస్పర ద్వేషులే. సింహమును జూచిన వేదండము గడగడ వడఁకును. నెమలిని జూచినప్పుడు పాము నిలువున నీరై పోవును.

కాని యాపత్సమయమందవి యా భయక్రౌర్యములను వీటిఁబుచ్చి యన్యోన్య ప్రణయభావముతో మెలఁగుచున్నవి. ఇది చక్కని కవితాకల్పన. ఇట్టి సమయోచిత కవితాకల్పన లొకయెడఁ గవిత కెంతేసందము సంఘటింపుచు, మరొక యెడ లోకమునకు శ్రేయోదాయకములగు చక్కని యుపదేశముల నందిచ్చును. అవి కేవలము జంతువులు. మామూలు వేళలందు వాని కైకమత్యము లేకున్నను విషమ సమయము లనవన్నియు సమరసభావముతో మెలఁగుచున్నవి. “నరత్వాం

స్తంభం లోకే" యని యగ్నిపురాణ మనుచున్నది. సరజన్మ మింతేని నొప్పది. ప్రాణికోటియందు మానవుని బుద్ధిబలము సర్వోత్కృష్టము.

సామాన్య శేముషీగల సుకవికావ్యాదులే లౌకికమత్యము నభిలషించునప్పు డసామాన్య శేముషీగల మానవజాతి దాని నెంత గౌరవించినను గౌరవించవలసినదే. సాంఘిక బలము మొక్క విలువ యట్టిది. నదులు మట్టిలోని స్తనులు. కాబట్టి మృగాదు లొకప్పు డేకత నారాధించిన, నదులు దాని నెప్పుడు ప్రాజింపందగును.

ఆ ప్రాజా ఫలితము చెక్కుచెదరని సాంఘిక క్షేమము. కాబట్టి యది మానవజాతి కవశ్యారాధ్యము. ఇంత యమూల్యోపదేశమును ఋతుసంహారము కవితాకల్పనగా లోకమున కందించుచున్నది. కాబట్టి యీ కావ్యము పరిమాణమునందుం జిన్నదయ్యును అఖండగౌరవముం బడయందగ్గ దివ్యకృతి. "విశ్వశ్రేయః కావ్య"మ్మను ప్రోక్తి కది యెంతయుం బాసంగి యున్నది. నిరంకుశమైన గ్రీష్మ ప్రభుత్వము దుర్భరము. వనాంతము లెందుఁజూచినను బటుతర దవదాహమువల్లనుచ్చుష్కసస్య ప్రరోహమ్ములు బహుపవన వేగంబున నుత్క్షిప్త సంశుష్కపర్ణమ్ములు దినకరపరితాపము కతనఁ బ్రక్షీణత్వో యమ్ములునై పశ్యప్రజ కుదైన్యోర్భితి నావహించుచున్నవి. కాని, పెరుగుట విరుగుటకొరకే యని పెద్దల విస్రంభము. తదనుగుణంబుగ నా నిరంకుశ ప్రభుత్వముపై దండెత్తివచ్చి

మొగలిపూరేకులు తదీయమ్ములగు దరహాసములను మా-బాగుగాఁ గనఁబరచుచున్నవి.

ఇంతకుఁ బూర్వము మాసిపలము కాని యటకనుపట్ట ఘూము లిప్పు డెందుఁజూచినను బలుతెరఁగులఁ గన్నులపండువుగాఁ గనఁబడుచున్నవి. ఎంతలో నెంతమార్పో! అంతయు సృష్టి వైచిత్రి.

ప్రాకృతిక దృశ్యము లొకప్పుడు మనోహరములు. మరొకప్పుడు చేతో మోదకమ్ములు. ప్రస్తుతము గ్రీష్మ వర్షావసరంబుల చిత్రీకృతిగా మహాకవి లోకమునకొక మంచి యుపదేశము నిచ్చియున్నాఁడు. ప్రాణికోటి జీవితములు కేవల దుఃఖితములు గావు, కేవల సుఖితములును గావు. అవి సాధారణముగా నుభయసమన్వితములు. భగవంతుని సృష్టియందు మానవజాతి మహత్తమము. అది తన మహత్త్వమును నిలఁబెట్టుకొనవలె నన్నను లేక యింతకంటెను పైకిఁబోవలె నన్నను దగిన సుకృతములు చేసికొనవలెను. తదీయోత్క్రాంతికి లేమి సమయము కాదు, కలిమి సమయమే సర్వవిధముల నోహద మీయఁగల కాలవిశేషము. కాబట్టి మానవులు తామెంత మేలుకొన్న నంత సుకృతవంతులు కాఁగలరు. ఇది యీయుపదేశమందలి సారాంశము. ''కావ్యం ... ... కాంతాసమ్మిత తయోపదేశయుజే'' యను మమ్మటుని ప్రోక్తి యిచ్చోట సమన్వయించుకొనునది.

ఈ యుపదేశమంతయు కాంతాసమ్మితత్వము మంచి ప్రాస్తావిక వాక్యముగాఁ గాలక్షేపము చేయఁగలదు. ఇప్పు డేమి చూచినను ఘనాగమస్వాముల వారి సభామండపము విచిత్రశోభా పంక్తులతోఁ గలకల లాడిపోవుచున్నది.

ఒకవైపున శ్రోత్రమనోహర స్వనమ్ములతో వలాహకమ్ములు మంద మంద గమనమ్ములు సలుపుచున్నవి. మరొక వైపున విస్ఫురాధర ప్రభిన్న వైడూర్య నిభంబులగు తృణాంకురములతోను ప్రోత్థితకందళీ దళంబులతోను ఇంద్ర గోపకమ్ములతోను గూడి శుక్లేతర రత్నభూషితయగు వరాంగన మాదిరిగాఁ గ్రొంగ్రొత్తపులకింపులను నలుగడల బహురమ్యముగాఁ బ్రసరించుచున్నది. ఒక యెడ నవోదకము కీటరజస్తృణాన్వితమ్మై విపాండురమ్మై సాధ్వసభేకకుల నిరీక్షితమ్మై భుజంగగతి ప్రసర్పితమ్మునై నిమ్నాభి ముఖంబుగఁ బ్రవహించుచున్నది. మరొక యెడ భూధరమ్ములు సితోత్పలాభాంబుద చుంబితోపలంబులు ప్రస్రవణ సమాచితమ్ములు ప్రవృత్త నృత్యమయూరమ్ములునై పశ్యులకుఁ బలు తెరంగుల లోచనోత్సవము నొదవించుచున్నవి.

ఒకచోట శక్రధను ర్విభూషితంబులగు తటిల్లతలు, తోయ భరావలంబులగు పయోధరమ్ములు; మరొకచోటఁ గాంచీమణికుండ లాదికముతో సముజ్జ్వల దీధితుల నొలికించు జవ్వనులు.

ఇది యతని పేరోలగపుఁ గోలాహలము. ఇఁక నాట సాపులకుఁ జేతఃప్రీతి యెందుకుఁ గాదు? అది యసహ్య సంభవము. అతని ప్రభుత్వము బాహుగుణ్య రమణీయమైనదియే. అయినను, ప్రవాసుల ప్రమదల కందేమియు సౌఖ్యము లేకున్నది. అది విధినిర్ణయము కాఁబోలు. అయినఁ గావచ్చును. ఎంతటి యుత్తమ ప్రభువైనను అందరిని సమానముగా సంతోష పెట్టలేఁడు. కాని, శుకులకు మాత్ర మది చాల బాగున్నది. వారు కృతాపరాధులైనను ఖండితలు వారి నప్పుడు చక్కఁగాఁ జూడసాగిరి అది వారి యదృష్టము. కాల మెప్పుడు నొక్కరీతిగాఁ జనదు. పరివర్తనలు సృష్టికి సహజగుణములు. ఇఁకఁ గ్రొత్తకోడలు శరదృతువు పాదము పెట్టఁబోవుచున్నది. ఆమె మొదటఁ గ్రొత్తదే కాని, తరువాత మంచి ప్రౌఢ, మరియు నింటికిఁ బెద్దకోడలు. ఇప్పుడు కాకున్న, రేపైనను ఆమె గృహపత్ని కాక తప్పదు. కాబట్టి యిఁక వర్షాగమ రాజు రామ, కృష్ణ యనుకొనుచు నోకమూల కూర్చుని హాయిగాఁ గాలముఁ గడపుట మంచిది.

మొత్తముమీఁద శరన్నవ వధూమణి ప్రవేశించినది. ఆమె రూపరమ్యతను వర్ణించుటకు వాఙ్మయమందు సరియైన మాట లగపడకున్నవి. ఆమె యాపక్వశాలి లలితానతగాత్రి. తదీయవక్త్రము వికచపద్మమనోజ్ఞతలకుఁ బుట్టిల్లు. ఆ వధూమతల్లి నిత్యము ధరించునది యే యంగడిలోను లభింపని యమూల్య కాశాంశుకము.

హేమంతము తలయెత్తినది. సీమాంతరంబు లన్నియుఁ బ్రభూతమ్ములగు శాలిప్రసవంబులతోను, మృగాంగనల బిలుఁగు గుంపులతోను, మనోహరంబులయిన క్రౌంచనినాదములతోను గ్రిక్కిరిసి చేతోమోదము సేయుట కహమహమిక వెలిపుచ్చు చున్నవి. ఇది కామరసానువిద్ధులగు ప్రేమికులకుఁ జక్కని సమయము. వారిప్పుడు పరస్పరాంగవ్యతిరిక్తులై, వక్త్రము లొకయెడఁ గమ్మని పుష్పాసవామోదము లొలికించుచుండ, నంగము లింకొకయెడ నిఃశ్వాసవాతముల సురభీకృతములగు చుండ సుఖశాయిక లనుభవింపఁ గలరు.

ఇది నాల్గవసర్గములోని ముచ్చట. నాల్గవసర్గమందుఁ బదునెనిమిది శ్లోకములుమాత్రమే కలవు. అందలిసుమారొక యారుశ్లోకము లుదయకాలమందలి ప్రేమికల రూపచిత్రణము నకుఁ బ్రత్యేకింపఁబడియున్నవి. ఆ రూపచిత్రణము కొంత కాల్పనికము, కొంత లోకరూఢమునై యున్నది.

ఇఁక, ఋతువర్ణనమందు మొత్తాదుగ నిమిడి రమణీయ ముగ దర్శనమిచ్చుచున్నది. ఒకవైపు లలితప్రరూఢమ్ములగు శాల్యంకుచయమ్ములు, మరొకవైపు శ్రవణసుఖంబులగు కమ్మని క్రౌంచనినాదములు నహమహమికతో ననుగమించుచుండ నల్లనల్లన శిశిరకాల మవతరించినది. అది ప్రమదల కఖండ ప్రియాపాది. కృతాపరాధులు, కాబట్టి, బహువిధతర్జితులు; అందువల్ల సవేపథులు, సాధ్వసలుప్తచేతనులైనను, సురతాభి

లాషులునై యుండెడు యువకులకును అది ప్రియకారియే. అప రాధములకు స్వస్తిచెప్పి మహిళలు సాభిలాషమ్ముగ వారి నాదరించి చేరఁదీసెడు సుసమయమది. ఈ విషయప్రతానము పంచమసర్గప్రసంగి. వెనుకటిసర్గమువలెఁ బంచమసర్గమును ఋతా వసానమందలి ప్రమదలపరిస్థితులను విశేషించి ప్రదర్శించు చున్నది.

మొదటి మూడు సర్గములు ప్రాకృతికచిత్రణముతో శ్రశిష్టమ్ముగ నిండియుండఁ జతుర్థపంచమసర్గములు మానవ జాతిపైఁ జెలాయించెడు తదీయప్రాభవముతో దట్టింపఁబడి యున్నవి.

చివరకు ఋతుసంహారము హాయిగాఁ దన గమ్యస్థా నముఁ జేరుకొన్నది. అభిరామమందస్మితంబులతో వసంత యోధాగ్రణి ప్రత్యుద్గమించినాఁడు. సర్వము చారుతరంబుగ నున్నది. దివసంబు లెటుగాంచినను మాధురీరోచుల నెగుర నేయుచున్నవి. ప్రదోషమ్ము లొక్కమారుగా దరీదృశనీయ ములై పోయినవి. ఇఁక ద్రుమంబులు సపుష్పంబులు, సలిలం బులు పద్మసంగమ్ములు, సమీరణము సుగంధమయము. అది యెంత పుణ్యయుగమో! సముజ్జ్వలకుసుమశోభలతోఁ బలాశ వనంబులు సముద్గమించి యటు సందీప్తవహ్నితుల్యంబులు ఇటు మరుదవధూతమ్ములునై దశదిశలఁ గ్రిక్కిరిసిపోయినవి. అందుచేతనే కాఁబోలు వసుంధర కా క్రొంగ్రొత్త తులకింపులు.

అంతయు మనోజ్ఞముగానేయున్నది. కాని, కాంతవియుక్తులకుఁ గాంతాపరిఖేదితచిత్తవృత్తులకును అది యస్తోకబాధాకరము. కాబట్టి కేవలులగు యధ్వగుల కది సౌఖ్యప్రదాయి కాదు. ఇఁకఁ దక్కుఁగలవారల కెల్లరకు నది ప్రశస్తసమారాధ్యము.

శ్రావ్యతరంబులగు, కోకిలగానములతో దిశదిశలు కిలకిలలాడెడు ఆవసంతయుగము ప్రత్యేకమొక జనతకే కాదు, తదన్యంబులగుపశుపక్ష్యాదులకునుసంసేవ్యము. ఆసుభగజ్యోత్స్నలు ఆదీర్ఘదోషలు మధురమధురంబులు. చివరిసర్గము—

"కుందైఃసవిభ్రమవధూహసితావదాతై,
రుద్యోతితాన్యుపవనాని మనోహరాణి;
చిత్తం మునేరపి హరంతి నివృత్తరాగం,
ప్రాగేవరాగమలినానిమనాంసియూనాం.

ఈవిధముగా నిటు బహిః పరిదృశ్య మానంబులగు బహువిధ ప్రకృతి వర్ణనలతోను అటు ప్రాణికోటిపై నధికరించెడు తదీయ ప్రాబల్యముతోను సమ్మ్రవిలీనమై యొకవిధముగా మైమరపించెడు జిలుఁగు నెత్తావుల కాశ్రయ మొసఁగుచున్నది. ఉద్యానవనంబులు విభ్రమ యువతీ హాసితములు వలె నవదాతములై పూచిన మల్లెలతో మనోహరంబుగ నుద్యోతించుచు రాగమలినంబులగు యువకుల మనస్సులనేకాక నివృత్త

రాగంబులగు మునిచిత్తంబులనుగూడ జోకొట్టి యాకట్టు చున్నవి. అది మహిష్ఠంబయిన తదీయ ప్రాభవము.

మహాకవి కాళిదాసుని యితరకృతులను సమీక్షించిన మతిమ్మలకు ఋతుసంహార మొక తోదీయః కృతిగాఁ గనఁబడును. కవికులాగ్రణికిఁ బ్రకృతియందుఁ గల యానైసర్గిక ప్రీతి ఋతుసంహారమందు మొలచియున్నది,

ప్రాణికోటిపై, విశేషించి, ప్రేమికులపై నధికరించెడు అందలి ప్రకృతిప్రాభవ ప్రస్తావము మిక్కలి వల్గుతరము. తదీయ కవిత బహువిధశక్తిమంతము. అయినను, గాళిదాసునకు స్వతః సిద్ధమైయున్న యామహిష్ఠ వ్యంగ్య సంపద యందెందును గనఁబడకున్నది. కాని, యతనిరచనా ప్రణాళికలలోఁ గ్రొకంటి చూపుల నభిరామముగఁ జూచెడు అప్రమదిష్ఠతా మహనీయత అందు బొత్తిగా లేవనుట యసాంప్రతము అందుఁగల యుప మలును జాలమట్టుకు అభిరామములు. మొత్తముమీదఁ గాళి దాసుని యితర రచనలందు సమాచితమ్ములై శోభించెడు అనవనవ భావ సంపద లందుఁ గనఁబడవు. ఒకవేళ అట్టి గరిష్ఠ భావసంపద రాఁదలఁచినను బసచేయుట కందలి వస్తుప్రపంచ మునఁదగు వసతియు లేదు. ఆప్రపంచమంతటిది. పిండికొలఁదియు రొట్టె. కాబట్టి కథాంశమును బట్టి భావవర్ణనాదికము లఘుత్వగురుత్వములఁ బడయఁ గలదు.

ఋతుసంహారమందలి రచన సర్వతంత్ర స్వతంత్రము. అది కాళిదాసుని తొలికృతియే యైనను, అందతఁడు తన్నుఁదా గుర్తించుకొని వ్యవహరించినాఁడు. అదియు ఖండకావ్య ప్రపంచమున మేఘదూతమువలె నొకవిధముగ నవనవేత్యలలోనే విహరించుచున్నది.

కాని, మొదటిదాని వైఖరి యొకటి, రెండవదాని వైఖరి మరొకటి. మొత్తముమీదఁ గాళిదాసుని రచనలయందలి కథాంశములన్నియుఁ బ్రకృతి మానవ నిష్ఠ్యాతములని యుచ్చరింపవచ్చును. అమలినప్రేమ యతని కెంతయుఁ బ్రేష్ఠతమమైన విషయము. వ్యసనప్రేమల నడుమఁగల తరతమత నతఁ డస్తోకబోధితుఁడు. వ్యసనగ్లాని యెఱుఁగని శుద్ధప్రేమ చిరంజీవి. ఇఁక దానికాద్యంతములుండవు. మానవజాతి సాతిలేని యోగక్షేమములఁ బడయుచు నుచ్చైఃస్థితిఁ బ్రభూతతరంబుగ వర్ధిల్లవలయునన్న నట్టి దివ్యప్రేమ నిత్యోపాస్యము. ఇది యతనికి మొదటినుండియుఁ గల విశ్వాసము ప్రకృతి మానవమార్గముగ దాని నతఁడు తనకృతుల నతివల్గుతరంబుగ గుంఫించి ప్రదర్శించుట కిదియే మూలము.

ఋతుసంహార మట్టి కృతులలో మొట్టమొదటి కబ్బము. సాహితీప్రపంచమునఁ గాళిదాసు త్రొక్కినత్రోవ యొకయెడ సాహిత్యపిపాసుల కనంతనవ్యము, మరొకయెడ శ్రేయోలిప్సులగు లోకులకు నిరంతర గ్రహణీయము.

కాని, కవిశేఖరుఁడు తన యమూల్య తపస్సునకు సముచితమైన శాశ్వతసిద్ధిని ఋతుసంహారము లోనుగాఁగల తన తొలిరచనలందుఁ బ్రాపింపలేకపోయినాఁడు. అందలి శృంగార వర్ణనయనశ్వరత యెఱుఁగని బాహ్యేంద్రియ సంబంధియే కాని, నిరవధికతృష్ణాపాతియగు హృచ్ఛయము కాదు. మాళవికాగ్ని మిత్రమునుండి తొంగితొంగి చూచుచున్న

"అనాతురోత్కంఠిత యోః ప్రసిద్ధ్యతా,
సమాగమేనాపి రతిర్న మాంప్రతి;
పరస్పరప్రాప్తి నిరాశ యోర్వరం,
శరీరనాశోఽపి సమానరాగయోః". —3 , 15.

ఈ శ్లోకమిప్పుడు బోధనీయము. అనాతురోత్కంఠితులకు ఎట్టకేలకుఁ బరస్పర సమాగమము సిద్ధించినను అందు రమణీయత యుండదు. సమానురాగులకుఁ బరస్పరప్రాప్తి నిరాశఁ జేసి శరీరనాశము దాపురమైనను అది యత్యర్థపరిష్ఠము. ఇప్పుడు కవిధీరుని ప్రేమభావముచ్చైస్తమమైనదే కాని, లఘిష్ఠతమమైనది కాదని తేటతెల్లమైనది.

ఇత్వరతలేని బలిష్ఠజీవి యమలిన ప్రేమ. క్షణభంగురతఁగల దుర్బలజీవి వ్యసనము. అది యాధ్యాత్మికము. ఇది కేవల శారీరకము. అది హృచ్ఛయము. ఇది లోచనవాసి. అది పారలౌకికము, పారమార్థికము. ఇది ఐహికము, ఇంద్రియసౌఖ్యసంబంధి. అది మానవసంఘమున కన్నివిధముల నత్యుత్తమగతుల

నోదవింపఁగలదు. ఇది దానిని బెక్కుతీరుల నధఃపాతాళము నకు సాగనంపఁగలదు. ఇది మహాకవి కాళిదాసుగారి ప్రేమ తత్వము. ఈ తత్వమతనికి సాహితీరంగమునందుఁ జొచ్చిన మొట్టమొదటి దశయందే యలవడినది. ఋతుసంహారమందుఁ బ్రకృతివర్ణన ప్రధానవిషయము. దానంజేసి మానవప్రేమల ప్రస్తావమున కందుఁ దగిన యగ్రస్థానము లభింపఁజాలక పోయినది. మరియు నయ్యెడఁ బాత్రములు, సన్నివేశములు, కదలిక, క్రమబద్ధమగు కథావస్తువు మొదలగున వెవ్వియు లేవు.

కావ్యమందుఁ బ్రకృతికిఁ గల పలుకుబడివల్ల మానవ సమాజముపై నధికరించెడు కేవల బాహిర ప్రేమయేకాని, కవిశేఖరుని యాసమున్నతప్రేమతత్వము దర్శనమీయకపోవుట కా యీవిషయములే ప్రముఖకరణములు.

కాబట్టి ఋతుసంహారము కవిరాజశేఖరుని యితరకృతులగు మేఘదూతాదులకు వినయవిధేయతలు చూపవలసిన చారికయైనది కాళిదాసుని బుద్ధి కుశలతఁగల శుభయుత్వ మమోఘమైనది. అతని యితరకృత్యాలందా సముదాత్త భావము క్రమాభివృద్ధిగ గుణపడుచు హృదయ మధురమ్ముగ మలయికలు. సలుపుట కదియే మూలము. ప్రకృతి వర్ణనలతో నశేషముగ గుంఫితమై యభిరామముగ దర్శనమిచ్చెడు మేఘదూతమందలి పూర్వభాగమునఁ గూడ నది సిద్ధిమంతమై యున్నది. ఇఁక, లోకైక నాటకరాజముగ రోదసీ గహ్వరమున బ్రహ్మాండ సమజ్య వహించి నభూతములైన పరిపూర్ణకళలతో ననన్యముగఁ బ్రత్యోతించెడు అభిజ్ఞాన శాకుంతలమును గురించి యిప్పుడు

వేరుగఁ జెప్పనక్కరలేదు. అందది యమోఘముగ నప్రమేయ సిద్ధిఁ బడసి యద్వితీయముగ నసివారుచున్నది.

ఋతుసంహారమునఁ గల వర్ణనా ప్రాబల్యము కొంచె మించు మించుగఁ గవిశేఖరుని యితరకృతులలోఁ గనిమెనఁగి యున్నట్లగుపించుచున్నది. అకబ్బుమతని రచనయే యని నిర్ధరించి నిర్వచించుట కదియు నొక ప్రబలాధారము.

ప్రచండసూర్యః స్పృహణీయచంద్రమాః,
సదావగాహ క్షమ వారి సంచయః;
దినాంతరమ్యోఽభ్యుపశాంత మన్మథో,
నిదాఘకాలోఽయముపాగతః ప్రియే! 1-1.

ఇది ఋతుసంహారమున గ్రీష్మఋతు వర్ణనకు సంబంధపడి యున్న శ్లోకము. ఇది వెనుక నుదాహృతమై యున్నది. కాబట్టి జిజ్ఞాసులొకమారు గతావలోకన మొనర్చిరేని, యింకను నధికమరయఁ గలరు. దీని ప్రాబల్యా మిప్పుడు—

సుభగ సలిలావగాహాః, పాటల సంసర్గసురభివనవాతాః,
ప్రచ్ఛాయ సులభ నిద్రా, దివసాః పరిణామ రమణీయాః.

ఈశ్లోక ప్రతీకలలో నొకవిధముగఁ బరిఢవిల్లి యున్నదని ప్రాచ్చరింపవచ్చును. ఇది యభిజ్ఞాన శాకుంతలము యొక్క ప్రస్తావనలో నిదాఘ సమయ చిత్రణమునకు ముడివడియున్న శ్లోకము. ఇట్లింకను గొంతమట్టుకుఁ గైకొని సమీక్షింపవచ్చును. కాని, ప్రస్తుతమున కిది చాలును.

శ్రీమత్పరదేవతాయైనమః

# మహాకవి కాళిదాసు

## కుమారసంభవము.

సంస్కృత వాఙ్మయమునఁగల పంచమహాకావ్యములలోఁ గుమారసంభవమొకటి. ఈ కావ్యపంచకమున భారవి మాఘ శ్రీహర్షకవుల రచనలలో నొక్కొక్కదానికి నొక్కొక్క స్థానమే లభించినను గాళిదాసుని రచనలలోని రెండు కావ్యములు రెండుస్థానములనొందియున్నవి. అదియొక గొప్ప విశేషము.

ఈ కవితల్లజుని శ్రవ్యములలోఁ గడుంగడు పరిపక్వమైనది రఘువంశము. అయినను బ్రిస్తుతకావ్యమగు కుమారసంభవమును స్పృహణీయత గలదియే. ఇక్కావ్యమునఁ బ్రకృతివర్ణన నిరుపమమై తొంగలించుచున్నది. కవితాసౌందర్యమును గలదు. వివిధ సన్నివేశముల చిత్రీకృతియు ఘుమఘుమలాడుచున్నది. ఇందలి రచనాచమత్కృతి యొక భారతీయహృదయములనేకాదు, భూగోళమునఁగల వివిధ హృదయములనుగూడ ఆకర్షించుచున్నది. మానవ సంబంధత యిందు మంచిగ్గుగ నిమిడియున్నది. కొన్ని వ్రాతప్రతులీకావ్యము సప్తసర్గమని తెలుపుచున్నవి. మరికొన్ని పదునేడు సర్గలు గలదిగఁ జాటుచున్నవి. ఏదియేమైనను ఇది యెనిమిదిసర్గలు గల కావ్యమని నుడివిన నెవ్వరుఁ గాదనఁ జాలరు.

కాని, యెనిమిదవ సర్గము పురాతనాద్యతన విమర్శ కులబారి కగ్గముకావలసివచ్చినది. కవిసార్వభౌముఁడియ్యెడఁ బార్వతీపరమేశ్వరుల నవ్య వైవాహిక క్రీడలను వర్ణించి యున్నాఁడు. అది పాతౌచితికి భంగకరమనియు, పరమ పూజ్యులు, జగత్పితరులునగు భవానీశంకరులయెడ నంత విచ్చలవిడిగాఁ గలముపోనివ్వఁగూడదనియు వారువిమర్శించిరి.

అట్టివిమర్శకులలో ఆనందవర్ధనుఁడు ముఖ్యుఁడు. ఇతఁడు ధ్వనికారులలోఁ బురోగామి. ఈ సందర్భమున మనోహరి యగు నొక గాథ కలదు. కాళిదాసంత విచ్చలవిడిగాఁ దమ రతిక్రీడలను వర్ణించుటఁ జేసి జగన్మాత యగు పార్వతికిఁ గోపము వచ్చినదఁట. తత్ఫలితముగ నాతఁడామె తీవ్రతర శాపమునకు లోనై యిఁక ముందునకు సాగి పోలేక పోయినాఁ డఁట. ఈ సర్గము విజ్ఞాని లోకమునకు అధిక్షేపణీయమగుటవల్ల మహాకవి తక్కటి గ్రంథమును బూర్తి చేయలేకపోయెనేమో యని కొందరద్యతన సమీక్షకు లూహించుచున్నారు. అని యుండనిండు, ప్రఖ్యాత వ్యాఖ్యాత మల్లినాథసూరి కుమారకావ్యమును ఎనిమిది సర్గములవరకే వ్యాఖ్యానించి యున్నాఁడు. మరియు, నిందు మొదటి యెనిమిదిసర్గములలోను గల యా యుదాత్త రచన శేషించిన భాగమున గోచరింపదు.

ఆభాగ మెంతసేపు దుర్బల పునరుక్తులతోను, బొందిక మాలిన వస్తుగ్రంథనముతోను, నిండియున్నట్లగపడుచున్నది. ఇక, మొదటి యెనిమిది సర్గములలోఁగల యా వర్ణనానైపుణి ప్రయోగసిద్ధమగు ఆ యౌచిత్యము, నిరుపమ ఘనత్వాపాది యగు ఆ రచనా గమన పరిమితి యుత్తరభాగమునఁ గంచు కాగడవైచి వెదకినను గనిపింపవు.

కాళిదాసునకుఁ జాల యిటీవలఁ బొడమినట్టియు, నత నిపై మిక్కిలి భక్తిశ్రద్ధలుగలట్టియు నొకరెవరైనఁ దమకాల మున అష్టసర్గ పర్యవసాయిగనున్న యీకావ్యముఁజూచి,—"ఈ కావ్యము శీర్షిక కుమారసంభవము. దీని తుదిఫలితము లోకకంటకుఁడగు తారకాసురునివధము. కాబట్టి కుమారస్వామి జనించి యతఁడు తారకాసురుని వధించునంతమట్టుకు నీకావ్యము కొనసాగఁబడి యుండవలయును. మహాకవియట్లేరచించి యుండును. ఒకవేళఁ గాలక్రమమున ఆ భాగము చెడలపాలైన దేమో;" యని భావించి తక్కటి కావ్యశేషమును దామె పరిపూర్తి చేసియున్నట్లు తోచుచున్నది. ఇందుకు నా భాగ ద్వితయమునఁదొంగి తొంగి చూచుచున్న యీ రచనా భిన్నతయే ప్రబలతరమైన నిదర్శనము. ఎట్లుపరికించినను ఉత్తర భాగమొక కవిమాత్రుఁడు గ్రంథించిన రచనగాఁ గనిపించు చున్నది. ఇక నిర్వివాదము.

కాళిదాసుని కవిత చక్కని వ్యంగ్యధ్వనులకుఁ బుట్టిల్లు. ఏనిమిదవ సర్గమున నపత్యోదయ భావము ధ్వనించుచున్నది. ఆయపత్యము పురుషసంబంధియని ద్వితీయసర్గములోని యంశ మునుబట్టి నిశ్చయింపనగును.

మఱియుఁ బార్వతీ పరమేశ్వరుల కలయిక కేవలము స్వకీయ భోగములకుఁగాదు, లోకశ్రేయః ప్రాప్తికి. ఈయర్థ మునుగూడ రెండుమూడు సర్గములు దృఢపరచుచున్నవి. తుదకు ఆ కలయిక సిద్ధించినది. తదుపరి కవిరాజశేఖరుఁడు కావ్యమందలి యెనిమిదవ సర్గమున ఆ నవ్య దివ్యదంపతుల వైవాహిక విహారములను బలు తెరంగుల వర్ణనల నోలలాడిం చెను. ఇక సంసుప్రాప్తించు సూచన యిక్కడ రవళించు చున్నది. ఇప్పుడిక్కావ్యశీర్షికయగు కుమారసంభవమను సమస్త పదమును లోతుగఁ బరిశీలించిన నీకబ్బము వైనఁజెప్పినట్లష్టసర్గ సమేతమని చెప్పకతప్పదు. ఇచ్చటి "సంభవము"నకు సంభా వ్యతకుఁగల కేంద్రార్థమునుగలదు. కాబట్టి యిఁకఁ గుమా రుఁడు కలుగవచ్చునను సూచ్యభావమా శీర్షికను నిగూఢముగ సంశ్లేషించియున్నది. అది కాళిదాసుని కవితాసంప్రదాయము. ఇఁక నొకమారు కావ్యఘటితేతివృత్తము నవేక్షించి తదుపరి తక్కటి యంశములను సమీక్షించుట సమంజసము.

ఇక్కావ్యము హిమవత్స్వరూపపు వర్ణనతో నారబ్ధమైనది. వైభవమునసేమి, ఖైశ్వర్యమునసేమి, సౌందర్యమునసేమి,

యన్నివిధముల నిక్కడి హిమవంతుఁడు సర్వహృదయాకర్షణ యుక్తుఁడైయున్నాఁడు. ఇఁకేఁటైనెచ్చు దివ్యుఁడు. సర్వశక్తి సంపన్నతఁగల దైవమూర్తి.

ఇమ్మహామహిమాత్మునిముద్దులబిడ్డయే పార్వతి. ఈ సర్గమున మహాకవి సంతరించిన యీ తుహిన మహీధర వర్ణన సహజ సౌందర్యవంతమై, యద్వితీయమై, యమోఘమై యేచి తులకించుచున్నది. మేనాదేవి యీ నగరాజు పట్టమహిషి. మైనాకుఁడు కుమారుఁడు. ఒకప్పుడు బ్రహ్మమానస పుత్రుఁడగు నారదమహర్షి రాజగృహమునకు విచ్చేసెను. అది పార్వతి పెండ్లియీడునకువచ్చి యతిలోకమైన సర్వాంగ సౌందర్యముతో ఘుమఘుమలాడుచున్న సుసమయము. కొంచెమంతు పారఁజూచి జగత్పితయగు శంకరుఁడీమెకు భర్త కాఁగలవాఁడని వ్యక్తపరచెను. అనాఁడా రాజదంపతులకుఁ జికురించిన యా పరమానందమునకుఁ బొలిమేరలులేవు. శంకరుఁడంతవాఁడు తనకల్లుఁడగుట బ్రహ్మానందమే. కాని, తనకుఁదానై యభ్యర్థించిన నేమనునోయని తిరస్కృతి భీతిఁ దగు సమయమునకుఁ గాచికొనియున్నాఁడు హిమవన్నగ చక్రవర్తి.

ఇంతలో నప్పరమేశ్వరుఁడు తపస్సుచేసికొనుటకుఁ దన్నగమున ననువైనచోటు నరసి యక్కడ నాశ్రమనిర్మితి

మొనర్చి యందు మకాముచేసెను. ఇంటికి వచ్చినవారిని గౌరవించుట గృహస్థ ధర్మము. కాబట్టి యతఁడు తన పుత్రికా రత్నమగు నుమాదేవి నా మహనీయునకుఁ బరిచర్యచేయ నేర్పాటుచేసెను. ఇది తొలిసర్గపుగాథ.

అక్కాలమున దేవతలు తారకాసురుని వలనఁ బడెడు బాధలకు మితిలేదు. అక్కతమున దేవతాగణమంతయు నింద్రపురస్సరముగ బ్రహ్మ యాస్థానమునకరుదెంచి తమ వెతలు వెలార్చి తరణోపాయలబ్ధి నిమత్తమతని బదింబదిగ బ్రతిమాలుకొనిరి. కాని, ప్రయోజనములేకపోయెను. అంతకు మునుపే బ్రహ్మ యతనికిఁ బలువరములొసంగియున్నాఁడు. విషవృక్షమునైనను, విత్తునైచి పెంచినవారు పీకరుగదా. కాబట్టి పార్వతికిఁ బరమేశ్వరునకుఁ బుట్టనున్న కుమారుఁడప్పనికి సర్వసమర్థుఁడని వాచించి యతఁడు వారల బంపివైచెను. పదపడి యింద్రుఁడొకనాఁడు తనయాస్థానమునఁ గాఁగల శుభ కార్యమునకుఁ బార్వతీ పరమేశ్వరుల వివాహమత్యావశ్యక మని నిశ్చయించెను. కాని, పరమేశ్వరుఁడు యోగసమాధిలో మునిఁగి తేలుచున్న సమయ మది. పార్వతికిఁ బరమేశ్వరుని యెడ ననురక్తి కలదు. ఇఁక మిగిలిన లోటు తీరుటకు బుపంద యెఁడు పూవిలుకానికిఁ గబురంపెను. ఇది రెండవసర్గపు వస్తువు.

పిలుచుటయే తడవుగఁ గందర్పుఁడప్పుడు స్వర్గపతి నిండుకొలువున వచ్చి నిలిచెను. ఆనాఁడు దేవేంద్రుఁడతనికిఁ

జేసిన గౌరవమపూర్వము, మరియు ననన్యము. దాననెంతయు నుపొంగిపోయిన మన్మథుఁడప్పుడు ప్రభువేదిచేయుమనినను సంసిద్ధుఁడైయుండెను.

చివరకు మఘవుఁడు తగిన యదను దిలకించి యతనికిఁ దనయభిలాష నామూలముగ నివేదించెను. అదెంతపనియని పంచబాణుండు మూట ముడిఁగట్టి హిమాచలమునకు బయలు దేరినాఁడు. వెంట సతీమణి రతీదేవి యత్తమామల ముదల నొంది వెంబడించినది. గమ్యస్థానము చేరుసరికి మిత్రుఁడు వసంతుఁడు కూడఁ బ్రత్యక్షమయ్యెను. మొత్తముమీద మనోజునకుఁ గావలసిన కార్యమునకు వలసిన సామగ్రియంతయు సమకూరియున్నది. కాని, యమ్మహత్తమమూర్తిని జూచియుఁ జూడఁగనే తొల్లిటి ధైర్యసాహసములు సడలి యబ్బాయికి నిలువునఁ గంపముపొడమసాగినది. అంతలోనే పార్వతమ్మ ప్రవేశించినది, భగవత్సేవనిమిత్తము. ఇఁక నదే తగిన సమయ మనుకొని సడలిన ధైర్యసాహసములను గొంచెము చిక్కఁబట్టి సమ్మోహనాస్త్రమును బరగించెను. శివుఁడు చలించి తన ప్రేమదృక్కులను పార్వతి ప్రేమదృక్కులకుఁ బ్రసరింపఁజేయ నుంకించెఁగాని, యప్పటికప్పుడ మేల్కాంచి తన మనశ్చల నమునకు మూలముఁ దెలిసికొనెను.

దురదృష్టవశమున రతీవల్లభుఁ డాతని కంటఁబడెను. వెంటనే తృతీయనేత్ర ప్రయోగమును జరిగెను. ఇఁకేమున్నది!

అతఁడట్లు మూఁడవకన్ను దెరచెనో లేదో యితఁడప్పుడే భస్మావశేషుఁడై పోయెను. ఇది తృతీయసర్గలోని ముచ్చట.

ఒక్కమారుగాఁ గొండవిరుచుకొని పడినట్లు మీఁదఁబడ్డ యాదుర్భర విపదగ్ని జ్వాలాపరంపరలకుఁ దట్టుకోలేకపోయినది పాప మానాఁడా కోమలహృదయ రతీదేవి. అపూర్వ శోకదవానల దందహ్యమానయగు నా యబల నాఁడెంత విలపించి కుంది కృశించిపోయినదో! నిజమానాఁడాపె శోకస్రవంతికి గట్టులులేవు. ఇఁక నాపాడు జీవికను రోసి సహగమనమునకు నిశ్చయించుకొన్నది. అంతలోనే యాకాశవాణి శుభోదంత ధ్వనిపరమున నామెను గాపాడినది. ఆమెకు వైధవ్యములేదు. పార్వతీ పరమేశ్వరుల వివాహము త్వరలోనే కానున్నది. ఆ వివాహమైన యుత్తర క్షణముననే రతీసతీమణి తన మనోహరుని బడయఁగలదు. ఇది యా శుభోదంతపుఁ బరమార్థము. ఇది నాల్గవసర్గపు గమన విశేషము. రాకుమారి యాశలు నిరర్థకములైనవి. ఆమె కలలు కల్లలైనవి. మొత్తముమీఁదఁ జేతికందినపండు జారిపోయినది. అయినను ఆపెసాహసము సామాన్యముకాదు.

వాస్తవముగ నామె యనన్యసౌందర్యవతి. అయినను నది యిప్పుడ నిర్గుణమయినది. త్రికరణశుద్ధిగ వరించి ప్రేమించిన ప్రేమికుని హృదయము నాకర్షింపఁజాలని యా

శారీరక రమ్యత యింక నెంతమాత్రి మాదరణీయము కాం జాలదని మానసించి యామె కఠినాతి కఠినమగు తపస్సుం జేయ నవలంబించినది.

ఇంకం దన మనోహరుని హృదయాహరణమున కదియే సర్వోత్కృష్ట సాధన మని యామె దృఢ విశ్వాసము. అట్లుం గొంతకాలము గడచినది. ఒకనాండొక బ్రహ్మచారి యామె యాశ్రమమునకు వచ్చెను. అతిథిసత్కృతి యాశ్రమ ధర్మము. కాబట్టి యతండక్కడం దగు నాదరణం బడసెను. తదుపరి ఆ బ్రహ్మచారి రాకుమారి నాతపస్సునుండి తొలంగింప నెంతయుం బ్రయత్నించెను. కాని, తుదకది యఫ్హరహితమై పర్యవసించెను. అప్పుడతండామె శంకరుని ద్రికరణశుద్ధిగ వరించియున్నదని గ్రహించెను. మరి, యతండొక మామూలు బ్రహ్మచారి కాండు, సాక్షాత్పరమేశ్వరుండు. అది యతండు మారువేసమున సంతరించిన హృదయ పరిశోధన. సౌందర్యో పాసనవల్ల లొంగని పరమేశ్వరుండు తుదకుం దపస్సువల్ల దాసుండైనాండు. ఇది పంచమ సర్గ వ్యవహారము.

అప్పుడాదిదేవుండు పార్వతీ పాణిగ్రహణమునకు పర్వ సంసిద్ధతమై నుండెను. కాని, తండ్రికిం గన్యాదానఫలము దక్కవలయునని యుమాదేవి యుబలాటము. అదే యంశ మును నెచ్చెలి ముఖమునం జెప్పికుని కెరింగించినది తత్కాల హర్షోత్కర్షనిమగ్న యా గట్టురాచూలి.

జగత్పతి యందుల కియ్యకొని యనుపదంప సప్తమహా ర్షులను మననము చేసెను. వారును వెంటనే యరుంధతీ సమేతంబుగ విచ్చేసిరి. జగత్పతి వారిని రమ్మనిన కారణము విశదీకరించెను. పిమ్మట వారు బయలుదేరి యింద్రప్రస్థము చేరికొనిరి. అది హిమవన్నగ చక్రవర్తికి రాజధాని. వారి కక్కడ సముచితమైన యాదరణ జరిగినది. తదుపరి వారు తమ రాకకుఁగల మూలకారణము రారాజునకుఁ బరిచయము చేసిరి. అప్పుడు గట్టురాజు తన సహధర్మిణి యంగీకృతిఁ బడసి యమ్మాయి పెండ్లికి సుముహూర్తము పెట్టించెను. ఇఁకఁ బెండ్లికి గడు వొక మూడురోజులు. ఇది యారవ సర్గములోని శుభోదంతము. నగరమందుఁ గాదు, రాజ్యమందెందు విన్నను రాజకుమారి పెండ్లిముచ్చట్లే. ఎక్కడఁ జూచినను మాంగళిక తోరణపుఁ దులకింపులే. మొత్తముకు వివాహమహోత్సవమైనది. ఆనాఁడు దేవతల హర్షాతిశయమునకుఁ బొలిమేరలు లేకపోవ చ్చును. అనంతరమా నవ సతీపతులు తమ వైవాహిక విహార ములు పలు తెరంగుల సలిపిరి. ఇది యేడెనిమిది సర్గముల సుఖనైఖరి.

అని నవదంపతులు బ్రహ్మానందపుఁ గల్లోలములఁ దేలి విహరించెడు నపూర్వ దివ్యతరుణము. కాని దేవతల వెతలిం కను నినుమడించుచునే యున్నవి. అప్పుడగ్ని కపోతరూపముఁ దాల్చి యచ్చట కరుదెంచి ప్రియురాలిఁ గూడియున్న జగ

త్పతికి దేవతల తొంటి దుర్దశ దిరిగి జ్ఞప్తికి దెచ్చెను. రతియుఁ బతిని బడసెను.

అప్పుడు శివుని రేతస్సు నిష్పన్నఁ బడెను. దాని ధాటి కాగఁజాలక యగ్ని దానిని గంగలోఁ బడవైచెను. అదే సమయమున నటకు స్నానార్థము వచ్చిన కృత్తికా షట్కము నకు నాపె దాని నర్పించెను. తరువాత యది రెల్లుపొదలోఁ బడెను. వెనువెంటనే యది యారుముఖములుగల మగశిశువుగ వికసించెను. అనుపదంబ పార్వతీ పరమేశ్వరులా శిశువును గైకొని వెళ్ళిరి. ఆ శిశువారురోజులలోనే పెరిగి పెద్దవాడై నవ యౌవనసంపన్నతగల వ్యక్తియయ్యెను. అతఁడే కుమారస్వామి అనతికాలముననే సర్వవిద్యా ప్రవీణతఁ దొనకి లోకైక వీరుఁ డని ప్రఖ్యాతివహించెను. అట్లుండ నొక నాఁ డిందుృఁడు దేవతలతోఁ గూడివచ్చి తమకుఁ దారకాసురునితోఁ గానున్న మహాసంగ్రామమునకు నెదురై పోనున్న దేవతా సైన్యము లకుఁ దమ కుమారుని నాయకత్వము ప్రసాదింపుడని పార్వతీ పరమేశ్వరుల నభ్యర్థించెను. వారును నందుకియ్యకొనిరి. వెంటనే కుమారస్వామి దైవసైన్యమునకుఁ బ్రధాన నాయ కుఁడై దేవాసుర యుద్ధమున విజయము సాధించెను. ఇది శేషించిన యితివృత్తము.

కుమారసంభవము కాళిదాసు రచించిన శ్రవ్య కావ్య ములలో రెండవది. తొలికృతి ఋతుసంహారము. ఈ కబ్బ

ముః నితని కవితాశక్తి ప్రివర్ధమానమై యున్నది. పార్వతీ పరమేశ్వరుల వివాహపుగాథ యిందలి యెనిమిది సర్గములలోఁ గల యితివృత్తము.

అది ప్రిధాన కథ. అందు నింపులొలికించు చారుతర వర్ణనల వైవిధ్యముఁగల యుపకథలును సాగరమున నదులు వలెఁ జక్కఁగఁ గలసియున్నవి. కథా సన్నివేశముల పొందిక యుఁ బాత్రి చిత్రికృతియు హృదయాకర్షకములు. ఇక్కడఁ బ్రికృతి వర్ణన మువ్మురముగ నున్నది. మరియు, నిందు మానవ ప్రికృతులకుఁగల సన్నిహిత సంబంధము చక్కఁగ వ్యక్తము కాఁగలదు. అంతియకాదు, కవికి మానవ ప్రికృతుల బంధుత్వ సంబంధియగు విజ్ఞానముఁ గల బుద్ధి విశేష మమోఘమని పాఠకులియ్యెడఁ దలపోయకపోరు. అందుకు మూల మిందుఁ బొసఁగియున్న ప్రికృతి పాత్రిల సన్నిహిత సంబంధమే. కాళిదాసు ప్రికృతి వర్ణనపట్ల నెంత దిట్టయో మానవవర్ణనపట్లను నంత గడి దేరిన వ్యక్తి. ఈ కుమారసంభవ మున నతఁడు గ్రిహించిన పార్వతీ పరమేశ్వరుల వర్ణనయే యందుకుఁ బ్రిబల నిదర్శనము.

ప్రథమ ద్వితీయ సర్గములు కేవల వర్ణనాత్మకములై యుండఁగఁ దృతీయ సర్గము కథా ప్రాధాన్యమై యున్నది. శతీవల్లభునకు నింద్రుని స్వాగతము, దేవేంద్రుని పేరోలగమున మన్మథుని బడాయి పలుకులు, హిమాలయ పర్వతమున కతని

గమనము, వసంతుని రాక, శంకరుని తపస్సు, పార్వతి ప్రవేశము, మదనుని బాణపాతము, శివుని తాత్కాలిక మనశ్చలనము, పూవిలుకాని భస్మీకరణము—

మొదలుగాఁగల యీ మహత్తర సన్నివేశముల పరంపర కడుంగడు రమణీయమై కళాదృష్టిని గథాదృష్టిని నొకే యొకమారుగాఁ జూరకొనుచున్నది. పంచమ సర్గము పార్వతి తపోవిలసితమునకు బ్రహ్మచారి యాగమనమునకు సంబద్ధమగు కథతో నిండియున్నది. హిమవంతుని యాస్థానమునకు సప్త మహర్షుల రాక, పెండ్లిమాటలు, అక్కడ జరిగిన మర్యాదాది ధర్మములు, తదుపరి వివాహమహోత్సవ వర్ణనము మొదలుగాఁగల యీ సన్నివేశముల వైఖరి మిక్కిలి వరీయము. భారత మహాకవి యిక్కావ్యమందక్కడక్కడ ధర్మశాస్త్రపుఁ బద్ధతులను సొంపులు గులుకు పద్యముల లెస్సగఁ బచరించెను. అది సిద్ధహస్తతఁగల మహాకవుల నైపుణము.

అష్టమ సర్గము దనుకఁ బొటమరించియున్న యిక్కావ్యమున మానవ సంబంధత ప్రబలమై యున్నది. శివుఁడు, కాముఁడు, హిమవంతుఁడు, పార్వతి, రతి లోనుగాఁగల పాత్రలు సహజముగ దివ్యములైనను నిక్కడ మానవీయములగు చిత్తవృత్తులకు మనో వికారములకును వలఁతిరైయున్నవి.

అది కవిరాజమౌళి లేఖినీ ప్రతిభ. ప్రధాన పాత్రము లన్నియుఁ బరిస్ఫుటముగ వివరీకృతములై పాటకరించి తుఱఁగ లించుచున్నవి. వర్ణనపుఁ గ్రమమునఁ దరతమతయుఁగలదు. అవియే సమయాసమయజ్ఞతఁగల శిల్పికారుల పొచ్చెములేని నేర్పరితనము. ఇఁక, మీనారతీదేవు లుపపాత్రములనఁ దగును. హిమవంతుని యిల్లాలు భక్తిఁగల యాదర్శ గృహిణిగ, మదనుని ప్రేయసి దుస్తర విపదుపప్లవ నిమగ్నగను జిత్రించిన కవిగారి కుంచినడ లజస్ర ప్రశంసార్హము లనక తప్పదు. నాల్గవ సర్గమంతయు రతీ విలాపమునకే సమర్పించి యున్నాఁడు కవి సార్వభౌముఁడిక్కడ. సర్గమంతయు వియోగినీఛందస్సంయుతము. సందర్భోచితముగ ఛందస్సును బచరించుటయందుఁ గాళిదాసు సిద్ధహస్తుడు. హిమవంతుఁ డిక్కడఁ బుత్రవంతునిగఁ జిత్రింపఁబడి యున్నాఁడు.

కాళిదాసుని హిమవంతుఁడు గంభీర హృదయుఁడు. చెక్కుచెదరని రాచఠీవిఁగలవాఁడు. దూరదృష్టియు నోపిక యుఁగల ధీశాలి. శంకరుఁడంతవాఁడు తన కల్లుఁడగుట మహావహామే. కాని, తొందరపడి తనకుఁ దానై దరిసి యభ్యర్థింపఁడు.

ఒకవేళ నిరాకరించునేమో యను సాధ్వసత యే యందుకు మూలము. ఇప్పట్ల నతని సమయ నిరీక్ష నితాంత

స్పృహణీయము. మరియు, వినయ విధేయతలుఁగల విశాల హృదయుఁడు. ఈ నిరుక్తి యతఁడు సప్తమహర్షులకు స్వాగత మిచ్చు సందర్భమునఁ దేటతెల్లము కాఁగలదు. మదనుఁడల్ప సంతోషి. తనకుఁగల యవసరమును బురస్కరించుకొని యిందు)ఁడు నిండు పేరోలగమునఁ దనకు నొనరించిన యా గరిష్ఠ గౌరవమునకు నహమహమిక నుద్గమించిన లక్ష్మితన యుని యా భావవిద్యుత్ప్రభలకు నాఁడెందు సమీక్షించినను హద్దులు గనిపింపవు. అది పరిథవిల్లి వెల్లివిరిసెడు పరితుష్టికిఁ గల నిసర్గ గుణము. ఆ యానంద ముత్సాహ పురస్కృతమగు నప్పు డేది చేయుటకైనను మానవుని దెగింపఁ జేయును.

అకృతమునసే చిత్తజన్ము నాఁ—

"స మాధవేనాభిమతేన సఖ్యా,
రత్యాచ సాశంకమనుప్రయాతః;
అంగవ్యయ ప్రార్థిత కార్యసిద్ధిః,
స్థాణ్వాశ్రమం హైమవతంజగామ".

3 స॥ 23 వ శ్లో.

డింత సాహసింపఁ గలిగెను. నిలింపనాథుని కార్యమును నిర్వ హించుటయే ముఖ్యోద్దేశముగాఁగల దాసుగారి మన్మథునకుఁ జివరకు స్వకీయమగు శరీరపుఁ దీపియు విస్మృతమైనది. అదియే సాహసశక్తి. ఉమాకుమారి బాల్యము యౌవన రమణీయ

తియః బిచ్చలించి వర్ణితములైనవి. అయినను నిక్కడది గౌణము. తపస్సువల్ల సాధితమైన సిద్ధియే కాని సౌందర్యము వల్ల లబ్ధమైన సిద్ధి యిక్కావ్యపుటితివృత్తమునఁ గనఁబడదు. ఈ సందర్భమున—

"అద్యప్రభృత్యవనతాంగి! తవాస్మిదాసః
క్రీత, స్తపోభి రితి వాదిని చంద్రమౌళౌ;
అహ్నాయ సా నియమజం క్లమ ముత్ససర్జ,
క్లేశః ఫలేన హి ఘన ర్నవతాం విధత్తే."

ఈ శ్లోకము ప్రబల నిదర్శనము. ( కుమా॥ 5 స॥ 68 వ శ్లో॥ )

ఈశ్లోకమందలి యీ—"క్రీతస్తపోభిరితివాదిని చంద్రమౌళౌ," పాదమును సమీక్షించినఁబై యంశము సువిదితము గాఁగలదు. అనితరలభ్యమగు తన సహజ సౌందర్యమును మహత్తర తపశ్శక్తివల్ల నన్వర్థము చేసికొనఁ గలిగినది పార్వతి.

అన్వర్థతఁ దొనఁకని రమణీయత కాళిదాసుని దృక్పథమున నిర్గంధ కుసుమ సౌందర్యము. అతని యువలోక మార్గమునఁ జారుత్వము—

"ప్రియేషు సౌభాగ్య ఫలా హి చారుతా,"

(కుమా. 5 సర్గ॥ 1 వ శ్లో॥)

వాస్తవముగ నిట్లు పోసఁగి యుండవలయును. అక్కతమునసే కాఁబోలు—

"ఇయేష సా కర్తుమవంధ్యరూపతాం,
సమాధి మాస్థాయ తపోభి రాత్మనః;
అవాప్యతే వా కథ మన్యథా ద్వయం,
తథావిధం ప్రేమ పతిశ్చ తాదృశః"?
(కుమా॥ 5 స॥ 2 వ శ్లో॥)

ఈ నిర్వచనము.

భూధరరాజకుమారికిఁగల యా నైసర్గిక సౌందర్య సంపద యవంధ్యము గావలయు ననఁగా తథావిధ ప్రేమ, తాదృశపతియుఁ జేపడవలయును. అనఁగా, మనఃపూర్వముగఁ బ్రేమించెడు మహామహితాత్ముఁడు మనోరముఁడు గావలయును.

ఆమె దృక్ప్రపంచమున నట్టి మహామహితాత్ముఁడు జగత్పతియగు శంకరుఁడు. తదభీష్ట సిద్ధి ఘోరతమమైన తపఃకృతివల్లఁగాక, సౌందర్యోపాసనవల్లఁ బ్రాప్తింపదు. అది లభించినప్పుడే యాత్మీయమగు సొగసుందనము సార్థకమగును. అందునిమిత్తమే తపఃకరణోపక్రమణము. తపశ్శక్తికి నసాధ్యమెద్దియు నుండదు. ఇదే విషయము నుద్దేశించి మనువు—

"యద్దుష్కరం యద్దురాపం,
యద్దుర్గం యచ్చ దుస్తరం;
తత్సర్వం తపసా ప్రాప్యం,
తపో హి దురతి క్రమం."

సుస్థిరమతి నిట్లు నుడువుచున్నాఁడు.

చేతికందఁబోయెడు పండు జారిపోయినది. కైలాస నాథుని యీ పచ్చలిత బుద్ధి వెనువెంటనే పూర్వ ప్రకృతి నొందినది. గంపెఁడాశతో నెడలేకుండఁగాపాడుకొన్న శారీరకలాలిత్యము వ్యర్థమైనది. అంతదనుక నత్యంతాశాపూరితమైయున్న తండ్రిగారి యభిలాషయు విఫలమైనది.

అది గిరిరాజ తనూజకు నొక పెద్ద యవమానముగఁ గనిపించినది. అదియుఁ జెలికత్తెల సమక్షమున. ఇఁక, దానికిఁ బరిచ్ఛేదము లుండవు. ఈ—

"శైలాత్మజాపి పితురుచ్ఛిరసోఽభిలాషం,
వ్యర్థం సమర్థ్య లలితం వపురాత్మనశ్చ;
సఖ్యోస్సమక్ష మితి చాధికజాత లజ్జా,
శూన్యా జగామ భవనాభిముఖీ కథంచిత్"

( కుమా॥ స॥ 3 శ్లో॥ 75 )

శ్లోకము గమనీయము. మనోరథ వైఫల్య సందర్భమునఁ బార్వతి భావగతులను నిది సుస్పష్టముగ వెలార్చు చున్నది. ఇందలి భావము లోకానుభూతికిఁ జక్కఁగ నందుబాటై యున్నది. రచనాచణతతళుకుబెళుకులు హృద్యములు.

అటవీమధ్య ఘటితమగు నాశ్రమమున మైనాకసహోదరి మనోగత లిప్సఁ గఠిన తపస్సు లాచరించుచుండఁ గాలక్రమమున నొకనాఁడొక బ్రహ్మచారి యయ్యెడ కేతెంచెను.

అతిథేయి యతిథిని యథావిధి సత్కరించినది. అది మూశ్రమ ధర్మము. అతఁడు నిక్కముగ వర్ణియనియే కాని, వేషాంతరలీనుఁడగు భవుఁడని యామె గ్రహింపలేదు. విశ్రామానంతరము బ్రహ్మచారి మాటల సందర్భమున నామె తపఃకరణమునకుఁగల మూలము నరయ నుత్సుకతయు నభిలాషయుఁ బ్రకటించెను. అయినఁ బార్వతి ప్రౌఢ కాదు, ముగ్ధ. కాబట్టి లజ్జాపరవశ. ఆ సందర్భమునఁ గవిమూర్ధన్యుని సిద్ధరచనాచణత—

"ఇతి ప్రవిశ్యాభిహితా ద్విజన్మనా,
మనోగతం సా న శశాక శంసితుం;
అథో వయస్యాం పరిపార్శ్వ వర్తినీం,
వివర్తి తానంజన నేత్ర మైక్షత."

(కుమా॥ 5 స॥ 51 వ శ్లో॥)

ఇట్లు నిరర్గళముగ నసివారుచున్నది.

ఉబుకెత్తియున్న లజ్జాపరవశత నతనికామె ప్రత్యుత్తర మీయనేరక, పరిపార్శ్వవర్తిని యగు వయస్యను వివర్తితానంజననేత్రముల నక్కర్జమునకుఁ బ్రేరేచినది. ఇక్కడఁ గళాప్రపూర్ణుని సమయజ్ఞత యెంతయు శ్లాఘ్యము.

"తథా సమక్షం దహతా మనోభవం
పినాకినా భగ్న మనో రథా సతీ;

నినింద రూపం హృదయేన పార్వతీ;
ప్రియేషు సౌభాగ్య ఫలా హి చారుతా."
(కుమా॥ 5. స॥ 1 వ శ్లో॥)

పార్వతి లోలోపలఁ దన రూప సంపదను బదింబదిగా నిందించినది. ఈహానురూపప్రియలబ్ధికి నోచని తరుణుల సౌందర్య మడవిఁగాచిన వెన్నెలవంటిదని యామె తలపోఁత. ఆశాభంగము వాటిల్లినప్పుడు సాధారణముగఁ జిత్తవృత్తుల భంగిమ లట్లే యుండును.

"ఇతి ద్విజాతౌ ప్రతికూల వాదిని,
ప్రవేపమానాధరలక్ష్యకోపయా,
వికుంచిత భ్రూలత మాహితే తయా,
విలోచనే తిర్యగుపాంతలోహితే."
( కుమా॥ 5 స॥ శ్లో॥ 74 )

పార్వతి శంకరుని త్రికరణశుద్ధిగ వరించినది. తదాప్తి నిమిత్తము కఠినతమంబులగు తపస్సుల నాచరించుచున్నది. ఆమె పరిపూర్ణయౌవనవతి. అయినను వార్ధకశోభి వల్కల ములు దక్క తత్తరుణకమనీయ మగు నాభరణాదికము నొల్లదు.

ఆమెకుఁ గావలసినది దురాపంబగు నాత్మ మనోగత సిద్ధి. తదీయోపలంభనమునకామె నిష్ఠాన్ననైన నురక సంసిద్ధయై యున్న సమయమది. అటువంటప్పుడు సందర్భ వ్యతిరిక్త మగు వర్ణి వాగ్ధోరణి నామె యావంతయు సహింపదు. అతని

పలుకులన్నియు నామెకు ముఖుకులైనవి. హృదయ మిష్ట దూషణశ్రవణ మతి దుస్సహముగఁ బరిగణించును. ఆనాఁ డాపె యాగ్రహము తారాపథమంటియున్నది. దాని నామె పలుకుల పరమునఁగాదు, భావద్యోతకములగు నంగముల వెలువరించినది. అధరము ప్రవేపమానమైనది. భ్రూలత ప్రకుటిలితమైనది. విలోచనము లుపాంతలోహితములైనవి. అప్పుడొక్కసారి వాని నడ్డముగ గ్రుమ్మరించినది బ్రహ్మచారి దృగ్వీథియందు.

అప్పుడామె యతనిని నాదృతిగఁ జూసెనను సామాన్య విషయము కవిరాజమౌళి కరతలమున నింత చమత్కృతమై తొంగలించుచున్నది. ఆహా ! కవిబ్రహ్మవైఖరీ వైవిధ్యవిజ్ఞానము !

"పత్యుః శిరశ్చంద్రకలామనేన,
స్పృశేతి సఖ్యా పరిహాసపూర్వం;
సారంజయిత్వా చరణౌకృతాశీ
ర్మాలేన తాం నిర్వచనం జఘాన.
( కుమా॥ 7 స॥ శ్లో॥ 19 )

అది మేనాతనూజ కౌతుకగృహమునకుఁ గొనిపోవఁ బడనున్న యున్మిషితహర్ష సమయము. నెచ్చెలి పెండ్లికూతురి పాదముల నలంకరించి,—"సఖి ! ఈపాదముతో నీమగని తల పైఁగల యానెలవంకను దన్ను"మని పరిహాసించినది. అప్పుడా

నవలచేతనున్న మాలతో నిర్వచనముగ వయస్యను గొట్టెను. అది విహృతాఖ్యమగు శృంగారానుభావము. మరియుఁ బరి దృశ్యమానమగు లోకానుభూతికి సైరంధ్రినేదిష్ఠము.

వేర్వేరు సమయంబుల నాయికను ముట్టడించిన యీ మనోదృశ్యపరివర్తనలు—చిన్నతనము, సిగ్గు, నిరాశ, పట్టుదల, కోపనత, సమాగంతుకాదరణపరత, మాలాతాడనము మున్నగునవి—కాళిదాసుగారి పార్వతియందిమిడియున్న మానవీయతను బయలుపరచుచున్నవి.

మానవీయహృదయగతుల విజ్ఞానపటిష్ఠత నెంతపరిపూర్ణముఁజో, తదీయరూపవైవిధ్య పరిజ్ఞానమున నంత పారంగతుఁడు మహాకవికాళిదాసు. నాయకుఁడగు మహాదేవునియందు విశేషించి దివ్యతయేకరుడుగట్టి మసలుచున్నది. కాని, యీది మానవమనోవికృతికిఁగొంచెముతావిచ్చినది.

ఈసందర్భమున—

"హరస్తు కించిత్పరిలుప్త ధైర్య,
శ్చంద్రోదయారంభ ఇవాంబురాశిః;
ఉమాముఖే బింబఫలాధరోష్ఠే,
వ్యాపారయామాస విలోచనాని".

"పశుపతి రపి తాన్యహాని కృచ్ఛ్రా,
దగమయదద్రిసుతా సమాగమోత్కః;

కమపర మవశం న విప్రకుర్యు,
ర్విభుమపి తం యదమీస్పృశంతిభావాః."
తృతీయసప్తమసర్గస్థములగు నీశ్లోకములు దర్శనీయములు.

మన్మథుఁడు తగిన యదను జూచి సమ్మోహనాస్త్రము విడిచిపెట్టఁగాఁ గించిత్పరిలుప్తధైర్యత మహాదేవుఁడు చంద్రోదయ దర్శనమున నంబురాశిభంగి బింబఫలాధరోష్ఠంబగు నుమాముఖంబునకభిముఖంబులుగ నాత్మీయమ్ములగుతొంగలి రెప్పలఁ దోలఁగఁదోసెను.

సప్తమహర్షులు రాజగృహమునుండి యరుంధతీసమేతంబుగఁ దిరిగివచ్చి చంద్రమౌళికి జరిగిన వ్యవహారమంతయు నివేదించిరి. అప్పుడు వైవాహిక సుముహూర్తమునకు గడువొక మూడురోజులున్నది. ఆ మూడురోజులును నద్రిసుతాసమాగమోత్కంఠత మునుకలువెట్టుచున్న పశుపతి హృదయాలోకమార్గమున మూడు యుగములుగ రూపొందినవి. అతఁడొక సామాన్యవ్యక్తికాఁడు, సర్వశక్తిసంపన్నతఁదీడింపెడు జగదీశ్వరుఁడు. అట్టి మహామహుఁడే యౌత్సుక్యాదిసంచారిభావములకు సహింపలేనప్పుడిఁక నింద్రియపరతంత్రుఁడగు పృథగ్జనుఁడెంత పరితపించునో! ఇక్కడి సూచితార్థము మిక్కిలి యందగించి యున్నది.

కథానాయకుఁడగు మహాదేవుని పాత్రను గ్రంథకర్త భక్తిభావ కవితాకళలకు ననుగుణంబుగఁ జిత్రించి కృతకృ

త్న్యుఁడు కాఁగలిగెను. అది యతని బుద్ధివిశేషనైపుణ్యముల నాదవిన యనన్యప్రతిభాహేతుకము.

ఎంతరుచ్యమగుపదార్థమునైనను నదేపనిగ సేవించిన విసువుపుట్టకమానదు. అట్టియవకాశమున కిమ్మహాకావ్యమున నిసుమంతయుఁ దావు లేదు. చదివినకొలఁదియు హృదయరంజకముగ నేయుండును. అందలి కథాసంఘటనల పొందికలపందిళ్ల గొరలు వైచిత్రి యట్టిది. ప్రథమ సర్గము ప్రకృతివర్ణనశోభతోను గన్యాయౌవనపరిమళముతోను నిండియుండ ద్వితీయ సర్గము దేవతల బాధలకు సంబంధించిన కథతో నసియాడు చున్నది. ఇఁకఁ దృతీయసర్గము. ఇందలి యింద్రుని పేరోలగము, మదనునిరాక, యతని గర్వోక్త్యుపన్యాసము, నిర్జరేశగ్వుని యభిభాషణము, మనోవికృతిజననంబగు వసంతోదయవర్ణనము, స్థాణ్వాశ్రమస్థంబగు పరిపూర్ణ నిరుపహతి వివరణము, శంకరుని శాంతినైశ్చల్యములు, గిరిజయౌవనసౌరభము గరిష్ఠ రమణీయములు.

చతుర్థసర్గము కరుణారసప్రధానము. ఇందలి ఇతివృత్తము విలాపసంబంది. ఉచ్చైర్నిమతరంబులగు వివిధ కథా సంఘటనల బిగిసియున్న మునటిసర్గమునకిది విరామమో యన్నట్లున్నది.

పంచమసర్గము శైలాధిరాజతనయ ఘోర తపోగాథకు వర్ణి యపస్తుతిప్రసంగమునకు నిల్లైయున్నది. గిరిజ తపోవర్ణ

నాటపీఠసర్గమ భూములఁ బర్యటించియున్న సహృదయ చిత్తములకు హాస్యరసగర్భితంబగు బ్రహ్మచారి జల్పాకత విశ్రాంతి జనకముకాఁగలదు. పిమ్మట షష్ఠసర్గము వివాహసంబంధపు ముచ్చట్లతో నిండియున్నది. ఇందు నరుంధతీసమేతులగు సప్త మహాత్ములు హిమవంతునితో వ్యవహరించిన పెండ్లిబేరములు సర్వకాలసర్వావస్థలయందును లోకప్రసిద్ధములనక తప్పదు. ఈ సందర్భమున ఈ—

"శైల స్సంపూర్ణకామోఽపి, మేనాముఖముదైక్షత;
ప్రాయేణగృహిణీనేత్రాః, కన్యార్థేషు కుటుంబినః."
( కుమా॥ 6 స॥ శ్లో॥ 85 )

శ్లోకము గమనీయము.

పర్వతరాజు తన కూతును శూలికిచ్చి పెండ్లిచేయుట కిష్టుఁడే. అయినను, గృహప్రభుత్వాధికారిణి గృహిణి. ప్రస్తుత కార్యమున కామె యభీప్సిత మావశ్యకము. కాబట్టి యామె హృదయగతి నాకళించుట కటులనై పౌరుషమింత చూచెను.

సాధారణముగ నిదియు లోకప్రసిద్ధియే. కాళిదాసుని దృక్పథమున స్త్రీజనమునకుఁగల యీ మహత్తర గౌరవ ప్రాధాన్యమెట్టిదో యీ శ్లోకము వెల్లడించుచున్నది. సప్తమ సర్గము వివాహమహోత్సవాదికముతోఁ బరిపూర్ణమైయున్నది. అష్టమసర్గము నవదంపతులగు పార్వతీపరమేశ్వరుల వైవాహిక విహారవర్ణనల వెల్లివిరిసియున్నది. ఇక్కావ్యము వక్రోక్తుల దండ డించియున్నది. ఇందుబుకెత్తియున్న హాస్యరసముమనోహరి.

ప్రభువులు ఫలతంత్రులేకాని గుణతంత్రులు గారని యితని విశ్వాసము. ఇప్పుడీ

"తస్మిన్ మఘోనస్త్రిదశాన్విహాయ,
సహస్ర మక్ష్ణాం యుగపత్పపాత;
ప్రయోజనాపేక్షితయా ప్రభూణాం,
ప్రాయశ్చలం గౌరవ మాశ్రితేషు."
(కుమా॥ 3. స॥ 1 వ శ్లో॥)

శ్లోకము సమయానుచితముగాఁజాలదు. ఇందు్రనకు వేయికన్నులుగలవు. అతని వేయికన్నులు దర్బారునకు వచ్చిన లక్ష్మపుత్రునిమీఁదనే ప్రసరించినవఁట. ఇఁక మిగిలిన సభ్యుల మాట ? అవసరమునుబట్టియే రాజు లాశ్రితులను గౌరవింతురఁట. ఆహా ! ఈ యన్యాపదేశవచోధోరణి యెంత యుక్తియుక్తముగానున్నది ! ఇది లోకప్రథితము.

అనితరలభ్యమగు మృదుమధురశైలి యితని లేఖినీ నందనవనముల నజస్రము విహరించుచుండును. శబ్దాలంకారములగు యమకానుప్రాసాదులకును నితని కవితాప్రపంచమున శాంతిభద్రతలు గలిగి హాయిగ జీవించుట కవకాశమున్నది. ప్రస్తుత ముదాహృతిగ నీ—

"ఖేఖేలగామీతమువాహవాహః,
సశబ్ద చామీ కర కింకిణీకః;

తటాభిఘాతా దివ లగ్నపంకే,
ధున్వన్ముహుః ప్రోతఘనే విషాణే.''
( కుమా॥ 7 స॥ 49 వ శ్లో )

శ్లోకమును గ్రహింపవచ్చును.

ఇందలి శబ్దాలంకృతిఁ బాడగట్టు నాజూకుఁదనము మిక్కిలి కమనీయము. గంగాధరుఁడు పెండ్లికిఁ దరలివెళ్లుచున్న సమయమందలి శ్లోకమిది. ఇక్కడ శైలిఁగల సొగసుందనముతో శబ్దాలంకృతుల నాజూకుఁదనము చక్కగ వియ్యమంది యున్నది.

"రత్యాచ సాశంక మనుప్రయాతః;''

నిర్జరేశ్వరుని యోలగమున నంతగా దంభోక్తులు గ్రుమ్మరించిన మదనుఁడు చివరకు హైమవతంబగు స్థాణ్వాశ్రమంబునకు బయలుదేరు సమయమునఁ బూర్తిగ ననుమానపిశాచమున కగ్గమయ్యెను. ఇందలి 'సాశంకపుఁబ్రయోగము మిక్కిలి ప్రధానమైనది. అది యొకానొక యవస్థయందొకానొక నడవడియొక్క సహజమైఖరి యెట్లుండునో విశదీకరించుచున్నది. అది యొకచిన్న పలుకు. కాని, యందిమిడీన యర్థము మోఘము. అదియే సిద్ధహస్తుల చాతురీవదాన్యత. ఈ కాళీవరప్రసాదలబ్ధుని సురుచిర కవితాప్రపంచము సూచ్యసూచనశక్తిసామర్థ్యములఁ బొంపిరివోయియున్నది. ఈసందర్భమున మచ్చుచూచుటకు—

"వివృణ్వతీ శైలసుతాపి భావ,
మంగైః స్ఫురద్బాల కదంబకల్పైః;
సాచీకృతా చారుతరేణ తస్థౌ,
ముఖేన పర్యస్త విలోచనేన."

( కుమా॥ స॥ 3. శ్లో॥ 68 )

"ఏవంవాదిని దేవర్షౌ, పార్శ్వే పితు రధోముఖీ;
లీలా కమల పత్రాణి, గణయామాస పార్వతీ."

( కుమా॥ స॥ 6. శ్లో॥ 84 )

ఈ శ్లోకద్వితయముచాలును. పైశ్లోకము శంకరునకు భావసంచలనమొదవినప్పుడు దగ్గరనున్న మహీధరరాజపుత్రిక వైఖరీ వివరణ సందర్భములోనిది. రెండవశ్లోకము దేవర్షియగు నంగిరసుఁడు హిమవంతునితోఁ బెండ్లిసంబంధపు సంభాషణము సలుపుచున్నప్పుడు తండ్రిప్రక్కనున్న రాకుమారి వైఖరిని వర్ణించిన సందర్భములోనిది. ఈ రెండుశ్లోకములయందును సూచ్యసూచనశాక్తేయనదీష్ణత బహుసుందరముగఁ బల్లవించియున్నది.

మన్మథుని బాణపాతావసరమునఁ గించిత్పరిలుప్తధైర్యుఁడగు హరుఁడు తననైపు రతిభావపుఁజూడ్కులు ప్రసరింపఁజేసినప్పుడు చేరుగడనున్న హిమవత్తనూజ దైహికసంస్థితి యెట్లున్నదో పైశ్లోకము వివరించి తెలుపుచున్నది.

ఆసమయమునఁ జంద్రమౌళియందుఁ దనకును రతిభావముదయించినది. కాని, యా సముదిత భావసారము నామె

పలుకులవల్లఁగాక, యంగములవల్లఁ బ్రకటింపజేసినది. అసమయమందా జవరాలి మొదలు గగుర్పొడిచినదని వాచించుటకు మారుగనామె యంగములు బాలకదంబకల్పంబులయి యున్నవనుట కడుంగడు నందగించియున్నది. రతిభావోదయ తరుణమున గాత్రము పులకితమగుట నవోఢలక్షణము. మఱియు నామె చారుతరపర్యస్త విలోచనంబుల సొబగు నెఱజల్లు నెమ్మోముతోఁ జెంగట సాచీకృతమై నిలఁబడినదఁట. అదియు రతిభావద్యోతకమే. ఇఁక, రెండవ శ్లోకము. ఇందు నంగిరసుఁడుపన్యాసకుఁడు హిమవంతుఁడు శ్రోత. పార్వతియు శ్రోత్రియే. కాని యది రహస్యము.

అచలసార్వభౌముని సమక్షమున నంగిరసుఁడు వరుని గుణగణసంపదను గొండాడుచున్నప్పుడు వధువు తండ్రిచెంగటఁ దలవంచుకొని కూర్చుని లీలాకమలపత్రములను లెక్కించుచున్నదఁట. అప్పుడు తన మనశ్చతురంతలలో మొలతెంచిన హర్షోత్కర్షతను బార్వతి లజ్జాపరవశయగుటంజేసి క్రీడాకమల దళంబులను నెంచు నెపమునఁ బరిపోషించిన దను సూచ్యవస్తువట్లు సూచితమైనది.

ప్రేమికకుఁ బ్రేమికుని మహాత్మ్యమును వినుటయందా సక్తి మెండై యుండును. కవికులాలంకారుని వర్ణనా కుశలత కొన్నికొన్ని ఘట్టములయం దప్రమేయమై రవణిల్లుచున్నది. ఈ యవసరమున ఈ—

"తం వీక్ష్య వేపథుమతీ సరసాంగయష్టి,
ర్నిక్షేపణాయ పద ముద్ధృత ముద్వహంతీ;
మార్గాచల వ్యతికరాకులితేవ సింధుః,
శైలాధిరాజతనయా నయయౌ న తస్థౌ."
(కుమా॥ 5. స॥ 85 వ శ్లో॥)

శ్లోకముదాహరణీయము. ఇందు మతమువైచుక కూర్చిని యున్న రమణీయత నిరుపమము.

బ్రహ్మచారి వాచాలత మితిమీరినది. అంతవరకు నేమేమో జవాబులిచ్చిన పార్వతి యింకనెంతమాత్రము సహింపఁజాలకపోయినది. అయిననేమిచేయును? అతిథిని మాలనాడరాదు. ఇంకఁదానే యటనుండి పోఁదలకొని లేచినది.

అయ్యవసరమున వృషరాజకేతనుఁడు స్వరూపముఁ దాల్చి దరహాసచంద్రికలు వదనపరిసరములఁ జెంగలింప నామెను గరము పట్టుకొని యాపెను. అంతవరకు నడ్డదిడ్డముగ నుపన్యసించిన యా బ్రహ్మచారి రూపాంతరము వహించిన గంగాధరుఁడు. ఆ చిత్రీకృతి యప్పటి పార్వతి సంస్థితిని వివరించు సందర్భములోనిది. అంతదనుకఁ దనతో ముచ్చటించిన యా బ్రహ్మచారి తాను ప్రేమించిన గంగాధరుఁడని యాకలింపఁగనే పార్వతికిఁ గంపము పుట్టినది. ఒడలు చెమర్చినది. అడుగువేయుటకెత్తఁబడిన పాదమెత్తఁబడియేయున్నది. మార్గమున నడ్డముగా నేర్పడ్డ గుట్టవల్ల సంభ్రమితమగు నేటికైపున నా గుట్టలదారి ముద్దులపట్టి వెళ్ళనులేదు నిలువనులేదు.

నిజమాడిన నిష్ఠురము. అయినఁగావచ్చును. సిద్ధ హస్తతఁగల చిత్రిలేఖకుల నొక్కరైనఁ బొంకము చెడకుండ నా సులలిత విగ్రహము నట్లు చిత్రింపఁగలరా? ఏమో, సందేహమే.

అది వాగగోచరమనోహర్ష వర్ధనము, శేముషీశక్త్యతీత మునగు నభూతపూర్వవర్ణనావైచిత్రి. అనశ్వరానంద జనకం బగు సుకవిత యనిన నట్టిదియే కాఁబోలు! ఇట్టి మనోహర శ్లోకము లికావ్యమున నింకను గలవు. జీవితపుటనుభూతికిఁ బోనఁగి చూచియుఁ జూడఁగనే నుదుటిమడతలలో నాటుకొనఁ జాలెడు స్పృహణీయపు టర్థాంతరన్యాసముల కికావ్యము పెద్దబోషాణమై యున్నది. ప్రస్తుత సందర్భమునకు—

"వికారహేతౌ సతి విక్రియంతే;
యేషాం న చేతాంసితఏవధీరాః."
(కుమా॥ 1 స॥ 59 వ శ్లో)

"స్వజనస్య హి దుఃఖమగ్రతో;
వివృతద్వార మివోపజాయతే."
(కుమా॥ స. 4. శ్లో॥ 26)

"ప్రయోజనాపేక్షితయా ప్రభూణాం,
ప్రాయ శ్చలం గౌరవ మాశ్రితేషు."
(కుమా॥ స॥ 3. శ్లో॥ 1)

"కఈప్సితార్థ స్థిరనిశ్చయం మనః,
పయశ్చనిమ్నాభిముఖం ప్రతీపయేత్?"
(కుమా॥ 5 స॥ శ్లో॥ 5)

ఈమనుస్మృతునుకలు చాలును. ఇదేవిధముగ నుపమలును నిందు మనోహర క్రీడలు సలుపుచున్నవి. ఇయ్యెడ—

"నిదాఘకాలోల్బణ తాపయేవ,
మాహేంద్రమంభః ప్రథమం పృథివ్యా."
(కుమా॥ స. 7 శ్లో॥ 84)

"శశ్వకిం ప్రహసశోషవిక్లవాం,
పరిశమావృష్టి రివాస్వకంపయత్."
(కుమా॥ స. 4. శ్లో॥ 39)

"పర్యాప్తపుష్పస్తబకావనమ్రా,
సంచారిణీ పల్లవినీ లతేవ."
(కుమా॥ స. 3. శ్లో॥ 54)

"సమీయతుర్దూరవిసర్పిఘోషౌ;
భిన్నైకసేతూ పయసామివౌఘౌ."
(కుమా॥ స. 7. శ్లో॥ 53)

"నివృత్తపర్జన్య జలాభిషేకా;
ప్రఫుల్లకాశా వసుధేవ రేజే;"
(కుమా॥ స. 7 శ్లో॥ 11)

ఈయుదాహృతులు పర్యాప్తమ్ములు. కల్పనాశక్తి విశిష్టతఁ గల రచనయందేమియు విశిష్టత యుండదు. కాబట్టి యుత్తమ కత్రికిఁ జెందెడు కవులకుఁ గల్పనాశక్తి యావశ్యకము. అది కాళిదాసుని శేముషీప్రశ్నోళికలలో ముమ్మరముగ బారులు దీర్చి సువాసించుచున్నది. అందుకు దృష్టాంతముగ నీ—

"కుబేరగుప్తాం దిశ ముష్ణరశ్మౌ;
గంతుంప్రవృత్తేసమయంవిలంఘ్య;
దిగ్దక్షిణా గంధవహం ముఖేన,
వ్యలీకనిశ్వాస మి వోత్ససర్జ."

(కుమా॥ స. ౩ ॥శ్లో॥ 25)

శ్లోకము గ్రహింపఁదగును. ఉత్తరాయణ కాలము వచ్చినది. మలయానిలంబులు విశేషించి విజృంభించి యున్నవను సామాన్యపుటుక్తిని కవికులాలంకార భూతుఁడింతగాఁగల్పించి యుత్ప్రేక్షించెను. ద్రాక్షల నడరియున్న మాధుర్యమునుగూడ మించెడు నొకవిధమైన యనిర్వాచ్య మాధుర్య మిందు గుప గుప లాడుచున్నదనిన సహృదయు లియ్యకొనకపోరు. అదియే నిష్పాక్షిక హృదయ వ్యక్తీకృతి.

ఉపరినివిష్టంబులగు నర్థాంతర న్యాసాదికమ్ములు రసజ్ఞ పాఠకుల హృదయంబుల శాశ్వత నివాసములను నేర్పాటించు కొనుటయేగాక, మహాకవి కాళిదాసునియందుఁ బొదలాడెడు నాయకగణ్యాలోకవిజ్ఞానమును గడుచోద్యముగ విశదీకరించు చున్నవి. మొత్తముమీద నికావ్యమొకవైపు సురుచిర ప్రకృతి వర్ణనలతోను, మరొకవైపు లోకప్రథితమైన సాంఘిక రాజకీయ మలయానిలమ్ములతోను నసియాడుచు వాఙ్మయ భూములఁ బర్యటించెడు పాఠకపాంథులకు నవశ్యవిశ్రమస్థానమై యలరారుచున్నది.

మమ్మట విశ్వనాథులవంటి కొందరాలంకారికు లీకా వ్యాఖ్య నించుక యధిక్షేపించిరి. వసంతుఁడు వచ్చి కనఁబడి నప్పుడు రతీదేవి తొంటిదుఃఖస్రోతస్సు క్రిమ్మరగట్లు ద్రెంచుకొని విచ్చలవిడిగాఁ బ్రవహింప సాగెను. అది పునర్దీప్తి దోషముగఁ బరిగణింపఁబడవచ్చునని వారి యాక్షేపము.

అప్పటి పరిస్థితి కది యెంతయుఁ బొసఁగి యున్నది. కాబట్టి యద్యతన విజ్ఞాని లోకమున కది యెంతమాత్రము నాక్షేపణీయము కాఁజాలదు. అంతవర కెందుకు? గ్రథకర్తయే తత్సమస్యనిట్లు—

"స్వజనస్య హి దుఃఖ మగ్రతో;
వివృతద్వార మివోప జాయతే."

(కుమా॥ స. 4 ॥శ్లో॥ 26)

చక్కఁగఁ బరిష్కరించియున్నాఁడు. ఆప్తుల యెదుట దుఃఖము విశృంఖలముగఁ బొంగివచ్చునఁట. అదిలోకనైసర్గికగుణము.

"తావత్సవహ్నిర్భవనేత్రజన్మా;
భస్మావశేషం మదనం చకార."

(కుమా॥ స. 3 ॥శ్లో॥ 72)

ఈ శ్లోకమందలి "భవ" శబ్దప్రయోగము సర్వవిధంబుల నౌచితికి దవిష్ఠమనునది వారి రెండవ యాక్షేపణ. వారిమతము ప్రకార మాస్థానమున "హర" శబ్దప్రయుక్తి యుండ వలయును.

ఈ శ్లోకమునకుఁ గొంచెము పైనున్న ఈ
"హరస్తు కించిత్పరిలుప్త ధైర్యః"
(కుమా॥ స. 3 ॥శ్లో॥ 67.)

శ్లోకమందలి "హర"శబ్దపువాడుకను బర్యవేక్షించినఁ బైశ్లోక మందలి "భవ" శబ్దపుఁబరఁగింపెంతయు సముచితమని తేట తెల్లమగుచున్నది. ఈ సందర్భమున నితని కవిత్వము సూచ్య సూచన గుణపరివేష్టితమను విషయము సంస్మరణీయము. "హృ" ధాతువునకుఁ గృదంత ప్రత్యయ మగు "అచ్" ను, సుబంత ప్రత్యయమగు "సుప్" ను జేరఁగా "హరః" యను రూపము నిష్పన్నమగును—హృ,హర్+అచ్+సుప్= హరః"పచాద్యచ్." ఇప్పుడు'హృ'ధాతువునకుఁ గలముఖ్యార్థ మరయఁదగినది. దానికి నిర్దిష్టమై యున్న యర్థము ప్రకార మిక్కడ "హర" శబ్దప్రయోగ మెంతయేని ప్రాధాన్యత వహించి యున్నది. అనఁగా, హరుఁడనినఁ జరాచర ప్రపంచము నంతను దన యిచ్చవచ్చినట్లు నడుపఁ గల దిట్టయని యర్థము.

అంతటి మహామహుఁడయ్యు నతఁడప్పుడు కొంచెము చలింపక తప్పినదికాదఁట. ఇఁకనిప్పుడీ "హర" శబ్దప్రయోగ మిక్కడ నెంత యర్థవంతమైయున్నదో యూహింపఁదగును. ఇట్లే పైశ్లోకమందలి "భవ" శబ్దపుఁ బరఁగింపును సంభావ్యము. మన్మథుని మరణము తాత్కాలికము. అనతికాల ముననే యతఁడు తిరిగి జీవింపఁగలఁడను భావార్థపుఁ జంద్రికలు

వెడచల్లుటకే మహాకవి యక్కడా శబ్దమును బరిగించెను. "భూ" ధాతువును "హృ" ధాతువు వలెఁ బచాదియే. కాబట్టి భూ, భవ్ + అచ్ = భవ యగుచున్నది. సుబంతమగుట + భవ. సుప్ యని సుప్ చేరఁగా "భవః" యనురూపము సిద్ధించును. ఇప్పుడు "భూ" ధాతువునకుఁగల పరిధానార్థము గమనీయము.

భవశబ్దము జన్మార్థ వ్యంజకము. ఈ సందర్భమున "భూ" ధాతువునకు "అప్" ప్రత్యయము వచ్చును. శంకరుని పక్షమున "సర్వం భవతీతి భవః" అని నుడువఁబడును, ఈ సందర్భమున నిది పచాది. సర్వముఁదానై యున్నవాఁడు గాబట్టి యతనికి భవుఁడని పేరు వచ్చినది. సర్వముఁ దానై యున్నప్పుడిఁకఁ మన్మథునకుఁ జావెక్కడిది? ఇఁకఁ బై పంక్తు లనుసంధేయములు. రైడరన్నట్లు పరిపంచ మెన్నఁడును విస్మరింపఁజాలని హృదరింజక భాగములతోఁ గలకలలాడు నికావ్యము నెడల నిట్టి విమర్శలు ప్రాముఖ్యము వహింపఁ జాలవు.

పార్వతీ పరమేశ్వరుల యుపయామ కథ లోక ప్రసిద్ధము, మఱియుఁ జిరంతనము. ఇయ్యది శివ స్కాంద బ్రహ్మపురాణా దుల నవఘుళించి యున్నది. అయినఁ గుమారసంభవపుటితి వృత్తమున కాధారభూతమిందే పురాణముగావచ్చుననెడి క్లిష్టతరసమస్య యొకఁడిప్పుడు తలయెత్తఁగలదు. ఉదీక్షిం చిన శివపురాణపుఁగర్త కుమారసంభవ నిర్మాతకుఁ గృతజ్ఞుఁడు

గావలసియుండు నని ధ్వనించుచున్నది. అంజలి భాషావిషయము లింజలి భాషావిషయములకు సదృశములై యున్నవి. ఇక్క డిలకింప వచ్చును.

"స్త్రీ స్వభావా త్తదాసాచ,
లజ్జితా సుందరీ స్వయం;
వివృణ్వతీ తథాంగాని,
పశ్యంతీ చ ముహుర్ముహుః."

(శివ పురాణము)

"వివృణ్వతీ శైల సుతాపి భావ,
మంగైః స్ఫురద్బాలకదంబ కల్పైః;
సాచీకృతా చారుతరేణ తస్థౌ,
ముఖేన పర్యస్త విలోచనేన."

(కుమా॥ స. 3 ॥శ్లో॥ 68.)

"స్థల మేత త్తథాహిత్వా,
యాస్యామోఽన్యత్ర మాచిరం;
ఇత్యుక్త్వా చలనా యాసా,
పద ముత్‌క్షిపతే యదా;
తదాసా చ శివః పాణౌ
దాలలంబే ప్రియాం సతీం;
కృత్వా స్వీయం స్వరూపంచ,
... ... ... "

(శివ పురాణము)

"ఇతోగమిష్యామ్యథవేతి వాదినీ,
చచాల బాలా స్తన భిన్నవల్కలా;
స్వరూప మాస్థాయచతాం కృతస్మితః,
సమాలలంబే వృషరాజ కేతనః.

(కుమా॥ స. 5 ॥శ్లో॥ 84)

ఇప్పుడొకే యొక ఘట్టమున నిద్దరి కలము లెట్లు పని చేసినవో సుస్పష్టమైనది. పయిది రతిభావోదయ సమయమందలి యుమాకుమారి యవస్థావర్ణనము. క్రిందిది పార్వతి స్థలాంతర గమనోత్సుకత నున్న సమయ వర్ణనము.

"వివృణ్వతీ" మొదలగు పదములను గాళిదాసే సందర్భమున విన్యసించెనో, శివపురాణ కర్తయు నదే సందర్భమున వానిని వినియోగించెను. అది యంతయు మహాకవి రచన ననుకరింప వలయుననను నభీష్టత నయినఁ గావచ్చును. కాని, యిక్కడ నుద్యోతించెడు నా ప్రయోగ రామణీయకము రసజ్ఞుల హృదయ నిమథల నలవోకగనమ్మోడువోఁ గల మహోత్తరశక్తి పంపన్నము. మరి, విద్యుద్దీపికల నెగాదిగఁ జూచినను నక్కడట్టి భాగధేయ మున్నట్లగుపింపదు. ఆ యీ నిదర్శనములను బట్టి కుమార సంభవపుటితి వృత్తమున కాధారము శివపురాణ మనుటకంటె "వింటనిట్జ్" పండితుఁడని నట్లు స్కాంద పురాణమనుట యెంతయు సమంజసము.

శ్రీమత్పరదేవతాయైనమః

# మహాకవికాళిదాసు

## మేఘదూతము.

మేఘదూత మొక చిన్న కబ్బము. అయినను అభిజ్ఞాన శాకుంతల రఘువంశములకు నెంత యశస్సు గలదో దానికిని వాఙ్మయ ప్రపంచమున నంత మహత్తర కీర్తిగలదు.

పూర్వమేఘమనియు నుత్తరమేఘమనియు నది రెండు భాగములుగా విభజింపఁబడి యున్నది. సంస్కృత వాఙ్మయమున ఖండకావ్య రచన మహాకవి కాళిదాసుతోనే యారబ్ధమయిన దనుటకు మేఘదూతము ప్రబల నిదర్శనము. అక్కావ్య మెంత లఘుతరమైనదో యంత గురుతరమైన ప్రజాదరమును బడయఁజాలినది. జినసేనుఁడు క్రీ.శ. 8 వ. శతాబ్దమందలిసుప్రసిద్ధ జైన గ్రంథకర్త. అతఁడు జైనయతి యగు పారశ్వనాథుని చరిత్రమును పారశ్వాభ్యుదయ మను పేరున నొక కావ్యముగ వ్రాసెను. అందతఁడు సమస్యా పూరణ మార్గముగ మేఘదూతమునందలి వివిధశ్లోక పాదములను వినియోగించెను. మరియు క్రీ. శ. 12 వ. శతాబ్దమున ధోయి యను నొకకవి మేఘదూతము నాదర్శముగఁ జేసికొని పవన దూత మను నొకకావ్యము విరచించెను.

తరువాత విశిష్ట కవులు వివిధ కావ్యములు మేఘదూతాను కరణముగ సంఘటించిరి. ఈ ప్రయాస మంతయు మేఘదూతము ఎడల లోకులకుంగల యా యపరిమితా దరాభిమానములను నావిష్కరించు చున్నదనుట సుస్పష్టము.

ఇన్ని సంతతులును నాకృతి శిరోజములందు తమ తమ నుతి సుమాంజలులను విధివిధానమును లేకుండ వెదజల్లు చున్నారు. మొత్తముమీఁద ప్రాక్తనులు నవ్యతనులును నేకగ్రీవముగ నీ కావ్యమునకు సంస్కృత వాఙ్మయ మండలి గాన యోగ్యతను గుర్తించి ఖండకావ్య శాఖకుంగల యత్యుచ్చ పీఠిక నిచ్చి తమతమ విశేషముల సమర్పణములు జేసికొనిరి. మేఘదూతము మూలకృతి కొన్ని వివాదములకు నాస్పదమైనది. పార్శ్వాభ్యుదయ కర్త యగు జినసేనుఁడు నూటయిరువది శ్లోకములుగల మేఘదూతము నెఱుఁగును. మేఘదూతవ్యాఖ్యాతలలో నొకఁడగు వల్లభదేవుఁడది నూటపదకొండు లేక నూటయిరువది శ్లోకములు కలిగి యున్నట్లు సూచించి యున్నాఁడు. మరియొక వ్యాఖ్యాత యగు స్థిరదేవుఁడు నూటపదిరెండు శ్లోకములు గల కృతిని మాత్ర మెఱుఁగును. ఇంకొక వ్యాఖ్యాత యగు దక్షిణావర్తనాథుని కృతి నూటపది శ్లోకములు గలిగి యున్నది.

సుప్రసిద్ధ వ్యాఖ్యాత మల్లినాథుఁడు పరిగ్రహించిన మూలకృతి నూటయిరువదియొక శ్లోకములు కలిగి యగుపించుచున్నది.

అందుఁ జివరఁగల శ్లోక పంచకము ప్రక్షిప్త మని మల్లినాథుఁడు ప్రకటించెను. ఏమైనను మొత్తముమీఁద గ్రంథ విశాలత సంక్షిప్తావస్థ కెరవైనది. చివరఁగల యాప్రక్షిప్త శ్లోకములు గ్రంథమందలి సహజ సౌందర్యము యొక్క శృంగారపు గతులకు నాతంకములై యున్నవి. మేఘ దూతమందలి కథావస్తువునకు మూల మేమైయుండును ? ఈ ప్రశ్నము పూర్వము దొట్టి మల్లినాథసూరివరకుఁ గల విద్వదవతంసుల నందర నావరించి యుండెను. మల్లినాథుఁ డందలి ప్రథమ శ్లోకమును వ్యాఖ్యానించు నప్పుడు—

"సీతాం ప్రతి రామస్య హనుమత్సందేశం మనసి నిధాయ
మేఘ సందేశం కవిః కృతవా నిత్యాహుః"

ఇట్లుల్లేఖించెను. రాముఁడు సీతకు హనుమంతుని పరముగ నంపిన సందేశమును మనసునందుంచుకొని కవి మేఘసందేశమును రచించెనని లోకు లందురఁట. ఇది యీ వాక్యమునఁ గేంద్రీకృతమై యున్న యర్థమాలిక. ఇది కడుంగడు విశ్వసనీయము. కాళిదాసునకు రామాయణముతోఁగల సన్నిహిత పరిచితి రఘువంశమున సుస్పష్టముగఁ బ్రతిఫలించుచున్నది.

రఘువంశ మందలి దశమసర్గము దొట్టి పంచదశ సర్గమువరకుఁగల భాగమంతయు రామాయణ కథను నావిష్కరించును.

మరియు, మహాకవి తన మేఘ దూతమందలి ప్రథమ శ్లోకమున—

"యక్షశ్చక్రే జనకతనయా స్నాన పుణ్యోదకేషు
స్నిగ్ధచ్ఛాయా తరుషు వసతిం రామగిర్యాశ్రమేషు.

ఇట్లు సీతారాముల పవిత్ర నామములను గీర్తించెను. మేఘదూతములోని యక్షుని సందేశమునకు రామాయణములోని రాముని సందేశమునకును గొంత మట్టుకు సదృశత కలదు. ఇంక,—

"ఇత్యాఖ్యాతే పవన తనయం
మైథిలీ వోన్ముఖీ సా,
త్వాముత్కంఠోచ్ఛ్వసితహృదయా
వీక్ష్యసంభావ్య చైవం;
శ్రోష్యత్యస్మాత్పరమవహితా
సౌమ్య! సీమంతినీనాం,
కాంతోదంతః సుహృదుపనతః
సంగమాత్కించిదూనః."

(ఉ. మే. ॥శ్లో॥ 40)

ఈ శ్లోకము నొకపరి యుపలక్షించుట యుక్తము. రామసందేశమును దెచ్చిన పవనసుతుని మైథిలి మిక్కిలి యాదరించి తత్సందేశము నెంతయు శ్రద్ధమై వినెను. అట్లే, యక్షిణియు నిన్నాదరించి యుత్కంఠోచ్ఛ్వసితహృదయమై నీ పలుకులు వినఁగలదు.

అనుచుఁ గవి యక్షుని ముఖమున మేఘునితోఁ బలుకుచున్నాఁడు. ఈ నిదర్శనములఁబట్టి మల్లినాథుఁడన్నట్లు మేఘ

దూతపుటితివృత్తమునకు మూలము రామాయణము నందుఁ గల హనుమత్సందేశమే యని నిర్ధరింపఁదగును.

కాని, కాళిదాసు వాల్మీకికి అచ్చియున్న దింతమాత్ర మే. తక్కిటి రచనా నిర్వాహణమెల్ల స్వకీయము. కలయఁ జూచిన మేఘదూతము కవిశేఖరుని కల్పనాశక్తి నుదయించిన దివ్యతర ఫలమని యెరుకపడక తప్పదు.

రామాయణ మందలి యాభావమును కవిబ్రహ్మ తన మేఘదూతమున నెట్లు నిర్వహించెనో యొకపరి పరిశీలించుట లగ్గు. అందుఁగల ప్రధాన రసము విప్రలంభ శృంగారము. విరహి విరహిణికిఁ బుత్తెంచెడు సందేశ మందలి యితివృత్తము. కాబట్టి రామాయణములోని సందేశపు టడుగుజాడలలోనే యక్షుని సందేశమును గవి పరిభవించి యుండవచ్చును. యక్షుఁడు విప్రకృష్టయైన తన మనోహరికిఁ దన కుశలవార్త నెరిఁగింపుమని మేఘుని బ్రార్థించవచ్చును. అతఁడును తత్సందేశమును గైకొని వెళ్లి యక్షిణికి స్వయముగ వినచ వచ్చును. మేఘుని మార్గము, అలక, యక్షిణి మొదలగు ద్రవ్యముల వర్ణనలును విరియఁ బారి యుండవచ్చును.

అక్కడ నీ పద్ధతి, యంత నీరసమైనది కాకున్నను, సామాన్యము. కాబట్టి యిది కాళిదాసీయము కానొల్లదు. మరియు నిందువల్ల కథ ప్రధానమై రసమప్రధానమగును.

అప్పుడీది సందేశమందలి విషయ జాతమును వర్ణించిన వర్ణింప వచ్చును; కాని, ప్రిక్షీణుఁడైన యక్షుని ప్రేమ గంభీరతను సుస్పష్టముగ బయలుపెరయున ట్లొనరింపఁ జాలదు. మేఘుఁడు యక్షిణికిఁ జేరఁగడ నిలిచి యక్షుని విరహావస్థనంతయుఁ జూపగుర్చిచ్చి నల్లిరుక చేసియుండవచ్చును. కాని, యావర్ణన, యెంత యుదాత్తమైనదైనను, ప్రేమికుని హృదయ వేదన నంతగా వెలార్చి చూపఁజాలి యుండదు. అట్లయిన నన్నిటికంటె ముఖ్యముగఁ గథావస్తువు నందలి వివిధ సన్నివేశముల సామరస్యము కోలుపడును. దానఁదుదకుఁ గావ్యపుఁ బొందికయు బుచ్చివారును. కాని, కవి నితాంత విచక్షణుఁడు. రచనావసరముల నిద్రాణత నెరుఁగనికుశాగ్రబుద్ధి యతనిబుద్ధి: కాబట్టి యతఁడందలి కథావస్తువునకు నాటకత్వ మాపాదించి కావ్యమును నతిరసవత్తరముగ ముగించెను. విప్రలబ్ధ ప్రేమికులగు యక్షిణీ యక్షుల పాత్రములు, మేఘుని పాత్రము, అలకాపురి మున్నగు సన్నివేశములును కేవల కాల్పనికములు.

గ్రంథారంభమునఁ గథకు నాధార భూతములగు శ్లోకములు కొన్ని కలవు. వానిని మినహాయించిన యెడల, మేఘదూత మంతయు యక్షుఁడు మేఘునితోఁ గావించిన దీర్ఘ ప్రసంగముఁగల కృతిగాఁ గోలుపడును.

యక్షుఁడు తా స్వయముగ నలకా మార్గమును మేఘున కచ్చుపడ వర్ణించి చూపెను. దవిష్ఠయగు తన ప్రియురాలకుఁ బంపెడు పందేశమందలి యంశములను దాన మేఘుని కట్టెదుట

నుపన్యసించెను. మేఘుఁడు యక్షుని గృహము చేరిన పిదప యక్షిణిని గుర్తించుట కనువగునట్లతఁ డాతనికి నాపెయాకృతి సాంగోపాంగ వర్ణించి యెరుక చేసెను. అజంతయుఁ గవిసార్వభౌముని ప్రతిభాకాశమున నుద్యోతించెడు చాతురీ సౌదామనుల శోభాపరంపర. మేఘదూతము శ్రవ్యకావ్యము. అయినను, నించుమించుగ మొదటినుండి తుదివరకు యక్షుని సుదీర్ఘోపన్యాసముతో నింపఁబడి యుండుటవల్ల నది దృశ్యకావ్య రూపమును గూడ వహింపఁదగి మిక్కిలి ప్రేక్షణీయమై యున్నది. ఆ కల్పనాశక్తి విరియంబారెడు శక్తిసామర్థ్యము లెట్టివో కాని యక్షావ్యమునఁ గోల్పడెడు ప్రతిశబ్దము కేవలము విరహి నోట వెలువడునదివలె శబ్దించుచున్నది. కావ్యమున స్వతస్సిద్ధముగ నవతరించిన యా వివిధ సన్నివేశములు యక్షుని మూర్తికి నల్గడల నచ్చుకట్టఁబడి యున్నవో యన్నట్లగపడుచున్నవి.

అంతియకాదు, మెల్లమెల్లఁగ నయ్యావి యాశానిరాశలు, హర్ష విచారములు మొదలగు నతని పరితప్త హృదయము యొక్క వివిధావస్థలను బయలుపోవఁజేయుచున్నవి.

ఏ శ్లోక మరసినను ప్రేమమహతి నిర్భరమే. ఏ యక్షరము పలకించినను గరుణ రసార్ణవ నిర్మగ్నమే. నిజముగ, మేఘదూతము విప్రయుక్తుఁడగు ప్రేమ బాధితుని దీర్ఘమైన యొక వేఁడినిట్టూర్పు. అందు సహజాలంకరణములగు నదులు పర్వ

శములు పట్టణములు పల్లెలు మొదలుగాఁగల ప్రకృతివర్ణనల యందడుగడుగునకుఁ దదీయమైన ప్రేమమనోగతము కనిపించు చునే యున్నది. అదంతయు ముగురమ్మల మూలపుటమ్మ యగు ఆ కాళీవర ప్రసాద లబ్ధుని ప్రతిభాతిశయము.

"తన్వీ శ్యామా శిఖరిదశనా పక్వబింబాధరోష్ఠీ,
మధ్యేక్షామా చకితహరిణీప్రేక్షణా నిమ్ననాభిః;
శ్రోణీభారాదలసగమనా స్తోకనమ్రా స్తనాభ్యాం,
యా తత్ర స్యాద్యువతివిషయే సృష్టిరాద్యేవధాతుః."
85.

ఈ శ్లోకము యక్షుఁడు మేఘునకుఁ దనప్రియురాలి యాకృతిని జిత్రించి ప్రదర్శించెడు సందర్భ మందలిది.

మేఘుఁడిల్లు చేరఁగనే యక్షిణిని గుర్తింపవలయును. కాబట్టి యీ శ్లోక మక్కడావశ్యకము. ప్రస్తుతము నాయకురాలి యవస్థయుఁ దనయవస్థ వలెనే యుండునని నాయకుని నమ్మిక. ఆ నమ్మిక సహజసౌందర్య సంపద యొసగ మెసఁగనీ—

"తాం జానీథాః పరిమిత కథాం జీవితం మే ద్వితీయం,
దూరీభూతే మయి సహచరే చక్రవాకీ మివేకాం;
గాఢోత్కంఠాం గురుషు దివసేష్వేషు గచ్ఛత్సు బాలాం,
జాతాం మన్యే శిశిరమథితాం పద్మినీం వాన్యరూపాం."
—86.

శ్లోకమున మిసమిస లాడు చున్నది. విధాతృని యాదిసృష్టి యో యనఁదగు నద్వితీయ సౌందర్యవతి యక్షుని ప్రేమిక.

కాని, ప్రస్తుత మామె విప్రయుక్త. కాన, విరహతాప సంతప్తయై వియుక్తయగు చక్రవాకి వలెఁ గ శిశిరమథితపద్మి నివలె నన్యరూపమును దాల్చియుండును. ఈ పలుకులు యక్షుని నోటఁగవి తను చాన పలికిన పలుకులు. ప్రస్తుత సందర్భమున విప్రయోగ వ్యథలఁ బొగిలెడువాఁడు యక్షుఁడు; కాని, కవి కాఁడు. అయినను, ఎడబాటు వెతలఁ గుమిలి కుంది కృశించిపోయిన నాయకురాలి యా చిత్రి లిఖితమున రాళ్లను సైతము కరఁగించి వైచెడు నిగ్గైన కరుణారస మెడతెగకుండఁ జిప్పిలు చున్నది.

మేఘుఁడు యక్షుని వర్ణనాదర్శమునఁ బోలిసారిగ నాయకురాలి యా యనన్య సౌందర్య రూపము నెగాదిగఁ జూచెను. పిమ్మట నా నేత్రములతోనే యామె యొక్క విధి కృతాన్య రూపమునుగూడఁ జూడవలసి వచ్చెను.

అప్పుడు మేఘుఁడెంత యుమ్మలించి యుండునో! అది సుహృద్ధర్మము. కాళిదాస మహాకవి పరిణతిఁ గాంచిన మానసిక తత్త్వపరిజ్ఞాత. అతఁడు యక్షుని మనోనేత్రములతో మేఘుని హృదయ ప్రపంచమును సాంతముగఁ బరిశోధించినై చెను. తత్ఫలితముగ నతఁడు యక్షుని ముఖవేదికఁదిష్ఠవై చి మేఘుని కట్టెడుట—

"సా సన్న్యస్తాభరణ మబలా పేశలం ధారయంతీ,
శయ్యోత్సంగే నిహిత మసకృద్దుఃఖదుఃఖేన గాత్రం;

త్వా మస్యాస్రం నవజలమయం మోచయిష్యత్యవశ్యం,
ప్రాయః సర్వో భవతి కరుణావృత్తి రార్ద్రాన్తరాత్మా."
—96,

ఇట్లు తరేకి ధారగ నుపన్యసింపఁ దొడఁగెను. నగలు నాణె ములు విడిచి సరియైన నివాసస్థానములు లేక రేయింబవళ్ళు శయ్యాగతమై కన్నీరు మున్నీరుగఁ బొగులుచు నెట్లో యతి కష్టముగ నంగయష్టిని మాత్రము నిలుపుకొనఁ జూచెడు యక్షిణి యొక్క యా ఘోరతరావస్థకుఁ బ్రాణములేని మే ఘము కూడ నంగలార్చక తప్పదఁట. ఔరా! కవిశిఖామణి చాతురీతురి!

ధూమ జ్యోతులయు సలిల మరుత్తులయు సన్నిపాత మగు నా యచేతన మేఘమే యంత పరితపింపవలసి వచ్చిన, ముఖ్యముగఁ జేతనవంతులెంత విక్లవింతురో! అది భావనా గమ్యము.

మరియు, నాఁడామెను గన్నులారఁ జూచుచుఁ దాదృ శముగఁ జిత్రించిన కేవల ప్రేమికుఁ డాయక్షుని దుఃఖార్ణవమెం తఘూర్ణిల్లి యుప్పొంగి పోయెనో! సందర్భోచితముగఁ బాత్ర లయందు విలీనము కాఁగలుగు నదీష్ణతఁ గాళిదాసు ప్రాగస రుఁడు. అక్కడి యీ కరుణామయవర్ణన నెల్ల శ్రోతల హృద యములను ద్రవీకరింపఁగలిగెడు నాయకుని హృదయ వ్యథగా రూపొందించెను.

" సంక్షిప్యేతక్షణ ఇవకథం దీర్ఘయామాత్రియామా,
సర్వావస్థాస్వహరపికథం మందమందాతపంస్యాత్ ;
ఇత్థం చేత శ్చటులనయనే! దుర్లభప్రార్థనం మే,
గాఢోష్మాభిఃకృతమశరణంత్వద్వియోగవ్యథాభిః".

ఇది విరహాకుకూలముల నట్టేటఁ జిక్కువడ్డ యక్షుఁడు తన రెండవజీవితమునకుఁ బుత్తెంచెడు సందేశములోనిశ్లోకము. యక్షిణివల్లఁగలిగిన వియోగవ్యథలు రానురాను దీవ్రతరము లైనవి. రేయింబవళ్లతని కేమాత్రము గాలయాపనము కాకున్నది. చేతము దుర్లభపార్థనమైనది.

అంతస్తాపము మితిమీరినది. తుదకు హృదయము గతి మాలి యలమటించవలసివచ్చినది. చూపులు పారునంతవరకుఁ గల యబ్ధిమేఘుల నెందు సమీక్షించినను అతనికి చిమ్మచీకట్లే; కాని, మధురజ్యోత్స్నలగపడకున్నవి.

కేవలవిరహానల ప్రపంచమున జీవితోపాధిఁ గానమి దిక్కుమాలి కొట్టుమిట్టాడుచున్న యక్షుని ప్రత్యక్షరూపమిది. ఈ యవస్థ మేఘదూతమునందంతట నెసరేగియున్నది. ఇంక, వర్ణనలు సన్నివేశములు దీని చిహ్నములుగ రూపొంది యొసంగుచున్నవి. కావ్యపుఁబొందిక యలవడినది. అదియు దాని మధురనాదమును నలవరించినది. కాని, మార్గాంతరమున

నాగుణమ్మాయికి నిది దురాపమనక తప్పదు. అనగ్నసత్యమును మహాకవి లెస్సగ నాకళించి కృతకృత్యుఁడయ్యెను. మంచిది, కేవలము ధూమజ్యోతిస్సలిలమరుత్తుల సంనిపాతము మేఘము. కాబట్టి యది యచేతనము. అయినప్పుడు దానికి వార్తావహత్వమారోపింపఁదగునా ? సుప్రసిద్ధాలంకారికుఁడగు భామహుఁడు తన కావ్యాలంకార సర్వస్వమునందుఁ దొలుతఁ నాదృశకల్పనలు త్రోసిబుచ్చియుఁ బిమ్మట నా త్రోసివేత-

"యది చోత్కంఠయా యత్తదున్మత్త ఇవ భాషతే
తథాభవతు భూమ్నేదం సుమేధోభిః ప్రయుజ్యతే."

ఇట్లు కొంచెము సవరించినాఁడు (1-44.)

ఈ సవరణ కతఁడు కాళిదాసునకుఁ దరువాతికాలము వాఁడగుటయే కారణము. కాళిదాసు సిద్ధహస్తత మితిమీరిన మహాకవి. అతని ప్రకృతివిజ్ఞానమప్రమేయము.

కాలము నిరవధికము; పృథ్వియనంతవిపుల. సహజసిద్ధమగు తనదివ్యదృష్టికిఁ బని గల్పించి రానున్న విమర్శమున కద్వితీయ సమాధానముగ—

"ధూమజ్యోతిస్సలిలమరుతాం సన్నిపాతః క్వమేఘః ?
సందేశార్థాః క్వ పటుకరణైః ప్రాణిభిః ప్రాపణీయాః ?

ఇత్యౌత్సుక్యాదపరిగణయన్‌గుహ్యకస్తంయయాచే ;
కామార్తా హి ప్రకృతికృపణా శ్చేతనా చేతనేషు."
—5.

ఈ శ్లోకము సంఘటించియుంచెను. పొగ, కాంతి, నీరు, గాలి—వీనిగుంపే మేఘము. అది ప్రాణములేనిది. మరి, సందేశములను నలవరించుటకు నిపుణతఁగల ప్రాణులే సమర్థులు. నిజమే; కాని, గుహ్యకుఁడు కామార్తుఁడు. కామార్తులు ప్రకృతికృపణులు. వారలదృగారామములందుఁ జేతనాచేతనముల వివేచనమునకు నావంతయుఁ దావుండదు. ఈ సమర్థన మమోఘము; మరియు, లోకానుభూతికి సన్నిహితము. ఆంగ్లమహాకవి, షేక్స్పియరును నిట్టిదనిదే తలపోత నసివారుచున్నాఁడు.

అతని హృత్పథమునఁ బ్రేమికోన్మత్తులు సదృక్షులు. వారల వ్యవహృతి—

"Such seething brains,
Such shaping fantasies, that apprehend
More than cool reason ever comprehends."

ఇట్లైనరేగియుండును. ఎప్పుడును నుదిరిక్తచిత్తులగు. ప్రేమికోన్మత్తుల శేముషి పరిశాంతచిత్తుల వివేకముతోఁ గలిసి మెలసి తిరుగదు. దానిదొక ప్రత్యేకమైన పుంత. కవితాప్రపంచ

మందలి కీలకములను దెలియుటకు భామహునివంటి కేవల విమర్శకులకంటె సిద్ధహస్తతఁగల కాళిదాసువంటి మహాకవులే సమర్థులు. మమ్మటుఁడన్నట్లు వారికవిత నియతి కృత నియమ రహిత. అది యలవడి శ్రవణేల్లుట ప్రకృత్యతీతనియమము లకుఁగాని, కేవల ప్రకృతిసిద్ధాంతములకుఁగాదు. ఈసమున్నత మూలసిద్ధాంతమునకు మేఘదూతము విప్రతీపము కాదు. కాదుకనుకనే యది యింతకాల్ల మింతగా బహుళసంఖ్యాకుల సాదర ప్రేమలకుఁ బాత్రమై వాఙ్మయ క్షేత్రములలో వెన్నెలగుత్తిగా విహరించుచున్నది. మేఘ మచేతనమనియు రరీకరించిన కాళిదాసమహాకవి తుదవరకు దానిని చేతనవీత పదార్థముగనే పోషించెను.

దానికిఁ జివరకు వార్తావహత్వము ముడిపెట్టలేదు. ఒక్కుమ్మడిగా నుప్పొంగి నిర్గమించుచున్న యక్షుని భావ స్రోతః పరంపరలకు మేఘుఁడు కేవల మొకశ్రోత. మొదట నుండి తుదివరకు నతని వ్యవహృతి యే యొడుదుడుకులులేక యట్లే సాగిపోయినది.

అందుకుఁ గాళిదాసుని వాక్యపటిమయే ప్రబలమైన యుపపత్తి. ఇప్పుడు గ్రంథాంతమునఁగల యాప్రక్షిప్త శ్లోక ములు కావ్యమందలి నిసర్గసౌరభమూల మందగమనముల కెంత యవరోధకములో నవలీలగ నూహింపవచ్చును. ఈ

యవసరమునఁ గావ్యమందలి యితివృత్తము నొకపరి పారఁజూచుట లెస్సపని. అందలి కథానాయకుఁడు యక్షుఁడు. అతఁడలకాపురవాసి. కుబేరుఁడు యక్షరాజ్యమునకు రేఁడు. అలకానగరి యక్షరాజ్యమునకుఁ బ్రభుత్వ కేంద్రస్థానము. యక్షుఁడు కుబేరుని యుద్యోగి. అతఁడొకప్పుడు ప్రమత్తుఁడగుటఁ జేసి తనకు విధింపఁబడ్డ ప్రభుత్వవిధులను నుపేక్షించి యుండెను. అలకాధిపతి కోపము మితిమీరిపోయెను. ఇఁకయక్షునకుఁ బ్రవాసశిక్ష స్థిరపడిపోయెను. పాప మా యక్షిణీ యక్షులు క్రొంగ్రొత్తదంపతులు. వారి శరీరములయం దెందునరసినను నిండుజవ్వనము కసిమెసఁగి కుసుమించియున్నది. కాని, రోజులు మంచివికావు.

ప్రేమికయింట; ప్రేమికుఁడుబైట. అది వారియవస్థ. ఆ సంవత్సరమంతయు వారికాయవస్థ తప్పదు. జనకతనయాస్నానపుణ్యోదకములగు రామగిర్యాశ్రమము లతని ప్రవాసభూమి.

అల్లనల్లన మూఁడువంతులకాలము కడచినది. కాని యది యాషాఢమాసము. అప్పుడే తొలిమేఘము సానువు నాశ్లేషించుకొన్నది. అది వప్రక్రీడాపరిణత గజమున కుద్దియగుటఁ గడుంగడు ప్రేక్షణీయము. అయినను నతఁడు విరహి. సౌఖ్యవంతుని చిత్తమును నన్యథా వృత్తిగ రూపొందెడు సమయమది. ఇఁకఁ గేవలవిరహిచేతమున కది యత్యం

తోద్దీపనమని వేరుగఁ జెప్పనక్కరలేదు. తుదకెట్లో మనస్సు నిబ్బరముచేసికోఁగలిగినాఁడు. అయినను, అక్కడ యక్షిణి యెట్లున్నదో. ఆ చింత యతని ఉక్కిరిబిక్కిరి చేయువఱకుఁ బాయలేదు. వర్షకాలము విరహిదుఃఖజనకము. కాబట్టి యది సమయోచితమే. ఇఁక నేమైనను సావిధ్యముననున్న మేఘుని దనయింటికిఁ బిలిచి శక్తికొలఁదిగ సత్కరింపవలయునని నిశ్చయించుకొన్నాఁడు కుబేరానుచరుఁడు. అతఁడిప్పుడు దయితాజీవితాలంబనార్థి. కనుకఁ గుశలమయంబగు తన ప్రవృత్తి నామెకుఁ బుత్తెంచకతప్పదు. ఆకర్జము నెరవేర్చుట కిప్పు డతని కొకమేఘుఁడుతప్ప మఱెవ్వరును సమర్థులుగఁ దోచలేదు.

మెల్లమెల్లఁగ భోజనభాజనాదులు ముగిసినవి. అతిథ్యాతిథేయు లిరువురు సుఖవిష్టరములను సవరణించిరి. అంతదనుక నెట్లో యోపికపట్టిన యతని హృదయపుఁదొందర యిఁక నిలువలేకపోయినది. ఒకేయొకమాఱుగాఁ బ్రాళ్ళు ద్రెంచికొని తటాలున—

"సంతప్తానాం త్వమసిశరణం తత్పయోద! ప్రియాయాః,
సందేశం మే హర ధనపతి క్రోధ విశ్లేషితస్య;
గంతవ్యా తే వసతిరలకా నామ యక్షేశ్వరాణాం,
బాహ్యోద్యానస్థితహరశిర శ్చంద్రికా ధౌతహర్మ్యా."

ఇల్లు బైటఁబడినది. పట్టఁబగ్గములులేని ధనపతికోపము వల్ల నిట్లు విశ్లేషితుఁడనై పోతిని. సంతప్తులకు నీవ శరణము. ఇప్పుడు నీవెళ్లిన నలకకుఁ బోకతప్పదు. ప్రియురాలు యక్షిణి యక్కడే యున్నది. ఆమెకు నా యోగక్షేమము లెరిఁగించి మా యిరువురకు నింతప్రాణభిక్షపెట్టు. పయోద! కొంచెము కనికరించు. ఇది నా కోరిక. బాహ్యోద్యానమునఁ గాపుర మున్న హరుని శిరశ్చంద్రికలమూనుకలువెట్టు రమణీయహర్మ్య పంక్తులతోఁ గలకలలాడు సుభగనగరి యా యలక. ఇఁక, వెళ్ళు. నీకును జక్షుఃప్రీతి లభించును.

ఇంటికిఁబిలిచి గౌరవించి యాతిథ్యమొసఁగి యింతగా బ్రతిమాలినప్పుడిఁక మేఘుఁ డియ్యకొనకపోఁడు. మేఘునకుఁ నలకకుఁబోవు బాట తెలియకపోదు. అయినను దెలియఁజెప్పుట మంచిదని యక్షుని పరిచ్ఛిత్తి.

రామగిరికి నలకకు నడుమఁగల దూరమమేయము. రామగిర్యాశ్రమమునుండి యలకకుఁబోవు పద్య యనేకము లగు దృశ్యములతో సమకొలుపఁబడి యున్నది. నదులు నగములు వనములు బయళ్లు పల్లెలు పట్టణములు దేశములు మొదలగున వన్నింటిని మేఘుఁడు కడచిపోయినఁ దుదకు నలకకుఁ జేరఁగలఁడు. ప్రపంచమున నద్వితీయ నగరముగా బ్రహ్మాండ సమజ్యావహించిన ఉజ్జయిని యతని మార్గము నకుఁ దవ్వులదు. కాని, గుహ్యకుని యభినివేశము

"వక్రః పంథా యదపి భవతః ప్రస్థితస్యోత్తరాశాం,
సౌధోత్సంగప్రణయవిముఖో మాస్మభూరుజ్జయిన్యాః;
విద్యుద్దామస్ఫురితచకితై స్తత్ర పౌరాంగనానాం,
లోలాపాంగై ర్యది న రమసే లోచనై ర్వంచితోఽసి."
—27.

ఇక్కైసలారిప్రతిఫలించుచున్నది. పయోద! ఇప్పుడు నీవుత్తరదిశగాఁ బయనింపవలయును. కొంతదూర మరిగిన పిమ్మటఁ గొంచెము ప్రక్కకు మరలినచో నీ కొక చక్కని పత్తన మగపడును. అది నగరీమతల్లియగు నుజ్జయిని.

మార్గము వక్రమని బద్ధగింపవద్దు. ఎంతకష్టించిన నంత మంచిఫలము సమకొనఁగలదు. కాబట్టి కొంచె మటు మరలి యక్కడిసౌధముల యుత్సంగ ప్రణయమును సంపాదించు.

అక్కడ నీకుఁ జక్కని నాగరికతఁ గసిమెసఁగిన జవ్వనులు కనిపింతురు. కొంతసేపట విశ్రమించి విద్యుద్దామస్ఫురితచకితములు లోలాపాంగములు నయి తులకించెడు వారి లోచనములతోఁ గ్రీడించు. కన్నులున్నందుకుఁ దగిన ఫలము నాస్వాదింప నీకదియే సుసమయము. ఇది యతని యభినివేశము. అటనుండి ముందుకు సాగివెళ్ళిన నతఁడు నిరుపమమగు నొక దివ్యపదార్థమును జూడఁగలఁడు. అది త్రిదశవనితల దర్పణముగఁ బ్రతిదినము రాశీభూతమగుచున్న శంకరుని యట్టహాసమో యన్నట్లు భూమ్యాకాశముల నావరించి

యున్న కైలాసగిరి. అదియే జగత్పితరులగు నుమామహేశ్వ
రుల నివాసభూమి. అక్కడకు నలక యెంతోదూరము కాదు.
కనుక మేఘుం డక్కడ కొంత తడవు యథేచ్ఛ విహరింపవచ్చు
ను. యక్షుని యభిలాషయు నదియే. కాని, యక్కడం గనంబ
డెడు సురయువతులు చాల యసాధ్యలు. మేఘుండక్కడ నిరా
తంకముగ విహరింపవలయునన్న నతండు తగినంత లౌక్యము
వినియోగింపవలసి యుండును. అది ఘర్మసమయము. కాబట్టి
పరిమత్తత ప్రమాదకరము.

అటనుండి కొంచెము మెడం బైకెత్తినచో నతనికి నని
ర్వాచనీయశోభల తులకింపులతోం గిలకిలలాడు నొకా నొక
దివ్యపత్తనము గోచరింపంగలదు. అదియే యక్షేశ్వరుల వస
తియు, యక్షుని యునికియు నగు నలకా నగరము.

అయ్యెడ నిలిచి కలయంజూచునప్పుడు మేఘుని కందో
యికి నానగరము—

"తస్యోత్సంగే ప్రణయిన ఇవ స్రస్తగంగాదుకూలాం,
నత్వందృష్ట్వానపునరలకాం జ్ఞాస్యసే కామచారిన్ !;
యా వః కాలేవహతిసలిలోద్గార ముచ్చైర్విమానా,
ముక్తాజాలగ్రథిత మలకం కామినీవాభ్రవృందం."

—63.

ఇట్లెగంబడి కనంబడునంట. ఆహా ! కవి సార్వభౌముని
కల్పనాచాతురీధురీణత ! కైలాసగిరికి నుత్సంగమునం బ్రణయి
యంకమునం బ్రణయిని భంగి స్రస్తగంగాదుకూలగం గనం

బడెను నానగరి నతఁడప్పుడలక యని సులువుగ గుర్తింప వచ్చును. మరియు, రాజభవనములవంటి దివ్యతరోన్నత హర్మ్యములతో నాపట్టణ మప్పుడు ముక్తాజాలగ్రథితములగు నలకలను వహించెడు కామినివలె సలిలోద్గారములగు నభ్రబృందములను వహించి యెంతయు శోభించుచుండును. కాబట్టి యతఁడిట్లే గుర్తింపవచ్చును.

ఇఁక నగరమునఁ జొరఁబడఁగనే యెవ్వరి నడుగనక్కర లేకుండ యక్షుని యింటిని గూడ గుర్తింపవచ్చును. ధనపతి రాజగృహమునకు నుత్తరదిశగాఁ బోయిన నింద్రధనుస్సు వలెఁ జారుతరతోరణముతో సందములు గురిపించెడు నా సిద్ధప్రాకారముల లోగిలియే యక్షుని వసతి.

పెరటియందు మందారవృక్షము గూడఁ గలదు. అది యక్షిణి పుత్రప్రేమతోఁ బెంచికొనిన వృక్షరాజము. ఆమె మేఘునకు వదినెగారు. అనగా నన్నగారి భార్య. కాబట్టి యభ్యంతర ప్రవేశ మతనికి సులభసాధ్యమే. ఆమెయు నేకపత్నియై ప్రియుఁ డింటికి వచ్చు సుదివసమింక నెన్నిరోజులున్నదో యని దివసగణనాతత్పరయై లోన నొకమూల వెతలఁబొగులు చుండును. అయినప్పుడు మేఘుని పలుకు లామెచెవిఁబడునా? అతఁడు కొంచెము లౌక్యబుద్ధి నుపయోగించినఁ బరవాయుండదు. అదంతయు యక్షుఁ డతనికి—

"తామాయుష్మన్మమచవచనాదాత్మనశ్చోపకర్తుం,
బ్రూయాదేవంతవసహచరో రామగిర్యాశ్రమస్థః

అవ్యాపన్నః కుశలమబలే! పృచ్ఛతిత్వాం వియుక్తః,
పూర్వాభాష్యం సులభవిపదాం ప్రాణినా మేతదేవ."

—103.

ఇట్లు ముందుగానే తెలియఁజెప్పెను. మేఘుఁడింటఁ బాదముపెట్టియుఁ బెట్టఁగనే — "అమ్మా! నీ సహచరుఁడు నేమము. అతఁడు ప్రస్తుతము రామగిర్యాశ్రమమున నున్న వాఁడు. నీ సేమ మరయఁగోరి యున్నాఁ"డని యిట్లు ప్రస్తావింప నుపక్రమించుట మంచిది.

అప్పుడు యక్షిణి దృష్టియెల్ల మేఘునిపై నొక్కసారి యొకమారుగఁ గేంద్రీకరింపఁబడును. తదుపరిఁ బవనతనయుని సీత యాదరించినట్లామె యతని నాదరించి యతఁడు తెచ్చిన తన ప్రియుని సందేశము నేకాగ్రచిత్తయై వినును.

"నన్వాత్మానం బహువిగణయన్నాత్మనైవావలంబే,
తత్కల్యాణి! త్వమపినితరాంమాగమః కాతరత్వం;
కస్యాత్యంతం సుఖముపనతం దుఃఖమేకాంతతో వా!
నీచైర్గచ్ఛ త్యుపరి చ దశా చక్రనేమి క్రమేణ."

—112.

ఇది యీ సందేశములోని పరమార్థము. యక్షుఁడు ప్రస్తుతము నిడుములు నలుగుచున్నను, భవిష్యములగు నాశల కెరవై తానట్లో యతికష్టముగఁ బ్రాణములను నిలుపుకొను

చున్నాఁడు. అట్లు, యింక గొంది కాలము తన ప్రేమికను గూడ వ్యవహరింపుమని యర్థించుచున్నాఁడు. ఇంక నాలుగు నెలలు కడచినఁ దా నింటికి వచ్చును. తప్పకవచ్చును. చీకటి వెలుఁగు లెన్నఁడు శాశ్వతములు కావు.

సందేశః శ్లోకముల సంఖ్య యంత పెద్దది కాదు. కాని యీ సంఖ్య యెంత చిన్నదో, యందలి సొగసుందనమంత యెసరియున్నది. అందుఁగల ప్రతిచిత్రకృతియు లోకనిరూఢిఁ గల యనుభూతితోఁ జక్కఁగ వియ్యమంది తొంగలించు చున్నది.

ప్రస్తుత మందు విరియఁబారియున్న శ్లోకరత్నముల లోని ఈ—

"త్వామాలిఖ్య ప్రణయకుపితాంధాతురాగై శ్శిలాయాం,
ఆత్మానం తే చరణపతితం యావదిచ్ఛామి కర్తుం;
అస్రై స్తావన్ముహురుపచితై ర్దృష్టిరాలుప్యతే మే,
క్రూర స్తస్మిన్నపి న సహతే సంగమంనో కృతాంతః."
—108.

శ్లోకముదాహృతిగ నాధేయము గావచ్చును. అక్కడ విరహోత్కంఠుఁడగు యక్షునకు క్షణ మొక యుగముగ నున్నది. ఉబుకెత్తి విజ్జువీగుచున్న విప్రయోగపు టవస్థను సహింపఁజాలమి నొక చక్కని రాతిపలకమీద ధాతురాగ ముల సాయమున నావె యాకృతిని జిత్రించుకొన్నాఁడు. అది యామె ప్రణయకోపమును బ్రదర్శించుచునప్పటియాకృతి. ప్రణయకోపము వచ్చునప్పుడు యక్షుఁడా వెనుక బుజ్జగించి ప్రతిమాలుకొనుటయుఁగలదు.

అది లోకరూఢిఁగల విషయమే. అట్లనాఁడును సంతరింపవలయునని యతని యభీష్టము. ఇఁక నాయాలేఖ్యమందలి యామె పదపద్మములపైఁ బడవలయును.

కాని, యా యాకృతి కట్టెదుటఁ గనఁబడుచుండుటఁ గాఁబోలు బాష్పపూరములు చూపును గట్టిగనవరోధింప సాగినవి. ఆరోజు లెంతగడ్డువో కాని, పాపమతని కప్పుడంత మాత్రపు సంగమ భాగ్యమైనను జేకురక పోయెను. హాఁ! కృతాంతుఁడమిత కఠినుఁడు. ఇక్కడఁ బల్లవించి పరిపుష్టమై యున్న యా సహజవర్ణనాసంపదల విలువ యనూహ్యము.

"భిత్త్వాసద్యః కిసలయపుటాన్ దేవదారుద్రుమాణాం,
పతత్ క్షీర స్రుతిసురభయో దక్షిణేన ప్రవృత్తాః;
ఆలింగ్యంతే గుణవతి! మయా తే తుషారాద్రివాతాః,
పూర్వం స్పృష్టం యది కిల భవేదంగమేభిస్తవేతి.
—110.

ఇదియు మేఘుఁడు యక్షిణికి కందఁజేయువలసిన యాస్వనిసందేశములోని శ్లోకమే. ఇందలి భావచంద్రికల ధవళిమ యదొక విధముగ నున్నది.

చక్కని పరిమళములను మోసికొని తుషారాద్రినుండి మందానిలమ్ములు తనవైపు వచ్చుచున్నప్పుడు యక్షుఁడు వానిని నవిరతాసక్తిమైఁ గౌగిలించుకొను చున్నాఁడు.

అంతకుమున్నవి తన ప్రియురాలి శరీరమును స్పృశించియుండ వచ్చునని యతని తలపోత. ఆవిధముగ నైనను విప్రకృష్టయగు తన ప్రియురాలను గాఢాలింగనము చేసికొనినట్లు తనియవచ్చునని భ్రమ. ఇక్కడ విరహుల సహజ ప్రవృత్తి కాళిదాసుని ప్రతిభా విశేషము కారణముగ నినుమడించి యందగించుచున్నది. మేఘదూతమందలి శబ్దార్థముల కలయిక నీరక్షీరముల కలయికవలెఁ జక్కగ నెసఁగియున్నది. భావకోమలతతోఁ దులదూగఁగల శబ్దమాధుర్యము; శాబ్దిక మధురిమతో జతఁ గూడఁగల యర్థమార్దవము నందలి రచనకుఁగల ప్రత్యేక గుణసంపద. కవిమూర్ధన్యుఁ డకావ్యమున నాదినుండి తుదివరకు మందాక్రాంతావృత్తములనే వాడెను. అవి విప్రలంభ శృంగారమునఁ దెగబారియున్న కరుణరసమును నవిరతముగ వెదచల్లఁగల వృత్తములు. అందుచేతనే కాఁబోలు పెద్దలు—"ప్రావృట్ప్రవాస వ్యసనే మందాక్రాంతా విరాజతే." ఇట్లుద్ఘోషించుచున్నారు.

అక్కడక్కడనైన యమకానుప్రాసాది శబ్దాలంకారములున్నవవి సహజాపతితములే కాని ప్రయాసన్యస్తములు కావు. అదియే యందలి కవితాధార యంత ధారాళముగ వెల్లివిరియుటకు ముఖ్యకారణము.

సముజ్జ్వల భావస్ఫోరకములై రమణీయముగఁ దురంగలించుచున్న—

"తస్మాద్గచ్ఛేరనుకనఖలం శైలరాజావతీర్ణాం,
జహ్నోఃకన్యాం సగరతనయ స్వర్గసోపానపంక్తిం;

గౌరీవ క్త్రభ్రుకుటిరచనాం యా విహస్యేవ ఫేనైః,
శంభోః కేశగ్రహణ మకరోదిందుల గ్నోర్మిహస్తా.''—50

''ఏభి స్సాధో! హృదయనిహితై ర్లక్షణైర్లక్షయేథా,
ద్వారోపాంతే లిఖితవపుషౌ శంకపద్మౌ చ దృష్ట్వా;
క్షామచ్ఛాయం భవనమధునా మద్వియోగేనసూనం,
సూర్యాపాయే నఖలు కమలం పుష్యతిస్వామభిఖ్యాం.–83

ఈశ్లోకముల జంట నొకించుక పరికింపఁదగును. గౌరి సాపత్న్య రోషమువల్ల మొగముఁ జిట్లించుకొనుచుండ నామెను నుర గల నెపమునఁ బరిహసించుచున్నదో యన్నట్లు గంగ యిందు లగ్నోర్మి హస్తములతో మగని జుట్టు బిగించి పట్టుకొన్నదఁట.

అనగాఁ దన పౌరుషత్వమువల్ల మగని స్వాధీనము చేసికొన్నదని భావము. గగనతలమునుండి పడుచున్న గంగను భగీరథుని ప్రార్థనవల్ల గంగాధరుఁడు తన జటాజూటమున నిలిపెనను పౌరాణిక విషయమును గవితల్లజుఁడింత చక్కగఁ జమత్కరించి సంఘటించెను.

ఇఁక, రెండవ శ్లోకమందలి—

''క్షామచ్ఛాయం భవనమధునా మద్వియోగేన సూనం.''
ఈపాదమునఁగల ప్రతియక్షరము పాఠకశ్రోతల హృదయములను నెసవెట్టఁగల కరుణరసోల్బణ నిర్భరమై యొసకొని యున్నది. యక్షుఁడింటలేఁడు. కాబట్టి సూర్యాస్తమయకాలమందలి కమలము మాదిరిగ నతని భవనము వెలవెలఁబోయి

యున్నదఁట. సూక్ష్మోక్తులతోఁ జక్కని బాలేయభావము లను వెదచల్లి సహృదయుల హృదయ సమవాయమును గుత్త గొనఁగల సామర్థ్యము కాళిదాసుని సొమ్మై యున్నది. యజ మానుఁడులేని యక్షుని గృహావర్ణనయు, వియోగ దుఃఖముల వెల్లువలంబెనవై చిక్కొని కొట్టుమిట్టాడెడు యక్షిణి వర్ణనయుఁ గనుంగడు బరిపోషితములై తీంట్రడించుచున్నవి.

ఆవర్ణనలయందు మొలకెత్తియున్న యానైసర్గికగుణాం కురములు లోకుల హృదయములను దలవని తలంపులకు నెస కొలుపుచున్నవి. అందుఁగల శక్తిసంపద యట్టిది. కాబట్టి యది సహజమే.

కాళిదాసు విక్రమార్కుని యాస్థానకవి. రాజకీయ వ్యవహారముల గురించి యతఁడొకవేళ దేశాంతరమేగిన నేగి యుండవచ్చును. ఆ పనులు చిరకాలమతని నక్కడ నిలిపియుం చవచ్చును. అప్పుడు యువకుఁడగుట నతనికి విరహవ్యథాను భూతి సహజమే. తత్ఫలితముగ నతఁడు స్వానుభూతిని మేఘ దూతము రూపమున రూపొందించి యుండునని పండితమం డలి వితర్కించుచున్నది. కావ్యమందిమిడియున్న ప్రతి శబ్దము కేవలము విప్రయుక్తుని నోటనుండి నిర్గమించినట్లు హృ దయభిదురమై పాఠకశ్రోతలను దయారస స్రోతఃకల్లోలము లందు నిలువున ముంచి యెత్తుచున్నవి. ఆవితర్కమున కిదియే ప్రధానోపపత్తి. కాని, నానావిధకావ్యరచనాచణుఁడైన కాళి దాసునివంటి ప్రతిభాసిద్ధిఁగల మహాకవికి నట్లు గానక్కరయుం

డను. మహత్తరదివ్యసృష్టి యతనికి సహజసిద్ధము. ఒకవేళను సాధారణములగు నతనికిఁ బ్రతిష్ఠించినఁ బ్రతిష్ఠించియుండవచ్చును కాని, స్వానుభూతి లేనప్పు డతఁడట్లు వ్రాయఁజాలియుండఁడ నుట కేవల మసంగతము.

విశ్రిమాలంకార భూతుఁడగు కాళిదాసుని కల్పనా శక్తి బహుసుందరముగ నిర్వహిల్లిన యలకా హిమాలయ ములయు నుజ్జయినీ కైలాసములయు వర్ణనలయందు సమృద్ధిగ నలరారి మనోజ్ఞముగఁ బుష్పించి యున్నది.

మొత్తముమీఁదఁ బూర్వమేఘ దూతమున నతని ప్రకృతి చిత్రీకృతి పరమావధికి వచ్చినదని కచ్చితముగఁ జెప్ప వచ్చును. మేఘుని మార్గము భౌగోళికము లగు నదులయు నగములయు దేశములయు వనములయుఁ బల్లెలయుఁ బత్తన ములయు సమవాయములతో నిండి యున్నది. అవి కావ్య మందున్న వున్నట్లుగఁ బ్రవిష్టములైన నంత బాగుండవు. అదంతయు నెరింగియే మహాకవి వాని చిత్రీకృతులను సుపు చిర భంగికల సమకొల్పెను. అయ్యెడఁ గాళిదాసు నదీనగా దులగు ప్రాకృతిక పదార్థములను గేవలము యక్షుని చిత్తక్షో భకములుగనే కాక యతిథ్యాతిథేయులయు బంధుమిత్రులయు విశేషించి ప్రేమికా ప్రేమికులయు సంబంధములఁ జక్కఁగఁ గల్పించి కృతకృత్యుఁడయ్యెను. ఆ కల్పనకుఁ గొన్ని యెడల

లోకరూఢియు, మఱికొన్ని యెడలఁ గవితాకల్పనయు నాధారములు.

అట్టిపదములఁ గవిరాజు తన ప్రతిభను గడుఁ బదిలముగ నడిపి యా ప్రాకృతిక పదములకు నొక విధమైన చమత్కృత శోభల నొడఁగూర్చఁ గలిగెను. ఇప్పు డత్యంత స్పృహణీయముగఁ బదిలింపఁబడిన—

''ఆపృచ్ఛస్వ ప్రియసఖమముం తుంగమాలింగ్య శైలం,
వంద్యైః పుంసాం రఘుపతి పదైరంకితం మేఖలాసు;
కాలే కాలే భవతి భవతో యస్య సంయోగ మేత్య,
స్నేహవ్యక్తిశ్చిర విరహజం ముంచతో బాష్పముష్ణం.''
—12.

''తస్మిన్ కాలే నయన సలిలం యోషితాం ఖండితానాం,
శాంతిం నేయం ప్రణయిభిరతో వర్త్మ భానో స్త్యజాశు;
ప్రాలేయాస్రం కమలవదనాత్సోఽపిహర్తుం నలిన్యాః,
ప్రత్యావృత్త స్త్వయి కరరుధిస్యాదనల్పాభ్యసూయః.
—39.

ఈ శ్లోకములను దిలకింపవచ్చును. ఈ రెండు శ్లోకములఁ బంచారించియున్న కల్పనలు క్రమముగ లోకరూఢి కల్పనకుఁ గవితాకల్పనకును దృష్టాంతములని పదిలపఱచ వచ్చును. ఇవి కేవలము మచ్చుఁదునుకలు. ఇకఁ జిత్తక్షోభక శక్తితోను సముదాత్త రచనాసౌష్ఠవముతోను నిర్వ్యాతములయిన ప్రకృతి వస్తువుల కేవల వర్ణనలును నయ్యెడ ముద్దుగ నెలకొనియున్నవి.

అట్టి వర్ణనల నైమిత్తిక శ్లోకములనుండి ప్రకృతము—

"పాండుచ్ఛాయోపవనవృతయః కేతకైఃసూచిభిన్నైః,
నీడారంభై ర్గృహ బలిభుజా మాకులగ్రామచైత్యాః.
త్వయ్యాసన్నే పరిణత ఫలశ్యామ జంబూవనాంతాః,
సంపత్స్యంతే కతిపయదిన స్థాయి హంసా దశార్ణాః"

— 3

ఈశ్లోకమును గ్రహించినఁ జాలును. దశార్ణదేశపుఁ బంట వలఁతి మేఘుఁడు చేరినప్పుడెంత సుందరముగ నుండవలయునో యంత సుందరముగ నుండునఁట. విడిచిన మొగ్గలుగల మొగలిమట్టలవల్లఁ దోటలకట్టవలు పాంశుచ్ఛాయనై విద్యోతించును. గ్రామములలోని రథ్యావృక్షములు పక్షుల కులాయ నిర్మాణ కార్యములతో నిండియుండును. జంబూవనంబులు పండిన పండ్లతోఁ గోమలశ్యామలములై తొంగలించును. పదపడి యయ్యది హంసలకుఁ దాత్కాలిక విశ్రాంతి భూమియుఁ గాఁగలదు.

ఉపమలు ఉత్ప్రేక్షలు నర్థాంతరన్యాసములు మొదలు గాఁగల యర్థాలంకారములును గావ్యమందు సుసంగతములై తీండ్రించుచున్నవి. శ్లేషయు నక్కడక్కడఁ జెలరేగియున్నది.

కావ్యపుటితివృత్తము మొదటినుండి తుదివరకును గేవలము శృంగారరస స్రవంతుల నెదురీది జలకమాడుచున్నది. కొన్నికొన్ని పట్టులందంతలి శృంగారము సంపూర్ణ స్వాతంత్ర్యము నూనియు విహరించుచున్నది. అందుకు—

"శబ్దాఖ్యేయం యదపి కిల తే యస్సఖీనాం పురస్తా,
త్కర్ణేలోలః కథయితుమభూదాననస్పర్శలోభాత్;
సోఽతిక్రాంతః శ్రవణవిషయంలోచనాభ్యామదృష్ట,
స్త్వాముత్కంఠా విరచిత పదం మన్ముఖేనేద మాహ."
—106

ఈ శ్లోకము సాక్షీభూతము కాఁగలదు. మొదట యక్షుఁడు తానస్వాయముగనేగి తన నెచ్చెలి చెవిలో నీసందేశమును జెప్ప నభిలషించెను. అదియు సఖుల ముంగట. అట్లయినఁ దదధరామృత పానము ప్రతిఫలము కావచ్చును. అతని యాశయు నదియే.

కాని, విధి నియంత్రితుఁడై దవుదవ్వుల నున్నవాఁడు. ఎంతలాలసత యున్నను బ్రయోజనములేదు. ఇఁక మేఘుఁడే దిక్కు. సందేశము మాత్రముత్కంఠావిరచిత పదంబులను బుక్కిట్టి యున్నది.

ఈ శ్లోకమున శృంగారము పొలిమేరల్కు దాటినది. ఇట్టి వింకను గొన్ని కలవు. అయినను, గావ్యమున నదియు నైచ్ఛఃస్థితిఁ బచరించియున్నది. నైతికరీతికిని నయ్యెడఁ గొదువలేదు. వియోగవ్యథల బంధములఁ జిక్కి యెడతెగకుండ నొగిలెడు నాదర్శ సతీపతుల యుత్తమప్రేమ మేఘదూతము. సంఘోన్నతికి నత్యావశ్యకమైన యాదర్శప్రేమ యందు మూర్తీభవించియున్నది. మరియునందు సుసంగతమ్ములై చెంగలించెడు ప్రత్యక్షరము నాత్మగౌరవము, దయ, ప్రేమ, మనః

స్థైర్యము, మైత్రి, పరోపకృతి, ప్రత్యుపకృతి మొదలుగాఁగల సమున్నతభావ భాగ్యములను బ్రత్యక్షనేత్ర చరితములుగఁ బ్రచరించుచున్నది.

"తాం చావశ్యం దివసగణనా తత్పరా మేక పత్నీ,
మవ్యాపన్నా మవిహతగతిర్ద్రక్ష్యసి భ్రాతృజాయాం;
ఆశాబంధః కుసుమసదృశం ప్రాయశో హ్యంగనానాం,
సద్యఃపాతి ప్రణయి హృదయం విప్రయోగే రుణద్ధి."
—10

యక్షుఁడు పుత్తెంచెడు సందేశమున కంతకు మూలాధార మీ శ్లోకము. సర్వసాధారణముగ నంగనహృదయము ప్రేమమయము. కాబట్టి యామె జీవితము మిక్కిలి సుకుమారము. అది వియోగ వ్యళీకము నెంతమాత్రము నిలవరింపఁ జాలదు.

అయినను, నాశాబంధము దానిని నియంత్రింపఁగలదు. ఇది బీరువోని యక్షుని మనఃస్థైర్యము. ఈ మనఃస్థైర్యమే యక్షుని సందేశ ప్రేషణమునకు మూలము. కార్యసిద్ధికి మనఃస్థైర్య మెంతయు నావశ్యకమను సముదాత్తార్థ మిందు శ్రుతిమధురముగ ధ్వనించుటయే కాక, కవిశేఖరునకుఁగల మానసీయ విజ్ఞాన సంపత్తియుఁ గేరింతలు గొట్టుచున్నది. అర్థాంతర న్యాసవ్యాజమునఁ గావ్యమును సవరణించియున్న—

"యాచ్ఞా మోఘా వరమధిగుణే నాధమే లబ్ధకామా—6

ఆపన్నార్తి ప్రశమన ఫలాః సంపదో హ్యుత్తమానాం.

—53.

స్యాత్యంతం సుఖ ముపనతం దుఃఖమేకాంతతో వా?

—111.

ఈ వివిధశ్లోక పాదములు లోకమున కజస్ర సమాదేయములు. ఆపన్నులకు నుపయోగింపని ధనిక వర్గమునకుఁ గవిరాజ కాళిదృక్పథమున గౌరవము పూర్ణానుస్వారము.

తోయక్రీడానిరతలగు యువతుల స్నానీయముల నతి తిక్తములగు గంధవతీ సమీరముల క్రీడలకుఁ బ్రధానాశ్రయములయిన రమణీయ నందన వనంబులతోఁ గలకల లాడెడు నుజ్జయినీ మహాకాలుని ప్రదేశవర్ణన నితాంత శోభావహము.

స్వయంప్రకాశమైన యా చండీశ్వరుని క్షేత్రచిత్రీకృతి దైశిక నృత్యావసరములందు లీలావధూతములగు పాదన్యాసముల వలన మనోహర క్వణిత రశనలగు శృంగార వేశ్యల మధుకర శ్రేణి దీర్ఘ కటాక్షములు కైపున రసజ్ఞ హృదయములను నవలీలగ నాకర్షింపకపోదు. భారత కవి సార్వభౌముని భావనా ప్రపంచమున నా పుణ్యక్షేత్రము భక్తిస్థానముగను విలాస స్థానముగను రూపొంది రవణిల్లుచున్నది. అలక యందుఁగల మహిళల నాగరకత యింతంతనిచెప్పనలవి కానిది. వారు వలరాజువంటి పరుల సాయ మపేక్షింపనంత యద్వితీయ చతురలు. కామి లక్ష్యములయెడఁ బ్రహితము

లగు వారి సభ్రూభంగ నయనము లెన్నఁడును బీరువడీ పోదు గవు. తదీయంబులగు విభ్రమంబులును నిరుపమములు. అక్కడి పురుష జాతియు నంతటి మహత్తర నాగరకత కల దియే. ఇది సమీక్షకు మాత్రమే దర్శన మొసఁగెడు మహత్తర విషయము.

అచ్చమైన నాగర కతా వికాసమునకు నైహిక లావణ్యాదికమే కాక, నైతికసంపత్తితో నేకీభవించెడు నపార ప్రతిపత్తియుఁ గావలయును. అలకాపురి నాగరకత చూపరకుఁగను వేదురు గలిగింపఁ గలుగునంత పరిష్కృష్టమైనదియే కావచ్చును.

కాని, కాళిదాసుని భావసమీక్షల నుజ్జయినీ నగరము కేవలము పైనుండి పంట పొలంతికి వలస వచ్చిన దివః ఖండము. అది యానాఁడు ప్రపంచమున బ్రహ్మాండ ప్రతిపత్తిఁ బడసిన భారత రాజధాని. ఆరోజులలోఁ బంటచెలి నెందును నంతటి దివ్యనగరము మరొకఁడు లేదు. అద్వితీయ భాసంతమైన యా యుజ్జయినీ నాగరకతయే ప్రస్తుత కావ్యాదర్శమునఁ బ్రతిబింబించెడు నా యలకానాగరకత. మేఘదూత కావ్యము—

"కశ్చిత్కాంతావిరహ గురుణా స్వాధికారాత్ప్రమత్తః,
శాపేనాస్తం గమిత మహిమా వర్షభోగ్యేణ భర్తుః,
యక్షశ్చక్రే జనకతనయా స్నాన పుణ్యోదకేషు;
స్నిగ్ధచ్ఛాయా తరుషు వసతిం రామ గిర్యాశ్రమేషు."
—1.

అందుచేతనే కాంబోలు, కాదంబరీ హర్ష చరిత్రాది గ్రంథకర్తయగు భాణుఁడు కాళిదాసుని—

"నిర్గతాసు న వా కస్య? కాళిదాసస్యసూక్తిషు,
ప్రీతిర్మధుర సాంద్రాసు, మంజరీష్వివ జాయతే.

ఇంతగాఁ గొనియాడు చున్నాఁడు.

చివరకు మేఘుఁడా వాచికమును యక్షిణికి వినిచినట్లు యక్షేశ్వరుఁడును గనికరించి యా నవదంపతులను గలిపినట్లు బ్రిక్షిప్తశ్లోకములు పచరించుచున్నవి. ప్రకృతి రామణీయకము నట్లు తలకడచి యుండునదికాదు కాళిదాసుని రచన. అంతియకాక,—

"ధూమజ్యోతి స్సలిల మరుతాం సన్నిపాతః క్వమేఘః?"

ఈ శ్లైషునఁ బదిలపరచిన భారత కవీంద్రుఁడక్కృతి నట్లనేఁ డును ముగించియుండఁడు. అతఁడు ప్రాక్తనులకుఁ బాశ్చాత్యనుఁడు అద్యతనుల కద్యతనుఁడు: అతని కవిత్వ కుజసర్యౌవన సురభిలము. ఆ యజస్ర యౌవన సురలత యద్వితీయ సౌభాగ్య వియద్విహారి. అద్యతన ప్రాచ్యపండితుఁడగు ఆర్. సి. దత్తు—

Kalidasa's Meghaduta is a lyrical gem so musical, so pathetic and yet so sublime that there is nothing equal to it either in Sanskriet or any other literature

ప్రశంసించు చున్నారు. ఆ మహాశయుని దృక్పథము మేఘదూతమువంటి మనోహరమైన విప్రలంభ శృంగార కావ్యము ప్రపంచ వాఙ్మయము నం దెందును లేదని కచ్చితముగాఁ జెప్పుచున్నది. ఒక ప్రాచ్యులేకాక పాశ్చాత్యమనీషులును ఆ దివ్యకృతి నుద్దేశించి—

There is nothing as perfect in the eligiac literature of Europe as the Meghaduta of Kalidasa

**M. FAUCHE.**

ముక్తకంఠముగా గొంతు లెత్తి పాడుచున్నారు. లోకమున మేఘదూతమువంటి మనోజ్ఞ గేయకృతి మరొకఁడు లేదని వారి స్థిరీకృతి. ఒక భారతీయ ప్రఖ్యాతినేకాక, యింతగా యావత్ప్రపంచ ప్రఖ్యాతి నార్జింపఁగలిగిన మేఘసందేశమునకు జన్మభూమి భారతదేశము. కాబట్టి భారతీయులమగు మనమెంతయు ధన్యులము. ఎప్పుడైనను లోకమునకు శాశ్వత జీవితమును అనుగ్రహింపఁ గలుగు దిట్టలు మహామహితాత్ములగు మహాకవులు.

ఇప్పుడు మేఘసందేశమొక భారత గేయ ఖండకావ్యమండలికేకాక, ప్రపంచమందుఁగల గేయ ఖండకావ్యజాతి కంతకుఁ బూజ్యస్థానముఁ గైసేసియున్నదని కచ్చితముగాఁ జెప్పవచ్చును.

అది సాటిలేని చక్కని సవ్యకృతి. అందు సల్లాపు ముద్దుగ నసియాడెడు ఆ కాల్పనిక కథాసంగ్రహము, కేవలము పస్థానీయస్థానములనే కాదు; ప్రాపంచిక దేశముల నన్నింటిని మున్మురముగా సురభీకరించి వైచినది. అనంతయు భరతమాత కమృత చలువ.

అందుఁగల పూర్వాపర భాగము లంద చందముల కదాని నొకటి మించియున్నట్లు పొసఁగియున్నవి. పూర్వమేఘము సులలితములగు మానవీయఁచిత్త వృత్తులతో గలిసి మెలసి తిరుగఁ జాలెడు చేతోహర బహిః ప్రకృతి వర్ణనల కాస్థానమై యుండ నుత్తరమేఘము సహజ సౌభాగ్య వైభవములతో సర్వాంగ సుందరముగ సంఘటింపఁబడిన నిస్తుల మానవచిత్త చిత్రముతో హాయిగ దోబూచులాడుచున్నది. ఘటకర్పరము, చౌరపంచాసిక, భర్తృహరి కర్తృకము శృంగార శతకము, అమరు శతకము, గీతగోవిందము;—ఇవి సంస్కృత వాఙ్మయమందుఁగల తక్కటి గేయఖండ కావ్యములు. ఇవి కేవలము మచ్చునకెత్తి చూపఁబడినవి. కాని యింకను గలవు.

జయదేవుని గీతగోవిందము ఖండకావ్య రూపక రచనలలోని సంయుక్త సౌరభములతో నుద్గమించిన స్పృహణీయ కావ్యము. ఇవన్నియు ఋతుసంహారముతోఁ గలిసి మేఘదూతముయొక్క ఛత్రచ్ఛాయ నెట్టి యీతిబాధలు లేకుండ నాఁటినుండి నేఁటివరకు హాయిగాఁ గాలక్షేపము చేయుచున్నవి.

•

శ్రీ మన్నారదేవతాయైనమః

# మహాకవికాళిదాసు

## రఘువంశము.

కాళిదాసుని కావ్య చతుష్టయమునందుఁ గడుంగడు పరిణతిఁ గాంచిన మహాకావ్యము రఘువంశము.

మహాకావ్యము పద్యసమన్వితమై, సర్గోపేతమై, సువిశాలతఁ గలదియై యుండవలయును. మరియు నది సమున్నత భావములతోను, సురుచిరాలంకారములతోను, సమలంకృతమై యుండఁదగును. అందలి నాయకుఁడు మేధావి, ధీరోదాత్తుఁడునై యుండవలయును. తదీయమైన ప్రయోజనము ధర్మార్థకామ మోక్షములందు నేదైన నొకదానిని సాధించునదియై యుండవలయును. అప్పుడది శ్రోతలయు, పఠితలయు హృదయముల నావర్జింపుచు నాచంద్ర తారకముగ నిలిచి వర్ధిల్లఁగలదు. ఇది దండి నిబంధన.

రఘువంశ మీ నిబంధనకు నెంతయు విధేయమై యున్నది. అందలి తొమ్మిదవ సర్గము మాత్రము కొంత మట్టుకు స్వాచ్ఛందత వహించిన దనవచ్చును.

అది వివిధ ఛందస్సులతోఁ గలిసి మెలసి మసలుచున్నది. లాక్షణికుల మతము ప్రకారముగా నొక్కొక్క

సర్గమున నొక్కొక్క ఛందస్సు చొప్పున నది మెలఁగవల యును. సర్గాంత భాగములందు ఛందఃపరివృత్తి యనివా ర్యము. కాని, తొమ్మిదవ సర్గమునందుఁ జివరిభాగము గాక, యుత్తరార్థ భాగమంతయు ఛందో వివిధతతో నడచి యున్నది. రఘువంశము రఘువంశ్యుల చరిత్రయే యితివృ త్తము గాఁగల మహాకావ్యము. రఘునరేంద్రుని పుట్టుకకు ముందావంశమునకు నిక్ష్వాకు వంశమను పేరుండెడిది. కాని, రఘునితో దానికి రఘువంశమను పేరుదయించినది. రఘు వంశము రాజులకుఁ దొలివంశకర్తయగు నిక్ష్వాకుఁడు ఋగ్వేద కాలమునాఁటి భారత చక్రవర్తి. ఐక్ష్వాకులయు, రాఘవు లయు ప్రవృత్తులు నిరుపమములు, ఆదర్శములు. ఆపావనపూ ర్తుల పవిత్ర చరిత్ర పురాణాదుల గోచరించు చున్నది.

సాధారణముగాఁ గావ్యమునకుఁ గథానాయకుఁ డొక్కఁడే యుండును, గాని పలువురున్నట్లు గోచరింపదు. అయిన, రఘువంశమునందు నాయకులు పలువురున్నట్లు కనఁ బడు చున్నది.

దిలీపుఁడు, రఘుఁడు, అజుఁడు, దశరథుఁడు రాముఁడు: ఈ యభిజాతులు కబ్బమందలి విశేష భాగము నాక్రమించి యున్నారు. రఘువంశమునకు అధినాయకుఁడు రాముఁడని కొందరి యూహ. అట్టివారిలోఁ బాశ్చాత్య పండిత శిరోమణి యగు హిల్లిబ్రాండ్ పండితుఁడొకఁడు. కావ్యమందలి మొదటి

సర్గము మొదలు తొమ్మిదవ సర్గమువరకుఁగల కథ పూర్వపీఠిక గాను, బదియవ సర్గము లగాయతు పదునేనవ సర్గము దనుకఁ గల చరిత్ర ప్రధానేతి వృత్తముగాను, బదునారవ సర్గము దొట్టి పందొమ్మిదవ సర్గము మట్టుకుఁగల చరిత ముత్తర పీఠిక గాను గుర్తింపనగునని యతని నమ్మకము. దిలీపునకు నందనుఁడు రామచంద్రునకు ముత్తాతయు నగు రఘురాజ పరమేశ్వరునిపేర నక్కావ్య ముదయించినది. మరియు, గ్రంథాదిఁ జాలవరకు నతని పవిత్ర చరిత్ర చక్కఁగఁ జిత్రింపఁ బడియున్నది.

అటువంటప్పుడు, శ్రీరామచంద్రమూర్తిని మాత్రమే కథానాయకునిగా గ్రహించిన, రఘునరేంద్రస్వామికి న్యా యము చేపడఁజాలదు.

ఇది నిజముగాఁ జిక్కుసమస్యయే. ఇదంతయు గ్రహిం చియే కాఁబోలు, సుప్రసిద్ధాలంకారికుఁడు, సాహిత్యదర్పణ కర్తయునగు విశ్వనాథకవిరాజు తన గ్రంథరాజమున మహా కావ్యమునందేక వంశీయు లెందరైనను నాయకులుగా నుండ వచ్చునని విధించి యున్నాఁడు. కాబట్టి రఘువంశమందలి రాజులెల్లరు కథానాయకులుగాను, తదీయలగు సతీమతల్లులు కథానాయికలుగాను, భావపీఠికఁ గైసేయఁదగును. ఇఁకఁ గావ్యమందలి వర్ణనలు, అలంకారములు హృదయావర్జక ములు. రసభావముల పారస్పరికంబగు కలయికయు హృ

ద్యము. రఘునరేంద్రుని జైత్రయాత్రకు సంబంధించిన ఘట్టములందు, అజమహీపతి యరాతి నృపులతోఁ బోరుసమయమందు, రామరావణ సంగ్రామ సందర్భముననుదోతెంచెడి కథాభాగములు వీర రస ప్రధానములు. అవి మూడు నాలుగేడు సర్గములందుఁ బండ్రెండవ సర్గమందును విడిసి యున్నవి.

పరశురాముఁడు రామభద్రునితో మొదట నెదురై ప్రసంగించెడు దృశ్యమునఁ గ్రోధరసము బసచేసియున్నది. దర్శకులకది పదునొకటవ సర్గమున గనిపింపఁగలదు.

అష్టమ సర్గమందలి యజవిలాపమందు, వసిష్ఠ గురుదేవుని సందేశమందును గరుణశాంత రసమ్ములు కలిసి మెలసి నడాడుచున్నవి. షష్ఠ సర్గమందలి యిందుమతీ స్వయంవరమందును, నవమసర్గమందలి వసంతాగమ సందర్భముననను, బదునారవ సర్గమందలి జలక్రీడల దృశ్యమందును బందొమ్మిదవ సర్గమందలి యగ్నివర్ణుని చరిత్ర చిత్రీకృతియందును శృంగారము ముమ్మరముఁగ నందగించి యున్నది. ఇఁకఁ దక్కిటి రసములగు భయానక, భీభత్స హాస్యాద్భుతములును గావ్యమందుఁ జక్కని వసతిఁ గలిగియున్నవి. మొట్టుకు రఘువంశము నవరసంబులకును వాసతేయము. "అట్టిదే మహాకావ్య, మట్టిదే యాకల్పాంతస్థాయి, యట్టిదే హృదయ రంజకము" నని యనెడు దండి పండితుని ప్రవచనీయత రఘువంశము ఎడలఁ బూర్తిగ నవితథమై పొదలాడుచున్నది.

ప్రస్తుతము—

"తస్మిన్ విధానాతిశయే విధాతుః,
కన్యామయే నేత్రశతైక లక్ష్యే;
నిపేతురంతః కరణై ర్నరేంద్రా,
దేహైః స్థితాః కేవల మాసనేషు."

(స॥ 6 శ్లో॥ 11.)

ఈ శ్లోకము దృశ్యతమము—

ఇందుమతి స్వయంవర సభాస్థలమునఁ బాదము పెట్టినది. అదేక్షణమున నక్కడి రాజన్యుల దృక్కులేకాక యంతర్బాహ్యేంద్రియములన్నియుఁ గేంద్రీకృతముగా నామె నైపుఁ బ్రసరింపఁబడినవఁట! అయిన నిందుమతి యెంత సౌందర్యవతి కావలయును? ఆమె కేవలము మూర్తీభవించిన యందములపోవు. అదియే దాసుగారి యంతరుద్దేశము. తదుద్దిష్ట మీ శ్లోకమున సర్వాంగ సుందరముగ సిద్ధించినది. ఈ శ్లోక బంధమునఁగల నిర్వృతి యనిర్వాచ్యము. అమలిన శృంగార వర్ణనయందుఁ గాళిదాసు గడిదేరిన సిద్ధహస్తుఁడనుటకు నీశ్లోకము ప్రబల నిదర్శనము.

అతిలోక సౌందర్యమును జిత్రించు పదనులఁ గవిశేఖరుని తూలిక యనుసరించెడు నుత్తమపదవి యిది. ఇట్టి ప్రణాళికలయందు సమీక్షించిన కొలఁది భావనవ్యత ప్రస్ఫురించుచునే యుండును.

ఈ సురుచిర పద్ధతిని గవిలోక మూర్ధన్యుఁ డభిజ్ఞాన శాకుంతలమునకుఁ గూడఁదలకొలిపి యున్నాఁడు. శకుంతల యతిలోక సౌందర్యవతి.యని చెప్పవలసి వచ్చిన తరుణమున దుష్యంతుని నోట మహాకవి—

''అనాఘ్రాతం పుష్పంకిసలయమలూనం కరరుహై,
రనావిద్ధం రత్నంమధు నవ మనాస్వాదిత రసం;
అఖండం పుణ్యానాం ఫలమివ చ తద్రూపమనఘం,
న జానే భోక్తారం కమిహ సముపస్థాస్యతి విధిః''

ఇట్లిరగొని పలవరించు చున్నాఁడు. ఇందలి చివరి పాదము కేవల మీ శ్లోకమునకే కాక శ్రీ కాళిదాసుని కవితా ప్రపంచమున కంతకు నొకయపురూపపు విద్యుద్దీపిక కైవున మనోజ్ఞ మరీచులఁ బ్రసరింపఁ జేయుచున్నది.

ఇక్కడఁ సువాసించెడు పదభావ విన్యాసముల సౌంద ర్య సౌరభము దురత్యయ పశ్చిమత లేని నిత్య శ్రీ సంపన్నము. కవితాస్వామ్యమందలి యిట్టి విధానములు నితాంత మనో రంజకములు.

ఇవి కృతహస్తులగు మహాకవుల సొమ్ములు. స్వయం వర సదోగృహమున సముచిత విష్టరములఁ గలాపించియున్న రాజకము నందజరాజన్యుని వరించిన భోజావరజ తాత్కా లికపుటవస్థను భరతశ్రీ విహారి కుంచి—

"సాయూని తస్మిన్నభిలాషబంధం,
శశాక శాలీనతయా న వక్తుం;
రోమాంచలక్ష్యేణ స గాత్ర యష్టిం,
భిత్త్వా నిరాక్రామ దరాలకేశ్యాః."

(స॥ 6. శ్లో॥ 81.)

ఇట్లీశ్లోక సురుచిర వర్ణములఁ జిత్రించి రసజ్ఞుల దృక్శృంగాటకమున నెలకొలిపినది. ఆయరాలకేశి హృదయ కపోతము రఘునందనునకుఁ జిక్కినమాట వాస్తవమే.

కాని యాపెముగ్ధ. దాన శాలీనత మెండు. అందువల్ల నామె తన యభిలాషను బ్రియున కెరుక చేయఁజాలకుండెను. అయినను నమ్మహిళ శాలీనత మంచిజాణ.

పులకలు నెపమ్మున బయటకుఁ బొమ్మని సలహా యిచ్చినది. అది మంచి బాగున్నదని యప్పుడా సుదతీ లలామ యభిలాష బంధము రోమాంచ లక్ష్యమ్మున నామె యంగయష్టి సాక్షాత్కరించినది. దాన నామెకు వ్రతకామ్యములు రెండును దక్కినవి. ఇక్కడఁ గాపురమున్న పాత్రౌచితి యత్యర్థ శ్లాఘనీయము. అమలిన శృంగార రసముయొక్క-నిష్యందముల నైసర్గిక గుణసంపత్తి యట్లే యుండును. దానినే మన యాలంకారికులు సాత్త్వికావిర్భావ లింగమన్నారు. ఇంక,——

"సర్వణేషు పరిభోగ దర్శినీ,
రక్షర్మపూర్వమనుప్రవృత్తసంస్థితః;

ఛాయయా స్మితమనోజ్ఞయా వధూః,
హ్రీనిమీలితముఖీశ్చకార సః."
(స॥ 19. శ్లో॥ 28.)

ఈ శ్లోకము గమనీయము.

ఇది రఘువంశపు రాజులలోఁ గట్ట కడపటి వాఁడగు నగ్నివర్ణుని కథాఘట్టములోనిది. అక్కథ కావ్యమందలి యంతిమ సర్గమునఁ బంచారించి యున్నది. శృంగారరస స్వామి తన వివిధావతారములతో దర్శన మొసఁగెడు పుణ్య స్థలమది.

అత్యంత శృంగారము ముమ్మరించి పంచారించిన మాట వాస్తవమే. అయినను నది మర్యాదలను దలకడచు నదిగఁ గనఁబడదు. సహజ సౌందర్యమును జెక్కుచెదరదు. కడుంగడు శృంగార రసమయంబగు తుది సర్గమ్మున వ్యవహ రించు నప్పుడు మహాకవి కనఁబరచిన జాగరూ కదీక్షతలు కవి ప్రపంచమున కజస్రా దర్శములు. రతిక్రీడలు ముగిసినవి. ప్రమదలు నిలువుటద్దమ్ములకడ నిలిచి తమతమ సంభోగ చిహ్నములు సమీక్షించు కొనసాగిరి. అగ్నివర్ణుఁడు గడిదే రిన కొంటె. అతఁడు గూఢముగా వారి వెనుక నిలువఁదలప డెడివాఁడు. అతని కది ముదావహము. వెంటనే చిరునగ వుల మోములతోఁ గూడిన యతని యొడలినీడ యాదర్పణ

ములు మనోజ్ఞముగఁ బ్రతిఫలించెడిది. మరి పరిమళము కది యీ సమయమున లజ్జాపాది.

వాని కది దర్శనీయమే. అయినను దరిపా వివశతఁ గంటి రెప్పల నైకమత్యము చేపడి జెను. ఇది భావ్యభావము. ఈ శ్లోకమునఁ బర్యాప్తించెడు శృంగారము వ్యాపాకస్థానము; మరియు, లోకరూఢము.

ఇఁకఁ గరుణరసము. అదియు, నిందు నవ నవ్యరుచు లతో నిష్యందించుచున్నది.

"కృతవత్యసి నావ ధీరణాం,
అపరాద్ధేఽపి యదా చిరమయి;
కథ మేకపదే నిరాగసం,
జనమాభాష్యమిమంన మన్యసే?"

(స॥ 8. శ్లో॥ 48.)

ఇది యజవిలాప ఘట్టములోనిది. నీ యెడల నేను పెక్కుసల ముగఁ దప్పులుచేసి యున్నప్పుడుగూడ నీవు నన్ను దూషించి యెరుఁగవు. అట్టి నీవు నేఁడు కేవలము నిరాగసుఁడ నగు నాతో నిట్లొకే యొకమారుగా మాటాడ వింమించితివేమి? యిందుమతి!

స్పృహాతప్పి పడియున్న యిందుమతి నుద్దేశించి యజుఁడు నిగదించెడు సశోక నిగదములివి. ఇవి లోకమునఁ గల మామూలు మాటలే యైనను, గాళిదాసుని లేఖనీస్పర్శ మున దివ్యతరమగు నూర్జస్వలత నధిగమించి యున్నవి.

లోక నిరూఢిఁగల సాధారణ వచోభావములను హృదయావర్జకముఁ గలిగింపఁగలుగునదియే సుకవిత. అట్టి మహత్తర బుద్ధిమంతులే మహాకవులు. అట్టి బుద్ధిమత్త్వము కాళిదాసుని యెడలఁ బ్రకాశించి కలకలలాడుచున్నది. అతఁడు ప్రపంచ మహాకవిగాఁ బరిగణింపఁ బడుటకుఁగల ప్రముఖ కారణములలో నదియొకటి.

"విలపన్నితి కోసలాధిపః,
కరుణార్థగ్రథితం ప్రియాంప్రతి;
అకరోత్పృథివీరుహానపి,
స్రుతశాఖారసబాష్ప దూషితాన్."

(స॥ 8. శ్లో॥ 70.)

ఈ శ్లోకమునఁ గరుణరసము పరమావధికి వచ్చియున్నది. ఆనాఁడు రఘునందనుని పరిదేవనము లెంత విశంకటములై యున్నవో ప్రస్తుత మీ శ్లోకాదర్శమున సుస్పష్టముగఁ గనవచ్చును.

నాఁడు పొంగిపొంగి ప్రవహించెడు నజుని దుఃఖప్రవంతి కెందుఁబరికించి చూచినను గట్టులగుపింపకుండెనను సాధారణ నిగాదమును మహాకవి యియ్యెడ నెంత చక్కని భావభూషలఁ గలాపించి పరిపోషించెనో!

అది యతని ప్రత్యేక ప్రజ్ఞలత. ఆనాఁడతని యా దుర్భర పరిదేవనములకు జడంబులగు వృక్షములును గరఁగి

కొమ్మల నిష్యందించెడు మకరందంబులను బాష్పమ్ములసాంత
ముగ దూషితము లై పోయినవఁట! నిజము చెప్పవలసి వచ్చి
ననియ్యెడఁగల భావగంభీరత యమేయము. ఇక్కడఁ బ్రకృతి
మానవులకుఁ గల నైసర్గిక బంధుత్వము చక్కగఁ బరిపుష్టమై
యున్నది. వీరాదులగు తక్కటి రసంబులును రఘువంశమున
నెనలేని సౌందర్యాతిశయముతో విజృంభించి విహరించుచు
న్నవి. రఘువంశము సంస్కృత విద్యార్థి లోకమునకుఁ బ్రథ
థమ పాఠ్యగ్రంథముగా ముప్పదిమూఁడు వ్యాఖ్యాతల హృ
దయ సౌధమునఁ జక్కగ నధివసించి యున్నది. అయిన
దాని యూర్జస్వలత యెంత గొప్పదై యుండవలయును? అది
యూహాతీతము.

ఇఁక నక్కావ్య మన్యులెవ్వరు వ్రాసినను బ్రయోజన
ముండదనంత యుత్తమస్థాయి దానిని విరచించి యందు దర్శ
నీయమైయున్న కవిత్వ దివ్యత్వమునను బ్రజకు దానియం
దేర్పడిన ప్రేమాతిశయమునను దనకుఁ దానై వచ్చి వరించిన
రఘుకార బిరుదమును వహించిన మహాకవి కాళిదాసు భార
తీయుఁడగుట మనము ధన్యులము.

అగ్రియ కావ్యమగు రామాయణమునకుఁ గాళిదా
సప్పుబడియున్న ఋణమతీతము. అయినను నతఁడు గ్రహిం
చిన సూర్యవంశపు రాజుల క్రమవిషయము కేవలము వాయు
విష్ణు పురాణ గ్రంథములకే కాని, రామాయణ కావ్యమున
కేమియు సంబంధించి యున్నట్లగపడదు ఆ రెండు పౌరాణిక

కృతులలోను నది యెక్కువగ వాయుపురాణమును అనుస రించి యున్నది. భాసుఁడు కాళిదాసునకు ముందుఁగల మహా కవి. అతఁడు సంతరించిన ప్రతిమానాటకమునందుఁగల రాముని పూర్వికుల క్రమాంశమునకును నందలి క్రమాంశము నకును సదృశత కలదు.

కావ్యమందలి మొదటి పదునేను సర్గములలోను దిలీప రఘ్వజ దశరథ రాములు చిత్రింపఁబడియున్నారు. అందు రఘురామ భూపాలురు ప్రాముఖ్యము వహించి యున్నట్లు తల చూపుచున్నది.

పదునారవ సర్గమున రామభూపాలుని తనూభవుఁడగు కుశుని చరిత్ర వ్యాపించి యున్నది. పదునేడవ సర్గమునందతని కుమారుఁడగు నతిథిప్రవృత్తి కలదు. ఇఁకఁ బదునెనిమిదవ సర్గము. దానికిని తక్కిన సర్గములకును గొంత యసమత కలదు. అతిథికి నగ్నివర్ణునకు నడుమఁగల యిరువదియొక్క రాజుల చరిత్ర యచ్చోఁడఁ గ్రోడీకృతమై యిమిడియున్నది. మఱియు వర్ణనలందుఁ గుతిమత మెందు. అందలి నాయకుల చరిత్ర కేవలము శ్లేషల సాయముతోనే చిత్రింపఁబడి యు న్నది. తక్కటి సర్గములందుఁ బ్రతిఫలించెడు నా హృదయం గము కవితా ప్రగోగతి యచ్చోఁడఁ గనిపింపదు.

ప్రిస్తుతము—

"తస్మిన్ ప్రయాతే పరలోకయాత్రాం,
జేతర్యరీణాం తనయం తదీయం;

ఉచ్చైశ్శిరస్త్వాజ్జితపారియాత్రం,
లక్ష్మీస్సిషేవే కిలపారియాత్రం. ”

(స। 18. శ్లో॥ 16.)

ఈ శ్లోకము సమీచీనము.

అహీనగుఁడు పారియాత్రునితండ్రి. శైశవ్రుఁడగు నహీనగుఁడు పరలోక యాత్రను సేవింపఁబోఁగా రాజ్యలక్ష్మి యతని పుత్త్రుఁడగు పారియాత్రుని సేవింపసాగినది. అతఁడు సమున్నత శిరస్కుఁడు. దానఁగుల శైలములలో నొకఁటియగు పారియాత్రమును జయింపఁ జాలెను. ఇఁక,—

“తతఃపరం తత్ప్రభవః ప్రపేదే,
ధ్రువోపమేయో ధ్రువసంధిరుర్వీం;
యస్మిన్నభూ జ్జ్యాయసి సత్యసంధే
సంధిర్ధ్రువః సన్నమతా మరీణాం.”

(స॥ 18 శ్లో॥ 34.)

ఈ శ్లోకము సరయుఁడగును. ధ్రువసంధి యన్ని విధముల నుత్తానపాదుని పుత్త్రుఁడగు ధ్రువునకు సమానుఁడు. అక్కాలమున శాత్రవు లతని యెడల వినమ్రత కలిగి యుండిరనిన నందు కతనియందుఁ బ్రతిఫలించెడు శ్రేష్ఠతా సత్యసంధతలే కారణము.

శత్రుఘ్నునితో నతనికిఁ గల సంధి ధ్రువసంధి. కాబట్టి యతఁడు నామమాత్రుఁడు. ఈ విధముగ నంతమంది నాయకులగాథ లొక్కొకే సర్గమున సాధారణ ధోరణిలో నిమిడి పోయినవి. కావ్యప్రపంచమున నెల్లప్పుడు నగ్రస్థానము గలాపించెడు మహాకవి కాళిదాసుఁ డయ్యెడ సంతతి సాధారణ పద్ధతి నవలంబించుటకుఁ దగిన కారణ ముండకపోదు. దిలీపాది నాయకుల చరిత్రయందుఁ బలె వారి యితివృత్తము లందుఁ జెప్పఁదగినంత ప్రముఖ వాచ్యము లెవ్వియు లేక పోయి యుండవచ్చును. కానిచోఁ దక్కటి సర్గములం దనమేయ రమణీయత నొలికించిన యతని సుప్రసిద్ధ లేఖిని యీ యొక్క చోట నంత త్వరితముగ బరువు లెత్తదు.

అయినను భాషా లాలిత్యము చెక్కుచెదర లేదు. ధారాసుభగతయుఁ దొలఁగ లేదు. ధ్రువసంధి కుమారుఁడు సుదర్శనుఁడు. అతని చరిత్ర కథనముతో నా సర్గము పర్యవసించు చున్నది.

అష్టాదశ సర్గమున నేమైనఁ గొంచె మగ్రియతఁగల చరితమున్న నది యీ సుదర్శనుని చరిత్రయే. తక్కటివారి యితివృత్తముల కొకఁటి రెండు శ్లోకములు సరిపోఁగా సుదర్శన మహీపతి కథా కథనమునకు దాదాపు పదునెనిమిది శ్లోకములు కావలసి వచ్చినవి. ఇఁక నేకోనవింశ సర్గము. అది రఘువంశపు నృపతులలోఁ గడగొట్టువాఁడగు నగ్నివర్ణుని చరిత్రతో నిండియున్నది. అగ్నివర్ణుఁడు కేవలము భోగలా

లసుఁడు. అతఁడు తన జీవితములో నొక క్షణమైనను బహిభుత్వ కార్యములు పర్యవేక్షించినట్లగుపింపదు.

"తం ప్రమత్త మపి న ప్రభావతః,
సేదురాక్రమితుమన్యపార్థివాః;
ఆమయస్తు రతిరాగ సంభవో,
దక్షశాప ఇవ చంద్రమక్షిణోత్."

(స॥ 19. శ్లో॥ 48)

ఈశ్లోకమునందుఁ బ్రమత్తత, ప్రభావము, ఛిద్రత మొదలగునగ్నివర్ణుని యవస్థా విషయము లుల్లిఖితములై యున్నవి. రఘువంశ్యులగు దిలీపాదు లందరి త్రోవ యొకఁటి యగ్నివర్ణుని దారి మాత్రము మఱొకఁటి.

ఆసికా శాయికలు లేని నిరర్గళైక భోగలాలసుఁ డగ్నివర్ణ మహీపతి. ధర్మాది సుగుణములయెడల గడుంగడు జాగర్యా పరతలు గలవారు తక్కటి దిలీపాది నరేంద్రులు. ప్రొద్దు మాపులు కేవలము స్త్రీలంపటతమైఁ గడపెడునంతటి ప్రమత్తుఁ డతఁడు. అయినను నిరతి శయ తేజశ్శాలి. దాన శాత్రవు లతనికి సర్వ కాల సర్వావస్థల యందును విధేయులై యుండెడివారు. కాని తుదకాతఁడు రతిరాగజమయిన యామయమునకుఁ దలయొగ్గ వలసిన వాఁడయ్యెను. ఇక్కడ నగ్నివర్ణునిపాత్ర మెంతయుఁ జేతోహారముగఁ జిత్రింపఁ బడినది. ఒకయెడఁ గవిరాజ కంఠీరవుఁ డతని ప్రమత్తుఁడను చున్నాఁడు, మఱొకయెడ శాత్రవ దుర్నిరీక్ష్యుఁడని బల్ల గ్రుద్ది చెప్పు చున్నాఁడు.

అగ్నివర్ణుఁడు వ్యభిచారి, [illegible]. అయినను గత్వరత యెఱుఁగని మంచి తేజస్వితఁ గలవాఁడు. అతని పూర్వపుణ్య విశేషమున నతని మంత్రులును విశ్వాసపాత్రులు.

మహాకవి తన కుమార సంభవమున "ఏకో హి దోషో గుణసన్నిపాతే, నిమజ్జతీందోః కిరణేష్వివాంకః" యని యుల్లేఖించి యున్నాఁడు. ఒక్క సుగుణముల ముందొక దుర్గుణ మున్నను నది పైకి రాఁజాలదఁట. కాబట్టి యగ్నివర్ణుని నతఁడు—

"తంప్రమత్త మపి న ప్రభావతః,
శేకురాక్రమితుమన్య పార్థివాః;"

ఈ మాదిరిగఁ జిత్రించుట కది యేమూలమై యుండవచ్చును. అతని వ్యభిచారాది గుణజాతము సాంయుగీనమగు నతని యంసలత ముందు మరుగు పడిపోయినది. పెద్దల దోసఁగుల నెత్తి చూపుటకు సాధారణముగా మానుష్యకము సాహసింపఁ జాలదు. అందుకు వారిపట్లఁగల యాపార్థవమే కారణము. కాని తాదృక్షులకును గర్మానుభూతి దురత్యయము. కనుకనే యగ్నివర్ణుఁడు పరిపంథి దుర్నిరీక్ష్యుఁడయ్యును గర్మ ఫలమును నిలువరింప లేకపోయెను.

చెడునడత యంసలతోర్జస్వలతల ముందుఁ గొంత మట్టుకు మరుగుపడి యుండిన నుండవచ్చును. కాని తుదకది తదీయులకుఁ దగిన ఫలమును గుడిపి తీరునను చక్కని ప్రజోపదేయోప దేశ మియ్యెడ నంతర్వ్యాపియై యున్నది.

ఈశ్లోక మొకవైపు కథానాయకుని పాత్రకు నొక విశేషమగు వన్నెఁ దెచ్చుచున్నది. మఱొకవైపు ప్రజకుఁ బ్రశంస్యమగు చక్కని యుపదేశమును మూటఁగట్టి యందిచ్చుచున్నది. ఆహా! కవి శేఖరుని ప్రతిభా విశేషము! తుద కగ్నివర్ణుఁడు తన కర్మకుఁ దగిన ఫలముగ రాజయక్ష్మకుఁ జిక్కి కాయము వాయఁగా నప్పటి కంతర్వత్నిగా నున్న యతని యర్ధాంగి మంత్రుల తోడ్పాటుతోఁ బ్రజా స్వామ్యము చేయ నారంభించినది. ఐక్ష్వాకుఁడగు దిలీపుని ప్రభుత్వముతో నారబ్ధ మయిన రఘువంశము గర్భవతి యగు నొక వితంతువు ప్రభుత్వారబ్ధితోఁ బర్యవసించినది. అగ్నివర్ణుని కథా కథన శిల్పమునఁ గాళిదాసుని కళా నదీష్ణతయే కాక, యతని రాజకీయ తంత్రజ్ఞతయు విశేషించి కలకల లాడుచున్నది.

ఆ జన్మశుద్ధులు ఆ ఫలోదయ కర్మలు ఆసముద్ర క్షితీశులు ఆ నాకరథవర్త్మలు యథావిధి హుతాగ్నులు యథా కామార్చితార్థులు యథాపరాధ దండులు యథాకాల ప్రబోధులు నగు కేవల పవిత్రమూర్తులు దిలీపాది నరేంద్రులు.

వారు విశేషముగా ధనము కూడఁ బెట్టుదురు; కాని, యది కేవలము త్యాగము కొఱకు. సత్య సంరక్షణము వారికిఁ బ్రధాన కృత్యము. అందుకు వారెక్కువగా మితభాషిత్వమును బోషించుకొందురు. వారి విజిగీషుత కేవలము యశో

నైమిత్తికము. వారును గృహమేధులే; కాని, యాగృహ మేధిత ముఖ్యముగాఁ బ్రజోత్పత్తికే కాని మరొకదానికిఁ గాదు. ఇఁక శైశవమును విద్యాభ్యాసముతోను యౌవనమును విషయైషితతోను వార్ధకమును మునివృత్తితోను గాలము గడపుచుఁ దుదకు యోగమార్గమునఁ బరమ పదించెడు దివ్యమూర్తులువారు. అట్టి మహామహితాత్ముల పవిత్ర చరిత్రలతో నుదయించి నడచిన రఘువంశము నిరతైక విషయలోలుఁడు లాలసుఁడు ప్రాగుఁబోతు వ్యభిచారియు నగు నగ్నివర్ణుని యితివృత్తముతో ముగింపు నందుకొన్నది.

ఆరంభావసానముల నడుమ నసియాడెడు నా విభిన్నతారమణీయత ప్రాక్తనులకు సమగ్ర పూజ్యము. నవ్యులకవశ్య జుష్యము, ముందటివారి కేకైకా దర్శము.

కాని, యాప్రస్ఫుట వైరుధ్యము ఆ పాతాత్పర్యావసానముఁగని కొందరు, ''రఘువంశము పందొమ్మిదవ సర్గముతోఁ బర్యవసించి యుండునా''? యని సందేహించుచున్నారు. పరంపరగా వచ్చెడు కొన్ని యైతిహ్యాని వేదికలు రఘువంశమిరువదిరెం డిరువదియైదు సర్గములుగల మహాకావ్యముగా నిగదించు చున్నవి. అయిన నా నిగాదములకుఁ బ్రాబల్యముఁ గల యాధారము లెవ్వియుఁ గనఁబడవు. కాబట్టి యవి సమూల సమ్మార్జనీయములు. ''హిల్లిబ్రాండ్'' యను నొక యుపరాంత పండితుఁడు కావ్యమందలి చివరి సర్గములు రెండును బ్రక్షిప్తములై యుండవచ్చునని యూహించుచు

న్నాఁడు. పదునెనిమిదవ సర్గమునఁ గల కుత్రిమతాప్రా స్వతలు, పందొమ్మిదవ సర్గమునఁగల విరసతా వామనతలు నందుకు మూలమని యతని వాదన.

పదునెనిమిదవ సర్గమున నిరువదియొక్క రాజుల చరిత్ర యిమిడియున్నట్లు పైన వ్రాసితిని. దిలీపుఁడు మొదలు కుశుని పుత్రుఁడగు నతిథి వరకుఁగల యేడుగురు నాయకుల చరిత్రను మహాకవి మిక్కిలి విపులముగాఁ జిత్రించి యున్నాఁడు.

కాని, యతిథికి నగ్నివర్ణునకు నడుమఁగల యిరువది యొక్క నాయకుల చరిత్రను నొకేయొక చిన్న సర్గమున నిరికించి వైచెను. "హిల్లిబ్రాండ్" పండితుని వాదమునకు నదియు నొక ప్రబలకారణము. కాని, యతని చేతయతకుఁ బటిష్ఠత లేదు. కాబట్టి విజ్ఞాని బాహుళ్య మురరీకరింపదు. మహాకవి యిరువది యొక్క రాజన్యుల చరిత్ర నొకేయొక చిన్న సర్గమునం దట్టిరికించి వర్ణించుటకుఁగల ముఖ్యహేతువును బైనఁ జేర్కొంటిని. కాబట్టి పునరుద్ఘాటన మనావశ్యకము. మల్లినాథునివంటి సుప్రసిద్ధ వ్యాఖ్యాతలు పలువురా రెండు సర్గములును వ్యాఖ్యానించిరి. కాని వారెవ్వరు నవి ప్రక్షిప్తములని దిఙ్మాత్రముగా నైనను సూచింపలేదు. ఇఁక గ్రీస్తుశకము పదునొకండవ శతాబ్దినుండియుఁ గల యలంకార గ్రంథములం దందలి శ్లోకములు కొన్ని యుదహరింపఁ బడి యున్నవి.

దాన నవి కేవలము ప్రాక్తనము లనుటకు సందేహింప నక్కరలేదు. ఇంకను దుదిసర్గము చేతోహారములగు స్పృహణీయ కవితా విహారములతోం దొణికిస లాడుచున్నది. ప్రకృతము—

"స స్వయం చరణ రాగ మాదధే,
యోషితాంన చతథా సమాహితః;
లోభ్యమాన నయనః శ్లథాంశుకై,
ర్మే ఖలాగుణ పదై ర్నితంబి భిః."

(స॥ 19. శ్లో॥ 26)

ఈ శ్లోక మత్యాజ్యము. అగ్నివర్ణుడు సుఖప్రతీక్షత కెదురు చూచెడు భోగి. అతడు స్వయముగా విలాసినుల పాదములకు లాక్షా రసమును బూయుచుండెడివాడు. అది యతనికిం బరమప్రీతి. ప్రియుని కరస్పర్శమున వారికి విహ్వాలత దురతిక్రమ మగుచుండెడిది. తదుపరి వారి వారి నితంబ మేఖలా గుణపదమ్ములు శ్లథాంశుకము లగుచుండెడివి. ఆ సుసమయములం దతని దృక్పరంపర యటువైపునకు వద్దన్నను నెగంబ్రాకక నిలువదు. అవి యతనికి మంచి పండగ సమయములు.

అట్టిపట్టుల నతని కాపూతలయందు సమాహితత్వము పూర్ణాను స్వారమగుట సహజము. ఒకవేళ నతడా క్రియల కుపక్రమించుటయు నట్టి వినోదములను జూచి యానందించుటకే యైయుండును.

అది లోకాను భూతికి దూరముకాని శృంగార పురుషుల లక్షణము. ఇదే సమయమున—

"తస్యా స్తథావిధ నరేంద్రవిపత్తిశోకా,
దుష్ణైర్విలోచనజలైః ప్రథమాభితప్తః;
నిర్వాపితః కనక కుంభ ముఖోక్షితేన
వంశాభిషేక విధినా శిశిరేణ గర్భః."

(స॥ 19 శ్లో॥ 56)

ఈ శ్లోకమును గూడ సమీక్షించుట సమంజసము. ఆమె రఘువంశపు రాజులయింటి కోడలు మహారాజ్ఞి. మగఁడు మరణించునాఁటి కాయువతి గర్భవతియై యుండెను. ఇఁకఁ బ్రజాపాలన మొనర్చు బాధ్యత యాపె భుజస్కంధములపైఁ బడ్డది. భారతభూమి యందలి పురాతన స్త్రీలు కేవలమబలలు కారు; వారు సమయము వచ్చినప్పుడు రాజ్యపరిపాలనములను గూడ నిర్వహింపఁ గలిగెడు నంత సమర్థతఁగల దిట్టలని గంభీరోక్తిగాఁ బ్రవచించుట కీశ్లోకము వెన్నెముకగాఁ గనఁబడు చున్నది.

భర్తృ వియోగమువల్ల జలజలఁ బ్రవహించెడు నుష్ణ బాష్పములఁ దొలుతొల్త నభితప్తమయిన నాపె గర్భము రాజ్యాభిషేక శిశిర జలంబులఁ దరువాత నాప్యాయితమైన దఁట. మొదట దాపురించిన విపత్తువల్ల దుఃఖితమయిన నామె హృదయము, పదపడి లభించిన రాజ్యశ్రీమూలమున శాంతివంత మైనది. కాబట్టి వంశాధారమగు నాగర్భమున

కిఁక భంగశ్లేతిలేదు. రాఘువుల వంశమింకను గొనసాగఁగల దను నుత్కృష్ట భావకణమ్ము లిమ్యెడ ఉలిగతులఁ బ్రస్ఫో తించుచున్నవి. చివరిదియగు——

"తంభావార్థంప్రసవసమయాకాంక్షిణీనాంప్రజానా,
మంతర్గూఢం క్షితిరివ నభోబీజముష్టిం దధానా;
మౌలైఃసార్ధం స్థవిరసచివై ర్హేమసింహాసనస్థా,
రాజ్ఞీరాజ్యం విధివదశిషద్భర్తు రవ్యాహతాజ్ఞా."
(స. 19. శ్లో॥ 57.)

ఈ శ్లోక మాభావకణమ్ములను బరిపోషించు చున్నది.

శ్రావణ మాసంబునందుఁ జక్కఁగ నుప్తంబగు నంత ర్గూఢ బీజముష్టిని భూమి ప్రజాభ్యుదయ నిమిత్త మెట్లుధరిం చునో యట్లు యమ్మహారాజ్ఞి యంతర్నిగూఢంబగు తన గర్భ మును గేవలము ప్రజాభావార్థము మోయుచు దివ్యతర ముగఁ బుడమి నేలెనఁట.

ఇక్కడ నుభయత్ర ఫలాకాంక్షులు ప్రజలు. ప్రస్తుత ము రాజ్యభారము వహించిన మహారాజ్ఞికిఁ బుట్టఁ బోవునది ముందుఁ బ్రజాపాలన భారమును వహింపఁదగ్గ మగశిశు వేకాని మరొకఁటి కాదను నింపితమైన యాశాజనక వాతావరణ ములోఁ గావ్యముఁ ముగియుచున్నది. అది నిత్యనవ్యతఁగల యపురూపపు ముగింపు. మహారాజ్ఞికి నొకవైపు గర్భిణీత్వము, మరొకవైపు భర్తృవియోగము. ఆమెకు నాఁడు తటస్థించిన

మూవిపత్తు ఘోరాతి ఘోరమైనదను నొక విధమగు నవ్య క్తిస్ఫూర్తి ధ్వని యీమా పలుకులలో గానవచ్చు లాడుచున్నది. అభిజ్ఞాన శాకుంతలము నందలి శకుంతలకంటె నెనిమిటిచేత విడువంబడు పత్నికు నిందు మూలాలుగం జిత్రింపంబడ్డది.

శకుంతల కడుంగడు జాగర్యతోం జూడందగ్గ నిందు మూలాలు. కాని యీమె కాతపనము నంవాద్భత్రికి మూరుగం బ్రత్యాదేశమే చేపడినది. అందునను అది మగనిది; మరియుం బలువురి సమక్షమున.

అప్పుడామె పూర్తిగ నిరాశ్రయురాలు. ఆనాండా విషన్నమయమున నామె హృదయ మెంత ఘూర్ణిల్లిపోయి నదో! అది వాచ్యాతీతము. పాఠకులకైనను, ప్రేక్షకుల కైనను దుదకు శ్రోతలకైనను వెలితిలేని తాదాత్మ్యలబ్ధి కేవలము మట్టి పట్టులందే. ఇంక శైలీసౌందర్యము, పదలాలిత్యము లోనుగాంగల సుకవితా గుణపరితాన మాసర్గమునం జెక్కుచెదరని దివ్యభవన మేర్పరచుకొని యున్నది. ఇప్పు డొకటు పరికించి చూచినను దుదిసర్గము కాళిదాసీయ మనుట తప్పని సరి యగుచున్నది. అయినం బదునెనిమిదవ సర్గము? అదియుం గాళిదాసీయమే. ఇంక, నగ్నివర్ణుని నడవడి. అది కేవల మానవులకే తగనిపని. అటువం టప్పుడది యశేష శాస్త్రవేత్తలగు నృపాలునకు సముచిత మనుట యనార్యోక్తి.

అయినను, లోకదాసీయమగు ననర్ఘోపదేశ మందు స్వచ్ఛందముగా మసలుచున్నది. ఆ కవితాప్రాభవము వల్లను

ఆ సత్సందేశము వల్లను అది మరుగుపడి చివరకుఁ బ్రజాగ్రాహ్యంబగు శుభ సందేశముగా రూపొందినది.

ఇంకొక విషయము. కుమారసంభవ మేఘదూతముల ముగింపులను గురించి యింతకుముందుఁ జర్చించియుంటిని. ప్రస్తుతమవి చయనీయములు. అవి కమనీయమైన సూచ్య సూచక వాతావరణమునందు సంభాళింపఁబడి యున్నవి. ఒక పర్యాయము వానిని జూచి రఘువంశపు ముగింపును దిలకించినచో నాసందియమిట్టే పోపడఁగలదు. మొత్తముమీఁదఁ గాళిదాసునికవిత్వము సూచనలకుఁ బుట్టిల్లు. అతఁడు కేవలము శాస్త్రనిబంధనల కంతగాఁ దలవంచఁడు; కాని, సౌందర్య నిబంధనలకు రవంతయు నవిధేయత చూపఁజాలఁడు. ఇందు కొకవైపు నిందుదహరింపఁబడఁబోవు సూత్రోల్లంఘనము, మరొకవైపు నాముగింపులును దృష్టాంతములు.

"తుల్యార్థైరతులోపమాభ్యాంతృతీయాన్యతరస్యాం."

2—3—72;

ఇది పాణినీయ సూత్రము. ఈ సూత్రము తులోపమా శబ్దములు షష్ఠీవిభక్తితోనే ప్రయుక్తములు కావలయునని విధించుచున్నది. మహాకవి తన కుమారసంభవము నందు—

"తులాం యదారోహతి దంత వాససా."

(స. 5. శ్లో. 34.)

ఇట్లు మసలియున్నాఁడు. ఇక్కడ "తులా" శబ్దము తృతీయా

విభక్తితోఁ బ్రయోగింపఁబడినది. ఇది సూత్రోల్లంఘనము. కాళిదాసునకుఁ దరువాత వాఁడైన మహాకవి మాఘుఁడును నీ సూత్రముపట్ల—

"స్ఫుటోపమం భూతిసితేన శంభునా."

(శిశుపాలవధం. స॥ 1. శ్లో 4)

ఈ విషయముగఁ గాళిదాసునే యనుకరించెను. తరువాత దండియుఁ దన దశకుమార చరితమందలి పూర్వపీఠిక యందుఁ గల "మహదాయుధ మహదాశా" ది ప్రయోగములతో—

"ఆన్ మహతః సమానాధికరణ జాతీయయోః"

6—3—46

ఈసూత్రము నుల్లంఘించి కాళిదాసునిబాట గ్రహించెను.

వ్యాకరణోల్లంఘనము చేసిన కాళిదాసుని విమర్శించుటకు మారుగాఁ దరువాతి వారగు మాఘాది మహాకవు లతనినే యనుసరించుటొక గొప్ప విశేషము.

**అతని కవితోపవనంబులలో దందడించి పొదలాడెడు నా నిరుపమ సౌందర్యమే యందుకు మూలము.**

"త్రియంబకం సంయమినం దదర్శ."

(కు.మా.స.3.శ్లో 44.)

ఇక్కడఁ ద్ర్యంబకమని యుండవలయును. అట్లున్నచో గణభంగము వాటిల్లును. ఇటఁ ద్రియంబకమనియున్న వ్యాకరణ దోషము కలుగుచున్నది. కాని త్రియంబకమను పదమున న్నాజూకుఁదన మెంతయేని గలదు. ఈ సందర్భమున సుప్రసిద్ధ వ్యాఖ్యాత మల్లినాథసూరి—"త్ర్యంబక మిత్యుక్తే

పాదపూరణ న్యక్త్వానా త్రియంబకమితి పాదపూరణార్థో- యమియత్రాదేశే వ్యాంఽసహా మహాకవి ప్రయోగాదభియుక్తైరం గీకృతః. కేచిత్త్వాసాహసికాస్త్రిలోచనమితి పేఠుః" ఇట్లు తన వ్యాఖ్యయందుఁ బొందుపరచి యున్నాఁడు.

కొందఱు త్రియంబక శబ్దముకు దీసివైచి యాస్థాన మునఁద్రిలోచన శబ్దమును నిమిడించు చున్నారు. అది కేవలము సాహసికత. అది ఛాందసము కాని లౌకిక భాషీ యము కాదు.

మరి, మహాకవి ప్రియోగము. అందువల్ల నభియుక్త వర్గ మేకగ్రీవముగా నంగీకరించినది. హస్తవంతులగు మహా కవుల ప్రయోగములను యథామూలంబుగఁ బఠింపవలయునే కాని మార్చఁగూడదని మల్లినాథుని తలపోత. అది యాదర ణీయము. సిద్ధహస్తులగు కాళిదాసువంటి మహాకవులు కొన్ని చోట్ల వ్యాకరణ నిబంధనల నుల్లంఘించిరనిన నది వారికి వ్యాకరణ పరిజ్ఞానము లేమిఁగాదు. నిజము చెప్పవలసివచ్చిన కేవల వైయాకరణుల పరిజ్ఞానము కంటె సుకవుల పరిజ్ఞానమే గొప్పది. వారికిటు వ్యాకరణజ్ఞానము నటు ప్రయోగజ్ఞానము నిత్యము ననుభవ సిద్ధముగానుండును. సుకవినిగురించి "నాట కరచన" యనుగ్రంథమున విపులముగా వ్రాసితిని. కాబట్టి యిక్కడ నింతకంటెఁ బెంచి వ్రాయనక్కరలేదు. విశేషించి యరయఁ గోరు వారికది దర్శనీయము.

సుకవులు సౌందర్యోపాసకులు. పలుకుల సొగసుండదన మ్మనకు వారెంతమాత్రము విధేయతం జూపం జాలరు. కాబట్టి తాదృశుల ప్రయోగములను సిద్ధ మనుకరించిన నొకవైపు భాషకు మరొకవైపు దేశమునకును దీరని నష్టమువాటిల్లం గలదు.

సర్వానుభూతిం గల మల్లినాథసూరి యట్లు గర్జించుట కేవల మందువల్లనే. ఈ సుముహూర్తమున—

ఏత్య దూతికృతమార్గదర్శనః
(రఘు॥స॥19.శ్లో॥23)

ఈ శ్లోకపాదము విడువందగ్గదికాదు. ఇక్కడి దూతిశబ్దము దూతీ యని జీబన్తముగా నుండవలయును. కాని యట్లున్న న్ఛ కనిపింపదు. కాబట్టి యిక్కడ వ్యాకరణదోషము తలయెత్తుచు న్నది. ఈ ప్రయోగమును మహామహుండు మల్లినాథుండు—

అత్ర జీబంతస్యాపి దూతీ శబ్దస్య ఛందో భంగ
భయాద్ధ్రస్వత్వంకృతం;"అపి మాషంమషంకు
ర్యాచ్ఛందో భంగం త్యజేద్గిరాం" ఇత్యుపదేశాత్.

ఇట్లు తనవ్యాఖ్యలో సమర్థించియున్నాండు.

దూతి శబ్దము వ్యాకరణమునుబట్టి గమనించిన సాధు వు గాంజాలదు. కాని యిక్కడ వ్యాకరణమునకుం దలవంచి దూతీ యని ప్రయోగించినయెడల ఛందోభంగము కలుగును.

దాన శ్లోకగమనము కుంటుపడిపోవును. అప్పుడు కవితా సౌందర్యము నిష్కృషితము కాకతప్పదు. సౌందర్య విహీన

మగు కవిత ప్రయోజనకారి కాఁజాలదు. అందువల్ల దూతి శబ్దము వ్యాకరణ విరుద్ధమైనను ఛందస్సమ్మత మగుటవలన సౌందర్యకామి యగు మహాకవికిఁ గూడ శిరోధార్యమే యైనది.

ఇయ్యెడ "అపి మాషంమషం కుర్యాచ్ఛందో భంగం త్యజేద్గిరాం" ఈయుపదేశము చక్కని ప్రమాణము. మాషశబ్దము మషశబ్దముగామార్చినను మార్చవచ్చును. అది వ్యాకరణ విరుద్ధమైనను ముప్పులేదు. కాని శబ్దములకు ఛందో భంగము నాపాదింపఁగూడదు. ఇది సారాంశము. దీని వల్లఁ బండిత మండలియు శాబ్దిక సౌందర్యము నపేక్షించుచునే యున్నదని ప్రవచింపవచ్చును. కాబట్టి కవికుల శిరోమణికాళి దాసుఁడార్యగృహ్యుఁడే యను ప్రోక్తి పరంపరకు నుపరో ధము లుండఁజాలవు.

ఎవరికైనను నేదోయొకచోట నేదేనొక దోసఁగు సంభవించిన నది "ప్రమాదోధీమతామపి" నాఁజను నార్యోక్తి కర్గమై పర్యస్తము కావచ్చును.

ఇఁకఁ గాళిదాసువంటి బ్రహ్మజ్ఞులు తామొకచోట నొనర్చిన దోసఁగు మరొకటఁ గూడఁ గావించిన నది బుద్ధి పూర్వకముగా జరిగిన శాస్త్రోల్లంఘన మనియే చెప్పవలసి యుండును. కాని, తగినంత కారణము లేనిదే మహామహు లెన్నఁడు నట్టి యుల్లంఘనములకు నియ్యకొనరు. కాళిదాసు కుమార సంభవము నందలిది యగు—

"తులాం యదారోహతి దంతవాససా."

ఈ శ్లోక పాదమున నేవ్యాకరణ సూత్రోల్లంఘనము చేసెనో, యదే సూత్రోల్లంఘనమును రఘువంశమందలిది యగు—

"నభసా నిభృతేందునా తులా
ముదితార్కేణ సమారురోహ తత్."
(స. 8. శ్లో. 15.)

ఈ శ్లోకమునఁగూడ సంతరించెను. కాబట్టి యిది బుద్ధిపూర్వక జనితమే కాని, ప్రమాదికముగా లెక్కకురాదు.

వ్యాఖ్యాత మల్లినాథుఁడు—

"అత్రతులాశబ్దస్య సాదృశ్యవాచిత్వాత్తద్యోగేఽపి
తుల్యార్థైరతులోపమాభ్యామితి న తృతీయాప్రతి
షేధః; తత్రసూత్రేసదృశవాచిన ఏవగ్రహణాదితి".

ఇట్లు కుమారసంభవమునను;—

"నచనభసాతులామిత్యత్ర "తుల్యార్థైః"— ఇత్యాది
నాప్రతిషేధస్తృతీయాయాః. తస్య సదృశవాచి
తులాశబ్ద విషయత్వాత్. "కృష్ణస్య తులా నాస్తి;
ఇతిప్రయోగాత్. అస్యచసాదృశ్య వాచిత్వాత్."

ఇట్లు రఘువంశమునను మహాకవిని మిక్కుటముగ సమర్థించుచున్నాఁడు. ఈ ప్రయుక్తుల జంట వ్యాకరణ దూష్యము కాదని యతని వాదము. తత్త్వబోధినీ వ్యాఖ్యాకారుఁడు—

కథంతర్హి;—"తులాం యదారోహతి దంత
వాససా"ఇతికాళిదాసః; స్ఫుటోపమం భూతిసి

తేనశంభునా" ఇతి మాఘశ్చ? ఉచ్యతే, "సహాయుక్తేఽ ప్రధానే" ఇతి తృతీయా. నచాత్ర సహశబ్ద యోగో నేతి శంక్యం, వినాపి తద్యోగం తృతీయే త్యభ్యుపగమాత్."

ఈ విధముగా వ్రాయుచున్నాఁడు. అతఁడును మల్లినాథునివలె మహాకవిని సమర్థింపఁ జూచుచున్నాఁడు.

ఇఁక సిద్ధాంతకౌముదీకర్తయగు భట్టోజీ దీక్షితునిబాట

"తుల్యార్థైరోగే తృతీయావాస్యాత్పక్షే
షష్ఠీ. తుల్యః సదృశః సమోవాకృష్ణస్య
కృష్ణేనవా. అతులోపమాభ్యాం కిం?
తులా ఉపమా వా కృష్ణస్య నాస్తి".

ఇది. తులోపమశబ్దములు షష్ఠితోనే కాని తృతీయతోఁ బ్రయుక్తములు కాఁగూడదనునది దీని సారాంశము. బాలమనోరమా కాశికలు యథామూలముగనే గమించినవి. శబ్దేందుశేఖరము తదీయ వ్యాఖ్య యగు చంద్రికళయుఁగూఁడ నిర్యోడ నేమియు ముచ్చటింపవు. తరువాత ప్రౌఢమనోరమ. అది తత్త్వబోధిని ననుగమించుటయేకాని, స్వతంత్రించి యేమియు ననఁ జాలకపోయినది. ఇఁక మహాభాష్యము. అందునీసూత్రపుఁ బ్రసక్తియే లేదు. మోరేశ్వర రామచంద్రకాలే తన "హైయ్యర్ శాన్‌స్క్రిట్ గ్రామర్" నాఁబడు గ్రంథమునందు—

"The words తుల and ఉపమ, however, are found used by good authors with the instrumental against Panini's rule." (Page 502)

ఇట్లు వ్రాసియున్నాడు.

కాళిదాసాది మహాకవులచేఁ దులోపమ శబ్దములు పాణిని మతమునకు విరుద్ధముగాఁ బ్రయోగింపఁబడినవని యతని స్పష్టీకృతి.

ఇప్పుడు మొత్తముమీదఁ బర్యాలోచించి చూచినచో నవి కేవలము యుక్తివాదములనక తప్పదు. తత్త్వబోధినీ వ్యాఖ్యాకారుఁడు మల్లినాథుఁడును దమతమ యుక్తివాదములతో మహాకవిని సమర్థింపఁ జూచిరే కాని యవి యెంత మాత్రము పాణినీయ సమ్మతములు కాఁజాలవు. వామన శివరామ ఆప్టే మల్లినాథుని సమర్థన నుద్దేశించి వ్రాసిన—

Mallinatha tries to reconcile these instances with Panini's sutra; but the defence is evidently lame.

*The Students' Guide to Sanskrit Composition*, p.77

ఈ పంక్తులును బ్రస్తుతవిషయమును బలపరచుచున్నవి. మల్లినాథుని సమర్థన నిస్సారమైనదని వీని తాత్పర్యము. ఆయుక్తివాదములకు వారి కతనియెడలఁ గల పరమభక్తియే మూలమై యుండవచ్చును. కాళిదాసాక వారికేకా దెల్లరకును

బూఁజ్యేఁడే. కాబట్టి వారా ప్రయోగములను ద్రియుంబకళబ్ద ప్రయోగముదగ్గర వ్యవహరించినట్లు మహాకవి ప్రయోగములుగాఁ బరిగణించినఁ జాల బాగుండెడిది. కృతహస్తులగు మహాకవులు నిరంకుశులు. అట్టి మహామహుల వాక్కునుగురించి మమ్మటుఁడు—

నియతి కృత నియమ రహితాం
హ్లాదైకమయీ మనన్య పరతంత్రాం
నవరస రుచిరాం నిర్మితి
మాదధతీ భారతీ కవే ర్జయతి.''

ఇట్లు తన కావ్య ప్రకాశమునందు విరచించియున్నాఁడు. కవిమూర్ధన్యుని భారతి నవరసరుచిరము, హ్లాదైకమయము, సర్వతంత్రస్వతంత్రము నగు లోకోత్తరమైన కృతిని సంఘటించుచు నెనలేని ప్రకర్షత నసివారుచుండును.

ప్రకృతి నియంత్రణల కది యెంతమాత్రము తలయొగ్గదు. కృతహస్తతఁ గల కవికులశిరోమణియొక్క యాధిక్యమింత మహనీయతఁ గలది. వ్యాకరణ నిబంధనలు పాటింపఁదగ్గవే; కాని, మహాకవుల ప్రయోగము లంతకంటెను బాటింపఁదగ్గవి. అవి నియతి నియమ రహితములు. అట్లని యందరును వ్యాకరణ నిబంధనలను బర్యాదాసింపఁ గూడదు. అట్టి యధికారమొక మహాకవులకే కలదు. వారు లోకోత్తర వర్ణనా నిపుణతఁ

గల మహామహితాత్ములు. వారైనను వానిని దుర్విని యోగము చేయఁజూడరు. అటువంటి ప్రఖ్యాత్యులకుఁ బాంక్తేయుఁడు కవి కాలీనుఁడు కాళిదాసబుధేంద్రుఁడు. అటువంటప్పుడు తదీయ కృతుల ముగియికలకు నద్వితీయములగు నా మనోహరతా నవ్యతలు వద్దన్నను వచ్చిచేరక మానవు.

ఇప్పు డింకొక విషయము గమనింపఁ దగి యున్నది. సంస్కృతము నవవ్యాకరణములుఁ గల భాష. మహాకవి కాళిదాసు కాలము నాఁటికైదు వ్యాకరణములు మాత్రమే ప్రచార మందుండియుండెడి వనియు నతఁడు పంచవ్యాకరణపరిజ్ఞాని యనియుఁ బ్రతీతి. ఇఁకఁ బ్రస్తుత మొక వ్యాకరణమే ప్రచార మందున్నది. అది పాణినీయము. మరి ప్రస్తుత ప్రయోగములు పాణినీయమతమునుబట్టి చర్చింపఁబడినవి. ఒకవేళ నివి తక్కటి వ్యాకరణములం దేయొకదానికైనను సమ్మతములై యున్న వేమో. ఈ—

What is clear from Panini's own work is that he summarizes the efforts of many previous writers, from whom we may be sure he borrowed his form as well as many facts. (*History of Sanskrit Literature*, by Keith, p. 423)

పంక్తులను బట్టి చూచినను పాణినికిఁ బూర్వము యాస్క కాత్యాయన శాకటాయన శౌనకాదులగు కొందరు

వ్యాకర్తలు గలరని తెలియుచున్నది. పాణిని తన యష్టాధ్యాయి యందుఁ బ్రాచీనుల కృతులను గొన్నింటిని గ్రోడీకరించి పొందుపరచెనని పైపంక్తులు పలుకుచున్నవి. అసలతని గ్రంథ నిర్మితికి యాస్కాదుల కృతులే మూలాధారమని వాని విశదీకృతి. కాబట్టి కాళిదాసు పాణినికిఁ దరువాతివాఁడైనను, అతని కాలమునఁ బంచవ్యాకరణము లున్నవనునది విశ్వసింపఁ దగ్గ విషయమే. తరువాతఁ గాళిదాసువంటి మహాకవులకు నిరంకుశతయుఁ గలదు.

కుమారసంభవపుఁ దుదిసర్గము శృంగారరసప్రకర్షము. రఘువంశపుఁ దుదిసర్గమును శృంగారరసోత్కర్షము. అక్కడ నిరువదియైదు సంవత్సరము లొకరాత్రిగాఁ గడపిన పార్వతీపరమేశ్వరుల యాపయామిక విహారములు.

ఇక్కడ రాత్రింబవళ్ళు దేపనిగా గణికలతోఁ గాలము పుచ్చెడు నగ్నివర్ణుని స్వచ్ఛందవిహారములు. అవి సచ్చరిత్రతోఁ బరిస్ఫోటించెడు దివ్యదంపతులకు సంబంధించినవి. ఇవి దుశ్చరిత్రముఁ గల వ్యభిచారులకు సంబంధించినవి. లోకత్రాణసమర్థతఃగల వీరోత్తరుని బడయుట వాని ప్రధానాశయము. అపూర్వమయిన నష్టిపూర్తిని బనుపరుచుట వీని పరార్థ్యభావము. వారు స్వతంత్రతఁ గల దివ్యులు. వీరు పరతంత్రతఁ గల మానవులు. ఆలీలలు శాస్త్రసమ్మతములు. ఈ రతులు శాస్త్రదూష్యములు. ఇవి యా రెండుసర్గములను నవలోడించి చూడఁగా వెలు

వడెడు సాదృశ్య విభిన్నతలు. ఆరెంటికి నేమైన సామ్యమున్న నదియొక శృంగారరసోదాత్తతయందే కలదు.

ప్రేమ రెండు విధములు. ఒకటి శాశ్వతము, మరొకటి నశ్వరము. మొదటిది మానసికము. రెండవది శారీరకము. అది వైవాహిక నిబంధనలకుఁ బవిత్రభావముతో వినయవిధేయతలు చూపఁగలుగు నంతటి సౌమ్యవైఖరిఁ గల దివ్యపదము.

ఇది యట్టి వినయవిధేయత లెరుఁగని యపవిత్రవస్తువు. ఇది ప్రేమశబ్దధారణ కనర్హము. కాబట్టి దీనిని ప్రేమయనుటకంటెఁ గామ మనుట మంచిది. కామము వలని నష్టములను బేర్కొనుచుఁ బవిత్రము, శాశ్వతము నగు మానసిక ప్రేమకు సాంఘికజీవికలోఁ గల సమున్నతస్థానమును బ్రచురముగాఁ బ్రకటించుటయే కాళిదాసుని పరమోద్దేశము. అతఁడు తన కృతులన్నిట నొకేయొక శృంగారరసమునే గ్రహించుట కేవల మందునిమిత్తమే. ఆ యుద్దేశ మభిజ్ఞానశాకుంతలమునందుఁ బరిపూర్ణమయిన యర్థసిద్ధిని బడయఁగలిగినది. కుమారసంభవపు ముగియిక శివానీశివులదాంపత్యపు సౌఖ్యపరిమళములలో మనోరమముగా నిర్వహింపఁబడినది.

రఘువంశము; "మహారాజ్ఞి కడుపుపంట రాఘవుల నిశాంతమునకు మరల నఖండజ్యోతిని సమకూర్చునదిగా నుండవలయు" నను ప్రజాభిలాషలసౌరభములలోఁ బర్యవసించినది.

అక్కడి ముగింపువాతావరణము కుమారసంభవమును సూచించుచున్నది. ఇక్కడి ముగింపువాతావరణమును కుమారసంభవమును రవళింపఁ జేయుచున్నది. ఇప్పుడీకఁ గడసారి మాటగాఁ జెప్పవలయునేని, రఘువంశమహాకావ్యము నిశ్చయముగాఁ బందొమ్మిదవ సర్గముతోనే ముగిసియుండవలయునని చెప్పక తప్పదు. ఇఁకఁ బొట్టిపొడుగుల వివాదము. ఒక సర్గము పొట్టిగా నుండవచ్చును; మరొక సర్గము పొడుగుగా నుండవచ్చును. అంతమాత్రమున నవి ప్రక్షిప్తములని సిద్ధాంతీకరించుట తగని పని. ఏకోనవింశసర్గమునందు శృంగారరస స్రోతస్సులు దండడించి ప్రవహించుచున్నవి. ఆప్రవాహాములనే యాయపరాంత పండితుఁడు విరసములుగాఁ దలఁచియుండవచ్చును. కామకళ చతుష్షష్టి కళలలో నొకఁటి. కాబట్టి సమయానుకూలముగా బ్రజకుఁదదీయప్రతిపత్తియుఁ గావలసినదే.

లోకమునకు సదుపదేశముల నొసఁగు కావ్యాదులదాని నిమిత్తమొక ప్రత్యేకస్థానము కేటాయింపఁబడియుండుట కదియే ప్రముఖకారణము. ఆలంకారికులగు వామనాచార్యాదులు మహాకవికి నుండవలసిన పరిజ్ఞానములలోఁ గామశాస్త్రపరిజ్ఞాన మొకఁడని గంభీరముగా నుపన్యసించుచున్నారు.

మహాకవి, తన కావ్యమ్ములఁ కది యించుమించుగాఁ బ్రధానరస మేమైనను, వానియందు దానిని సమయానుకూలముగనే ప్రదర్శించి కృతార్థుఁడైనాఁడు ఆప్రదర్శనమున సమయ

ప్రతికూలత యించుకయు గోచరింపదు. ఇఁక, విరసత యనుమాట కక్కడఁ దావే లేదు. పదునెనిమిదవ సర్గమునందలి కవితావిహారములు సాధారణములేయైనను, నందుఁ గాపుర మేర్పరచుకొని సువాసించెడు నా శైలీప్రసాదగుణధారాసుధ్యా దికము కేవలము కాళిదాసీయము. కాబట్టి రఘువంశమహా కావ్యము నాలుగింట నాలుగుపాళ్ళుఁ గాళిదాసవిరచితమే కాని మరొకఁడనఁ జెల్లదు. ఇప్పుడొకమారు కావ్యమందు వివిధగతుల జువ్వారించియున్న కథాంశములను గ్రమముగాఁ బర్యవేక్షించుట సమయోచితము.

అతఁడు సుప్రసిద్ధమగు మనువంశమునఁ బుట్టిన దిలీప మహీపతి. ఒకవైపు నాసముద్ర క్షితీశుఁడు, మరొకవైపు న్యాయపాలనారతుఁడు దిలీపుఁడు. కరవుకాటకముల కతని రాజ్యమున నించుకయుఁ దావు లేదు.

ప్రజల యోగక్షేమములను బర్యవేక్షించుట యతని దినకృత్యములలో నొక ప్రముఖ కరణీయము. కాబట్టి వారి కతఁడే నిజమైన తండ్రి. వారి తండ్రులు కేవలము జన్మమాత్ర కర్తలు. అతఁడు వస్త్వైక పరిపాలకుఁడు. కనుకఁ బ్రజలనుండి పన్నులు గ్రహించుట తదీయమగు విధ్యుక్తధర్మము. అయిన నాగ్రహణము ప్రజలనిమిత్తమే కాని తనకొరకుఁ గాదు. సూర్యుఁడు భూమినుండి జలము గ్రహించును. కాని దానికి వేయిరెట్లధికమగు ఫలము నతఁడు తిరిగి భూమికి నిచ్చును.

దిలీపుని కరణీయము నట్టిదియే. అట్టి విశాలహృదయుఁడు పరిపాలకుఁడుగా లభించుట ప్రజల పూర్వపుణ్యసంచితఫలవిశేషము. ఏకనాయక ప్రభుత్వమునకైనను, బహునాయక ప్రభుత్వమునకైనను, నతని ప్రభుత్వ మాదర్శప్రాయము.

సుదక్షిణ యతని మనోహరి. ఆరాజదంపతులకు సంతతి లేదు. వసిష్ఠమహర్షితో సలహా చేయవలయునని వారొక శుభముహూర్తమునఁ బయనమై యతని యాశ్రమమున కరిగిరి.

అతఁడు వారికిఁ గులగురువు. అది దోషాసమయము. సాష్టాంగ దండప్రణామములు, నాశీర్వాదములు, కుశల ప్రశ్నాదికములును ముగిసినవి. అసలు విషయము పుత్రోత్పత్తికి నుపాయగ్రహణము. రాజేంద్రుఁడు ఋషీంద్రునకు వెంటనే యావిషయము నెరుకపరచెను. అప్పు డతఁడు దివ్యదృష్టి సమీక్షించి;—"రాజా! వెనుక నీవు స్వర్గమునుండి తిరిగివచ్చుచున్నప్పుడు నీమార్గమందలి కల్పవృక్షముక్రింద నున్న కామధేనువునకు నమస్కరింపఁగ మరచితివి. అప్పు డామె కినిసి యనపత్యుఁడ వగుదువని నిన్ను శపించినది. అయినను, దానికిఁ బరిహారము కలదు. నందిని యాపె పుత్రిక. ఆమె ప్రస్తుత మిక్కడనే యున్నది. ఆమె నర్చించిన నాశాపము పర్యవసితము కాఁగలదు. అప్పుడు మీరు పుత్రవంతులరగుదురు" రని ప్రత్యుత్తరించెను. అదే సమయమున నందినియు వనము నుండి వచ్చి యక్కడ ప్రత్యక్షమయ్యెను. అది కాఁగల కార్యసిద్ధికి శుభసూచకము. తొలిసర్గము.

తెల్లవారినది. దినేశ్వరుఁడు తన సదోగృహామందలి భద్రపీఠిక నలంకరింపఁబోవు సుసమయ మది. నిశాంత కృత్యములు అర్చనలు ముగిసినవి. నందినీపురస్సరముగా వనాభిముఖుఁడై బయలుదేరసాగెను భారతచక్రవర్తి.

చక్రవర్తిని యనుచరులును మార్గమును గొంతవరకు ననుగమించిరి. వారిని వెనుకకుఁ బంపి రారాజు నందినీసేవారతుఁడై పురోగమించెను. ఆమె నిలిచిన దానును నిలుచుచు, నామె కదలిన దానును గదలుచు, నాపె నడుము వాల్చిన దానును నడుము వాల్చుచు, నామె లేచిన దానును లేచుచు, నాయంచిత వనాంతమున దిలీపుడు నందిని నన్ని విధముల గొలుచుచుండెను. అట్లుండఁ గొంత సేపటికి దివాత్యయము దిశదిశల నూరేగ నభిలషించినది. నందిని యాశ్రమమునకు గమింపసాగెను. భూస్వామియు నామె ననుసరించెను. అంతవరకు వారి రాకకుఁ గనుదోయి వాచున యెదురుచూచుచున్న సుదక్షిణాదేవి వారు కనఁబడగనే చిరునగవులు వెదచల్లుచు బ్రత్యుద్గమించి వారి నాశ్రమసీమకుఁ దోడ్కొనివచ్చెను. అభివందనాదికములు ముగిసినవి. పిమ్మట రాజదంపతులు ధేనువు నర్చించిరి.

పిమ్మట మెలమెల్లగా విభావరిప్రభుత్వము పనుగొన్నది. సతి పతితోపాటు రాత్రియంతయు యథావిధి నందిని నభ్యర్చించెను. క్రమముగా విభావరికి విశ్రాంతిసమయము దరిసినది.

మరల, నదేకార్యకలాప మదేవాతావరణము. ఆ విధముగా నిరువదియొక్క రోజులు కడచినవి. ఇరువదిరెండవ రోజునఁ గూడ మామూలుగా దిలీపమహీపతి నందినీపురస్కృతుఁడై వనభూముల కేగెను. అది హిమాలయప్రాంతము. అందలి స్పృహణీయదృశ్యముల సశ్రీకత యతని నప్పుడు పూర్తిగ నాకట్టివైచెను. అతనికిఁ దెలియదు, కాని, యది పరీక్షాసమయము. పరధ్యానశాయికలోఁ గలలు గనుచున్న యతని కప్పుడొక యార్తధ్వని వినవచ్చెను. అంత నులికిపడి లేచి యటునిటు చూడఁగా నప్పుడతనికి మృగేంద్రునిచేతఁ జిక్కి వెతలఁబొగులుచున్న నందిని కనఁబడెను. ఆ ప్రదేశము గంగాప్రపాతమునకుఁ జేరుగడ నున్న యొక కొండగుహ. నందినీప్రాణసంరక్షణ యతని కప్పుడు ప్రప్రథమకర్తవ్యము. శరముకొరకు నిషంగమునఁ జేయిపెట్టెను. కాని యాచేయి యక్కడే యంటుకొనిపోయెను.

అప్పు డతనిని నొకవైపునుండి యాశ్చర్యము మరొకవైపునుండి కోపనతయు నొకేయొకకాలమున వచ్చి ముట్టడించినవి. అంతవరకుఁ జక్రవర్తి ప్రతిష్టంభ మను శబ్దమునే యెరుఁగఁడు.

అప్పటి కదియే యతనికిఁ దన జీవితములోఁ దొలిసారిగా నేర్పడిన కార్యవైఫల్యము. అందువల్ల నాఁడతని దిగ్భ్రమకుఁ బరిమితి కనఁబడలేదు. అదంతయుఁ బరికించి యప్పుడామృగేంద్రుఁడు రాజేంద్రునితో;—"మధ్యమలోకపాల! నేను జగత్ప్రి

తరులగు నుమామహేశ్వరుల సేవకుఁడను. నా పేరు కుంభోద రుఁడు. అదిగో ఆ దేవదారువును జూచితివా? వారి కది పుత్ర తుల్యము. వారు నన్నిద్యోడ దాని కాపుదలకొరకుఁ బనిగొని యున్నారు. ఇక్కడ నేను నాకుఁ జేపడెడు సత్వముల ననుభ వించుట వారు నాకిచ్చెడు నెలజీతము. కాబట్టి యిఁక నీవు నీ వచ్చిన బాట నేగుట మంచిది. నీగురుభక్తి చాల గొప్పది. కాని, ప్రస్తుతము నీకు నియుక్తమైన రక్షణ నీశక్తికి మించి యున్నది. కనుక నట్లొనర్చినను నీవు దోషివి కాఁజాలవు. నీయశస్వితయు మలీమసము కాఁబో" దని ప్రసంగించెను.

ఆకారము సింహసంబంధి; వాక్కులు మంచి సంస్కా రము గలిగి పరిస్ఫుటముగా మాట్లాడెడు మానవునకు సం బంధించినవి. మహీపతి కప్పుడు మరింత యచ్చెరువు కలిగెను.

కుంభోదరుఁ డుమామహేశ్వరుల కింకరుఁడు. ఆ మాట వినియు వినఁగనే దిలీపున కతనిపై నొకవిధమగు భక్తి జనించినది. అది యాస్తికుల నైసర్గికగుణము. మరియు, దినుటకు సిద్ధముగా నున్న యతని యన్నమును దొలఁగఁద్రోయుట పాపకృత్యము. కాని, విపద్గ్రస్తులఁ జూచి నప్పుడు కాపాడక యుపేక్షించుటయుఁ బాపకృత్యమే. అది మహీపాలున కెనలేని సందిగ్ధావస్థ. అయినను, నైష్ఠికులు స్వార్థపరత్వ మనునది యెరుఁగరు. కనుక వెంటనే మహీపతి మృగపతి కభిముఖుఁడై :— "కుంభోదరా! తావకీనమ్ములగు వాచ్యములు సమంజసములు. కాని, వసిష్ఠస్వామికిఁ బ్రేమ

పాత్రము, నాకవశ్య సంరక్ష్యమునగు నందినీజీవితమును నీవు నీకేవల భోజనముగా వినియోగించుట యనుచితము. నీకుఁ బ్రస్తుతము భోజనము కావలయును. ఇదిగో, నాయీశరీరము నందుకొరకు వినియోగించుకొనుము. ఇఁక నందినిని విడిచి పెట్టు" మని పలికెను.

మృగేంద్రుఁ డాపలుకులు విని నవ్వి యిట్లనెను;— "రాజా! ఒక చిన్నవిషయముకొరకు నపూర్వ భాగధేయములను మూటగట్టియుంచిన నీచక్కని జీవికను బాడుచేసికొనుట కేవలము పిచ్చితనము.

అదియునుంగాక, నీవు లోకమున కెల్ల నాధార భూతుఁడవగు రారాజువు. కాబట్టి నీజీవితము కోట్లకొలఁదిగాఁ గల ప్రజలకు నెంతేని బరార్థ్యమగు వస్తువు. ఇఁక, నీ నిరర్థకపు టూహలకుఁ దావీయక సుఖముండుము". అయ్యవసరంబునఁ గుంభోదరునిచేవలఁతి నున్న నందిని తన కరుణామయ దృక్ప్రరం పరల నన్నింటి నొక్కమారుగా రాజేంద్రుని వైపు గ్రుమ్మరించెను. అప్పుడతని కవి మిక్కిలి హృదయచ్ఛిదురములు. ఇఁక నెటుజూచినను నతని రాజ హృదయమునకు శాంతి కనఁబడ లేదు. అనుపడంబ;—"మృగేంద్ర! జీవలోకము నురంజింపఁ జేయువాఁడే రాజు. అదియే క్షాత్రధర్మము. ఇఁక నందినిని విడిచి నాయీ కాయమును భుజింపు"మని పలుకుచు నెదుటకుఁ బోయి యవాఙ్ముఖుఁడై చతికిలఁ బడెను.

అప్పుడతని బొందిపైఁ బడినది సింహము కాదు; పుష్ప వర్షము. నందినియే కాని, సింహమిఁకక్కడ లేనేలేదు. ఇఁక రాజేంద్రుని యద్భుత వైఖరికిఁ బొలిమేరలు లేవు.

అనంతయు నరపతిని బరీక్షించుటకయి నందినీ ధేనువు సృజించిన మాయ. సాయంకాలము కావచ్చినది. రాజు నందినిని ముందుఁ బెట్టికొని యాశ్రమమునకు వెళ్ళెను. ఆనాఁడు వారికిఁ బనుపడిన యానందప్రపంచమలేఖ్యము. నందిని వారి యెడలఁ బూర్తిగఁ బ్రసన్నురాలయినది. తదుపరి రారాజాపె క్షీరములను గోరెను. అది గురుదేవుని యాజ్ఞ. వచ్చిన పని యైనది. ఇఁక, రాజదంపతులు నిశాంతమున కరుగుట మంచిది. కాబట్టి ఋషీంద్రుఁ డొకసుముహూర్తమునఁ బ్రాస్థానికమ్మగు స్వస్త్యయనంబుఁ బఠించి సానుచరంబుగ సుదక్షిణా దిలీపులను వీడుకొలిపెను. హృదయరంజకములగు నుత్పతాకలతోను హర్షోత్కర్షమున మునిగి తేలెడు జయజయరవార్భటులతోను ఆనాఁడా రాజదంపతుల కయోధ్య సుస్వాగత మిచ్చినది. పదపడి మహారాజ్ఞి గర్భవతియయ్యెను. మలిసర్గము.

కాలక్రమమున సుదక్షిణ కొడుకును గన్నది. ఆనాఁడు రాజగృహ మాహ్లాదోత్కర్షపుఁ జిరునగవులలో మరింత ప్రకాశించెను. ముఖ్యముగా నృపాలుని యానందవల్లి యప్పుడు స్వచ్ఛందక్రీడలలో ధగధగ మెరసిపోయెను.

అతని పేరు రఘువు. అప్పటినుండియు నావంశమునకు రఘువంశమని పేరు. మహీపతి యతనిని సుశిక్షణతోఁ గూడిన

విద్యావంతుని జేయించి సమయమురాఁగా వివాహితుఁజేసి యువరాజుగా నొనర్చెను. అప్పటి కప్పుడే తొంబదితొమ్మిది యశ్వమేధయాగము లొనర్చి యశస్సు గడించిన దిలీపున కప్పుడు నూరవదానిని గూడఁ జేయవలయునని బుద్ధిపుట్టినది. బుద్ధిపుట్టుటయే తడవుగా యాగమును బ్రారబ్ధమైనది. దిలీపుఁడు యజమానుఁడు, రఘుకుమారుఁ డశ్వరక్షకుఁడు. అప్పుడింద్రుఁడు భయపడి యజ్ఞపశువు నపహరించి పోవుచుండెను. వెంటనే కుమారమహీపతి యతని నిలువరించెను. పురందరుఁడును నతని శౌర్యాదికము మెచ్చి దిలీపునకు యజ్ఞఫలమునురరీకరించి వెళ్ళిపోయెను. అట్లు జయశ్రీతో రఘుకుమారుఁడు రాజధాని కేగెను.

ప్రజలు హర్షాతిశయముతోఁ బ్రత్యుద్గమించి యువరాజునకు స్వాగత మిచ్చిరి. మహీపతి కుమారుని యానిరతిశయ బలపరాక్రమాదులను మెచ్చి, వెంటనే యతనికి సింహాసన మిచ్చి తాఁ దపోవనమునకు నేగెను. మూఁడవసర్గము.

ఇంతవరకు యువరాజుగా నున్న దిలీపనందనుఁ డిప్పుడు సార్వభౌముఁడు. మందమందముగా శరత్కాలము గ్రుమ్మములోఁ బాదముపెట్టినది. అది సార్వభౌముఁడు జైత్రయాత్రకు బయలుదేరు సుసమయము. అప్పుడు రఘుమహీపతి చక్కని శిక్షణఁగల సైన్యములను వెంటఁబెట్టుకొని తూర్పుదిక్కై బయలు దేరెను. అక్కడి వంగాది దేశాధీశ్వరులను జయించి దక్షిణ

ముగా నుపక్రమించెను. పాండ్యభూపతి యతని ధాటికి నిలువఁ జాలక చేతులు జోడింపఁగా, రారాజు పడమటిదిక్కుగా గ్రమ్మరి కేరళభూముల నాక్రమించెను. కేరళనాయకుఁడును సుదక్షిణాసూనుని బలమునకు జడిసి వెంటనే యతనికి వినమ్రత నగపరచెను. అంత రఘునరేంద్రుఁడు పడమటిపుడమి రేడులను గూడ నడఁచి పారసీక దేశము డాసెను.

నౌబలముకలిమి వంగాధీశుఁ డెంతదిట్టయో, యాశ్విక బలసంపద: భారసీకాధినేత యంత తరస్వి. అయినను, భారత సార్వభౌముని మ్రోల నతనికి దాసోఽహ మనక తప్పలేదు.

ఇఁక, మిగిలియున్నదొక యుత్తరపుదెస. పారసీకుఁడు పాదాక్రాంతుఁడు కాఁగనే రఘురాజమౌళి యాదిశనుగూడఁ బరామర్శించెను. తత్రత్యులగు హూణ కాంభోజులును నతని ప్రాపు నభిలషించిరి. హిమాచలప్రదేశమందలి యుత్సవసంకేతులు పార్వతేయులు మున్నగువారును రఘునరేంద్రునకుఁ గానుకల నర్పించిరి. పిమ్మట రఘుపతి కామరూపమునకుఁ బయనించెను. అతఁడును నతని మగఁటిమికి న ర్ఘ్యా ణ లర్పించెను. నలుగడల జైత్రయాత్ర ముగిసినది. జయశ్రీల వలపులలోఁ గలకలలాడుచు చతురంతమహీపతి కేంద్రనగరముఁ జొచ్చెను. అతఁడు జైత్రయాత్రలో నార్జించిన ద్రవ్యమనంతము. అయిన, సదసద్వివేకుల ధనాదానము కేవలము త్యాగము కొరకే. కాబట్టి మహీపతి వెంటనే విశ్వజిద్యాగము నారంభించి కృతకృత్యుఁడయ్యెను. నాలుగవసర్గము.

పట్టభద్రుఁడు కౌత్సుఁడు వరతంతుని శిష్యుఁడు. గురువు గారికి గురుకట్నము చెల్లింపవలయునని యతని యభినివేశము. అవసరము లేదని వరతంతుఁ డెంత చెప్పినను శిష్యుఁడు వినఁడు.

అతఁడు నేర్చినవి పదునాల్గు విద్యలు. కాబట్టి పదునాల్గు కోట్ల ధనము నతఁడు కట్నముగాఁ జెల్లింపవలయును. అది విసివి విసివి కుపితుఁడైన వరతంతుని తుదియాజ్ఞ. అంత మొత్తము నతఁడు తేలేఁడని యతనివిశ్రంభము. కాని కౌత్సుని కది యానందదాయి. గురువుగారినోట మాట నిర్గమించుటయే తడవుగా బయలుదేరి నడకసాగించినాఁడు శిష్యుఁడు. ఆ నడక సాగిసాగి చివరకు రాజగృహాము దగ్గర నిలిచిపోయినది. అది యాసముద్రక్షితీశుఁడు, ముఖ్యముగా, మహాత్యాగియు నగు రఘురాజమౌళి దేవిడి. వచ్చినవారిని నమస్యలతో గౌరవించుట భారతీయధర్మము. వెంటనే మట్టిపాత్రలో నర్ఘ్యము నిడుకొని యెదురైవచ్చినాఁడు రారాజు. అంతవరకుఁ గుసుమించి కమ్మనలు వెదచల్లుచున్న యతని యాశ లప్పుడా దృశ్యము చూడగనే ముకుళించిపోయినవి. క్రమముగాఁ బుర స్క్రియలు, కుశలప్రశ్నలు ముగిసినవి. ఇఁక నసలు విషయము.

అభ్యర్థి ప్రకటించుట కిచ్ఛగింపఁడు. దాత తెలియకయే విడిచిపెట్టుటకు సమ్మతింపఁడు. మొన్ననే విశ్వజిద్యాగము జరిగినది. ఆ పర్యాయమునఁ గోశజాతములన్నియు నిశ్శేష ముగా విశ్రాణితములై యున్నవి.

ఆరాజు పాణిపల్లవతల మలంకరించిన యామట్టి పాత్రియే యందుకుఁ బ్రబలనిదర్శనము. కౌత్సుఁ డర్థియే; కాని, యుదారశీలుఁడు. కాబట్టి స్వస్తి పలికి యతఁడటనుండి బయలుదేరఁ బోయెను. నరేంద్రుఁ డప్పుడు వాస్తవముగా నకించనుఁడే; యైనను, నర్థినిచయమునకు నాశాభంగము కలిగింపలేనంత యనర్ఘశీలుఁడు. కనుక, నతఁడతని నట్లూరక పోనీయక యొకఁటిరెండురోజు లుండుమని బ్రతిమాలెను. అతఁడును నిఁక బాగుండదని యాగిపోయెను. అదేమి ధన జాతకమో! విశ్రాణితములైన కోశములన్నియుఁ బరిపూర్ణములైనవి. అది యలకేశ్వరుఁడు చేసిన పని. అతఁడు దిక్పాలుఁడు. అయినను, రఘునరేంద్రుఁడన్న నతనికిఁ బరమభీతి. అప్పని కదియే మూలము.

ఆనాఁ డభ్యర్థిసంతోషముకంటెఁ బ్రదాతయానందము మితిమీరిపోయెను. అది తమిస్ర్రెరుఁగని మహనీయుల సహజగుణము. ఎముకలేని కుడిచేయిఁగల దాతలు తమ యీవికి నవరోధము లేర్పడునప్పుడు చింతలబారికగ్గము కాకుండ నుండలేరు.

కౌత్సుఁడు గ్రహింపఁదలఁచినది తాను గురుదేవుని కొసఁగవలసిన పదునాల్గుకోట్లధనము మాత్రమే. కాని రఘుస్వామి సంకల్పము కొలతకు మించియున్నది. అది కౌత్సుని నిమిత్తమువచ్చిన ధనపుంజము. కాబట్టి దానినంతయు నతనికే

యిచ్చివేయవలయునని నరేంద్రుని నిశ్చయము. గురుప్రదే యమునకు మించి యవసరములేదని యతఁడు; వచ్చిన ధనరాశినంతను వెంటనిడుకొని పొమ్మని యితఁడు. ఇరుగడ నసియాడెడు నాధర్మసందేహములు కేవలాద్భుతజననములు. ఇఁకఁగట్టకడ కెట్లో బాగుండదని సమ్మతించి వెలుపడినాఁడు కౌత్సమహర్షి. తరువాతఁ గొంతకాలమునకు రాజమందిరము పుత్రవంతమైనది. అది యతని యాశీఃప్రభావము. కాలము కొంత కడచినది. విపుల యెక్కడఁ జూచినను నిందుమతీ స్వయంవరవార్తలతో మారుమ్రోగుచుండెను.

అది రఘునందనుఁడు నిండుజవ్వనముతోఁ గలకలలాడుచున్న సుసమయము. కాబట్టి మహీపతి యజుని స్వయంవర సదస్సున కనిపెను. మధ్యేమార్గమున నజకుమారున కొకయేనుగుతోఁ బోరవలసివచ్చెను.

అయినను, దుదివిజయ మజకుమారునిదే. కాని, యది కేవల గజముకాదు. ఒక గంధర్వుఁడు మతంగముని శాపలక్ష్యమునకుఁ జిక్కి తద్రూపమున నటఁ దిమ్మరుచుండెను. ఆనాఁడతనికి శాపమోక్షతరుణము. అతఁడు గంధర్వాధిపతి ప్రియదర్శనుని పుత్రుఁడు ప్రియంవదుఁడు. ఉపకృతికిఁ బ్రత్యుపకృతి చేయఁదగ్గ కర్జము. కనుక, సమ్మోహనాస్త్రముకఁ డతనికి బహూకరించి ప్రియంవదుఁడు తన ధామమున కరిగెను. రఘునందనుఁడును రేకెత్తిన సంతోషముతో విదర్భ డాసెను.

అంత విదర్భాధిపతి భోజుఁ డతనిని సగౌరవముగా నొకయు పకార్యలో విడియించెను. అది దోషాసమయము. అజ కుమారుఁ డా రాత్రియంతయు సౌవర్ణస్వప్నగుచ్ఛములతోఁ గ్రీడించి తెల్లవారఁగా లేచి కాలకృత్యములను దీర్చుకొని సమ యముకాఁగా స్వయంవరసదోగృహమున కభిగమించెను. అయిదవ సర్గము.

అక్కడఁ జక్కని పంక్తుల నమరిన సోఫాలపైఁ దమ తమ నవనవ నేపథ్యముల కాంతిపుంజములను వెదచల్లుచు రాజన్యు లాసీనులైయుండిరి. పరిమళద్రవ్యముల ఘుమ ఘుమలు క్రిక్కిరిసిపోయినవి.

సరిగా నదే సమయమున సునందాసనాథ యిందుమతి ప్రవేశించినది. భోజావరజ యక్కడ ప్రవేశించుటయే జాగుగా రాజలోకపు దృక్పంక్తులన్నియు నేకమొత్తముగా నామె యందుఁ గేంద్రీకృతములై పోయినవి. కాని, యానాఁడా రాజకమునం దజకుమారుఁ డొక్కడే సుభాగధేయుఁడు. అతనిపైఁ బ్రసరించిన రాకుమారి యవలోకిత మిఁకఁ దిరిగి రాలేదు. అది గ్రహించి సునంద రాజపుత్రిక పక్షమునఁ దా నజకుమారుని మెడలో సుమాలమాల వైచినది. ఆరవసర్గము.

నగరమంతయు సమలంకృతమైనది. ఇందుమతీ రఘు నందనుల యుద్వాహము దివ్యతరముగా జరిగినది. పిమ్మట నజుఁడు పత్నీసమేతముగా బయలుదేరినాఁ డయోధ్యకు.

మార్గమధ్యమున సంకులసమరము తలయెత్తినది. ఎదుటివారు స్వయంవరసదస్సునం దాశాభంగము నొందిన రాజన్యులు. ఈవలివ్యక్తి కానున్న భారతచక్రవర్తి యజకుమారుఁడు. అయిన, విజయ మజునిదే.

తరువాత, నానవదంపతులు నవనవోల్లాసకళలతో రాజమందిరము ప్రవేశించిరి. ఇఁక విశ్రాంతి తీసికొనవలయునని చక్రవర్తి యుబలాటపడసాగెను.

ఒక సుముహూర్తమునఁ బరిపాలనాబాధ్యత యజకుమారుని భుజస్కంధముల కెగఁబ్రాకినది. నవచక్రవర్తి తండ్రివలె మంచి దక్షతఁ గలవాఁడు. అందువల్లఁ బ్రజ యతని యందును నెంతే ననురక్తితో మెలఁగసాగెను. అది యొక సమయము. అప్పు డారాజదంపతులు నందనవనమున విహరించుచుండిరి. అదే సమయమున నారదుఁడు జ్యోతిష్పథ మార్గమునఁ బయనించుచుండెను. కర్మవశమున నప్పుడతని వీణకుఁగల యొకపూలమాలిక తెగి యిందుమతిపైఁ బడెను. మఱి నిముసమున నా చక్రవర్తిని యసులు గడపెను. చక్రవర్తి మనస్సు కలుషించిపోయెను. అప్పుడతని పరిదేవనములు చెప్ప నలవికానివి. "ఆమె తొలిజన్మమున హరిణి యను నప్సరస. శాపవశమున విపుల నుదయించినది. దివ్యసుమాలమాల సోకఁగా నాపెమోక్షము బడసినది. ఇఁక విచారముడిగి శాంతించుట మంచి" దని వసిష్ఠమహర్షి సందేశించెను.

అందువల్ల నతని కన్నీటి పృషతముల సంఖ్య మరింత కడుకొనిపోయెనే కాని, యావంతయుఁ గడబడలేదు. కుమారుఁడు చిన్నవాఁడు. అతఁడు కొంచెము పెద్దవాఁడగువరకు నెట్లో యతికష్టముగా జీవించి పదపడి యజసార్వభౌముఁడు దివి నలంకరించెను. ఎనిమిదవ సర్గము.

దశరథుఁడు నవచక్రవర్తి; మరియు, బాలుడు. అయినను, దాత తండ్రుల కెనవచ్చు పరాక్రమవంతుఁడు. ఆ రోజులలో దేవతలకు సైత మతని చేయూత పనివడుచుండెను. యౌవనముకుళములు తన తనూలతఁగడుకొని కుసుమింపఁగా, దశరథుఁడు పెండ్లిచేసికొనెను. కౌసల్య, సుమిత్ర, కైకేయి పెండ్లికూతుళ్లు. ఒకనాఁడతఁడు వేటకుఁ బోయెను. అది యొక యాట వికవిపుల. అతని కక్కడొక శబ్దము వినఁబడెను. అది యొక మృగసంబంధి యని భ్రమపడి యాబాట నొకతూణీరము విడిచిపెట్టెను. కాని, కొంపమునిగినది. అది యొక బ్రాహ్మణ బాలుఁడు మంచినీటికొరకు కక్కడి చెరువు నుదకమునఁ గూజాను ముంపఁగా వెలువడిన ధ్వని. అబ్బాలుఁడు వెంటనే కాయము వాసెను. అతని మాతాపితరులు కడుంగడు వృద్ధులు. ఆకడింధికిఁ దాళజాలమి వారును నయ్యెడఁ దనుత్యాగ మొనర్చిరి.

పిమ్మట శాపగ్రస్తుఁడై రాఠాజు రాజమందిరము చేరుకొనెను. కాఁగల పుత్రోదయమునకు సంతోషము, జరిగిన శాపగ్రస్తతకు విచారమును నతని నానాఁడు సమానముగా ముట్టడించినవి. నవమ సర్గము.

అపత్యప్రాప్తికిఁ జక్రవర్తి యాగమారంభించినాఁడు. అది పుత్రికామేష్టి. సరిగా నదే సమయమున దివ్యులు రావణాసురునివలనఁ దమకుఁ గలిగెడు చిక్కులను గురించి జనార్దనునితో మొరఁబెట్టికొనిరి. "ఇఁక, మీచిక్కులు కడవెళ్ళు కాలము వచ్చినది. నేను భూతలమున దాశరథినై పుట్టఁబోవుచున్నా"నని యాదిదేవుఁడు ప్రత్యుత్తరించెను. తదుపరి యజ్ఞశాలలో హోమగుండమునుండి యొక దివ్యపురుషుఁడు నిర్గమించి పాయసాన్నముతోఁ గూడిన యొక తపనీయపాత్రను రాజున కందిచ్చెను. ఆపాయసాన్నము నతని రాణులు ముగ్గురు సమభాగములుగాఁ జేసికొని సేవించిరి. తత్ఫలితముగా వారు వెంటనే గర్భములను దాల్చి సకాలమునం దంతకు ముందెవ్వరును గనివిని యెరుఁగని సుపుత్రులను గనిరి. అరిగో, వారే రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు. పదియవ సర్గము.

రాక్షసులవలని యుపద్రవములకు మితిలేదు. ఇఁకఁ గౌశికుని యాగము నిర్వహింపఁబడవలయునన్న రామభద్రుఁడు కావలయును. మహర్షి వెంటనే రాజగృహమున కరిగి రాజున కంతయు వినిచి యతనిని లక్ష్మణసమేతముగా రామచంద్రుని తనవెంటఁ బంపుమని యభ్యర్థించెను.

దశరథుఁ డంపుల కియ్యకొని రామలక్ష్మణుల నతని వెంటఁ బుత్తెంచెను. యాగమునకు ముఖ్యవిఘ్నకారిణి తాటకి. ఆరక్కసి శ్రీరామచంద్రుని నారాచమునకు గురియై నేలం

గూలెను. అక్కతమున మహర్షి తన యజ్ఞమును నిరాఘాటముగా సంభాళించుకోఁ గలిగెను. పిమ్మట ఋషి రాజవహాళి రామలక్ష్మణులను మిథిలానగరమునకుఁ గొంపోయెను. అది సీతాస్వయంవర సమయము. దుర్వాహమగు శివుని విల్లు నెక్కుపెట్టుట నాఁడక్కడ నిర్ణీతమయిన కన్యాశుల్కము. శ్రీరామచంద్రుఁ డాశుల్కము నవలీలగాఁ జెల్లింపఁగలిగెను. అనుక్షణమున సీతారాముల కళ్యాణము, సీత యవరజలతో రాముని యనుజుల వివాహములును నతివైభవముగా జరిగెను.

తరువాతఁ బెండ్లివారు గృహప్రవేశమునకు బయలు దేరినారు. త్రోవలోఁ బరశురాముఁ డడ్డగించెను. కాని, విజయము శ్రీరామచంద్రునిదే. మరియుఁ బరశురామున కది దివ్యజ్ఞానమలవడిన సుపర్యాయము.

చివరకు వారెల్లరు హర్షాతిరేకముతో నయోధ్యకుఁ జేరుకొనిరి. పదునొకండవ సర్గము, ఇఁక, రామచంద్రునకు రాజ్యమొప్పగింపవలయునని దశరథుని యుబలాటము. అందుకు వలయుఁ బ్రయత్నము లన్నియు జరుగుచుండెను. సరిగా సుముహూర్తమునాఁటికిఁ గైకేయి ప్రతిష్టంభన తలయెత్తి పట్టుగొన్నది. అందువల్ల నవన్నియు విఫలములగుటయేకాక, శ్రీరామచంద్రుఁడు దారాసమేతమ్ముగా నడవుల కేగవలసివచ్చెను. అతఁడక్కడ నుండవలసిన వ్యవధి పదునాల్గుసంవత్సరములు. వారి వెంట లక్ష్మణుఁడు కూడ బయలుదేరెను. పుత్రవియుక్తి

దుఃఖము దుర్వహము కాఁగా రాజు కాయము వాసెను. అదంతయు భరతుఁ డింటలేని సమయము. ఇంటికి రాఁగనే యతని కంతయు నయోమయమయిపోయినది.

ఎట్లైన, సీతారామలక్ష్మణుల నింటికిఁ దోడ్కొని రావలయునని యతని తుదిపరిచ్ఛేదము. అప్పటికప్పుడే సీతారామలక్ష్మణులు చిత్రకూటాద్రిఁ గాపురించియుండిరి.

మొట్టుకు, రాకుమారుఁ డయ్యెడఁ జొచ్చి రాజ్యస్వీకృతి యొనర్పవలసినదని యన్నగారిని బదింబదిగాఁ బ్రతిమాలుకొనెను. అయినను, గడక యున్వార్థము కాలేదు. తుట్టతుద కాయన పాదుకలను వెంటనిడుకొని వెళ్ళి వానికి పట్టాభిషేక మొనర్చి తాఁ గేవలము ప్రతినిధిగాఁ బ్రజాపాలన మొనర్పనుపక్రమించినాఁడు భరతకుమారుఁడు. నాఁటి కేంద్రప్రభుత్వపుటునికి యయోధ్యకాదు, నందిగ్రామము. అతఁ డారోజులలో ధరించినది రాజవేషముకాదు, కేవలము తపస్వి నేపథ్యము. అది యతఁడానాఁడు స్వీకరించిన యసిధారావ్రతము. సీతారామలక్ష్మణులు చిత్రకూటాద్రినుండి బయలుదేరి పంచవటి కేగి యచట బసచేసిరి. కొంతకాలము గడచినది. ఒకరోజున హఠాత్తుగ రావణుఁడు సీత నెత్తుకొనిపోయెను. అప్పుడు శ్రీరాముఁడు లక్ష్మణానుసృతుఁడై బ్రహ్మాండమైన వానరసేనతో లంకను ముట్టడించెను.

సంగ్రామము బ్రహ్మాండముగా జరిగినది. తుట్టతుద కక్కడ విజయవంతుఁడైన వాఁడు శ్రీరామచంద్రుఁడు. నవ

లంకాధిపతి విభీషణుఁడు సీతాదేవిని సగౌరవముగా రాముని కడకుఁ దోడ్కొనివచ్చెను.

ఇఁక, వారయోధ్యకు వేగిరమ పోవలయును. అందుకుఁ దగిన యానము పుష్పకము. అది యొక యపురూపమగు విమానము. వారనుపదంబ దాని నధిష్ఠించి స్వదేశమునకు బయలుదేరిరి. పండ్రెండవ సర్గము. మార్గమధ్యమున వారు వస్తువైవిధ్యమును బర్యవేక్షించుచు నిర్ణీతకాలమున గమ్యస్థానము చేరుకొనిరి. అది సాకేతనగరికిఁ బరిసరభూమి. బ్రహ్మాండప్రజానీకముతో రాజప్రతినిధి యానాఁడు వారల కిచ్చిన స్వాగతము వర్ణనాతీతము. అప్పుడు జగత్పతి నగరోపకంఠమందలి యుపవనమునఁ గల యుపకార్యయందుఁ గళత్రానుజపరివారముగా మకాముచేసెను. పదమూడవ సర్గము. పదపడి యొక సుముహూర్తమున శ్రీరామచంద్రుఁడు చతురంతమహీపాలన బాధ్యతను నొదలఁ బూనెను. అది యపూర్వమైన ప్రజాస్వామికము. కాబట్టి, యాప్రభుత్వమును హర్షింపని వారెవ్వరు నుండరు.

కాని, వారి యిడుమల కింకను నంతిమదశ దరిసినట్లగుపింపదు. కొంతకాలము పరుని పంచనున్న తన భార్యను రాముఁడు తిరిగి గ్రహించెనను నపవాదొకటి తలయెత్తి కడలొత్తెను.

అది జగదేకపతి హృదయమునకు నశనిపాతముగ్గైవడి తోఁచినది. సీత హృదయ మతఁడెరుఁగనది కాదు; మరి,

యూయుపవా దతనియెడందకు దుర్భరమైపోయినది. అంతయు నయోమయముగా నగుపించెడు దుస్స్వమయ మది. మహారాజ్ఞి పూర్వమొకప్పుడు గంగాజలంబులు మరల నొకమారు చూడవలయునని యభిలషించినది. అందునను, నప్పుడామె గర్భవతి. గర్భవతుల కోరికలను దీర్చుట సముచిత కృత్యము. దానిని మిష గాఁదీసికొని యామె నప్పుడడవికిఁ బంపఁ గడగట్టినాఁడు (శ్రీ) రామచంద్రుఁడు. వెనువెంట, నతఁడప్పనికి నవరజుఁడగు లక్ష్మణ స్వామిని బనిగొనెను. జగన్మాత యానాఁడట్లు నిశాంతమును విడచిపోవుట కక్కడెవ్వరికి నిష్టములేదు. కాని, యది విధి నిర్ణయము. తిరిగివచ్చునప్పుడు రాకుమారుఁడు వదినెగారియొద్ద నుండి యన్నగారి కొకసందేశమును దీసికొనివచ్చెను. దానిని జగత్పతి వినియువినఁగనె యతని శోకస్రవంతిగట్టు లకస్మాత్తుగఁ దెగిపడిపోయినవి.

సీత నతఁడు వెళ్లఁగొట్టినది కేవలము రాజగృహము నుండియే కాని, తన హృదయసౌధమునుండి మాత్రము కాదు. అదంతయు బాగుగా నెరిఁగిన పతివ్రతాశిరోమణి సీత వాల్మీకి యాశ్రమమందుఁ గేవలము తపస్వినిగా నెట్లో కాలము గడప నుంకించెను. పదునాల్గవ సర్గము.

రానురాను బ్రపంచమున లవణాసురుని దుండగములు పెచ్చుపెరిగిపోయినవి. ఇఁక జగత్పతి సహనము చూపఁగూడదు. రాకుమారుడు శత్రుఘ్నుఁడతని నియోగమున వెంటనే యారక్కసుని గడతేర్చినాడు. అది యటుండఁగా నక్కడ

వాల్మీకి యాశ్రమమందు సీత ప్రసవించినది. కవలు పుట్టిరి. ఆ శిశువులకు మహర్షి కుశలవులని పేరులు పెట్టెను. పిమ్మట నతఁడు తాను విరచించిన రామాయణమును వారికిఁ బాఠము చెప్పెను. వారును మాధురీధుర్యమైన కంఠస్వరములతో నా గ్రంథమును జదువుచు నిటునటు దిరుగసాగిరి. అదృష్టవశమున రాముఁడొకనాఁడు వారిని జూచి తన కొడుకులుగా గుర్తుపట్టెను. అప్పుడతఁడు సీతను దన చారిత్రశుద్ధిని బ్రజకు మరొకమారు ఋజువుచేయుమని కోరెను. ఇఁక నాపె భూలోకమున నిలువ నిచ్ఛగింపక వెంటనే దారినిమ్మని తన తల్లిని వేడుకొన్నది. అట్లు భూజాత తన మాతృగర్భమున విలీనమయిన కొంత కాలమునకు లోకస్వామియు వైకుంఠము చేరుకొనెను. పదు నేనవ సర్గము.

పిమ్మటఁ గుశకుమారుఁడు సింహాసన మెక్కెను. అతని రాజగృహ మప్పుడయోధ్యకాదు; కుశావతి. అయినను, గుశ రాజమౌళి మంచి సమర్థతఁగల మహామహుఁడు.

అతని తమ్ములును నతనియెడల మంచి భక్తివిశ్వాస ములతో మెలఁగుచుండిరి. అది యొకనాఁటి నిశీధసమయము. అప్పు డతని కన్నుఁగవకు నొక స్త్రీ యగపడెను. ఆమె వైఖరి ప్రోషితభర్తృక వైఖరిని బోలియుండెను. ఆబిడ యెవరో కా; దయోధ్యానగరపు టధిష్ఠాన దేవత. ఆమె ప్రోద్బలమువల్లఁ గుశ రాజమౌళి యయోధ్యను రాజధానిగా సంతరించెను. ఒక నాఁడతఁడు నవలాలితహృదయుఁడై ప్రమదలతో యమునా

జలంబుల లీలించుచుండఁగా నతని జైత్రాభరణ మజ్ఞాతపాత మ్మగఁ దెగిపడెను. సాధారణప్రయత్నములవలన నది చే పడున ట్లగపడలేదు. దాన, రారాజు సోత్రతస్సున బాణము విడువ నుద్యతుఁడయ్యెను. అనుపదంబ, కుముదుఁడు బంధుత్వ భావముతోఁ బైకివచ్చి యా నగ నతని కిచ్చివైచెను. తదుపరి యత డమ్మహీపతి నెయ్యము నభిలషించి తన యవరజయగు కుముద్వతి నతనికిచ్చి యుపయామ మొనర్చెను. పదు నారవ సర్గము.

కుశరాజమౌళికిఁ గుముద్వతి యందుఁ గలిగిన తనూజుఁ డతిథి. తండ్రికి బిమ్మట నతఁడు సింహాసనమెక్కి ప్రజా స్వామ్య మొనర్చెను. పదునేడవసర్గము.

అతిథి కుమారుఁడు నిషధుఁడు. తండ్రి తరువాత నతఁడు ప్రభుత్వ భారము వహించెను. పిమ్మటఁ దదీయ వంశజులగు పందొమ్మిదిమంది రాజులు ధరాపరిపాలన మొనర్చిరి. తరువాత సుదర్శనుఁడు రాజయ్యెను. అతఁడు ధ్రువసంధికిఁ బుత్రుఁడు. సుదర్శనుఁడు తానారవ యేటనే రాజ్యమునకు వచ్చినను, బ్రజారంజకుఁడై మంచి పేరు గడించెను. పదు నెనిమిదవ సర్గము. సుదర్శన మహీపతి కుమారుఁడగ్నివర్ణుఁడు. అగ్నివర్ణుఁడును బ్రభుత్వము చేయుటయందు మంచి దక్షతఁగల నాయకుఁడే; కాని, కడుంగడు నభికుఁడు. తండ్రి సంపాదించి పెట్టినది బోలెడున్నది. ఇఁక, దాని ననుభవించుటయే తన విధ్యుక్తధర్మమనుకొనినాఁడు కాఁబోలు; నగ్నివర్ణమహీపతి

యజస్రము విలాసినులతోడనే ప్రొద్దులుబుచ్చుచుండెడివాఁడు. అందువల్లఁ జివరకతఁడు క్షయరోగగ్రస్తుఁడై మరణించెను. సంతతి లేదు; కాని, మహారాజ్ఞి గర్భవతి. పిమ్మట నామె సింహాసనమెక్కెను. తుది సర్గము.

మహాఘనత వహించిన కాళీనులు సూర్యవంశపు రాజులు. ప్రపంచమందుఁ బేరెన్నికఁగన్న మహాకావ్యము రఘువంశము. అందలి విషయజాతము దర్శకులకుఁ దదీయమైన యాలేఖ్యమును రమ్యతరముగఁ బ్రదర్శించుచున్నది.

కుమారసంభవపు నడక యొకేయొకకథకుఁ జెందిన నాయికానాయకులమీద నాధారపడియున్నది. మేఘసందేశపు నడకయు నట్టిదియే. అందువల్ల నారెండు కృతులందును గృత్యసమైకత సుఖముగాఁ గాలయాపనచేయుచున్నది. కృత్యసమైకత కావ్యముల కవశ్యావశ్యకము. మరి, రఘువంశము పట్టిన త్రోవ వేరు. ఒకేయొకవంశమునకుఁ జెందిన యిరువది తొమ్మిదిమంది నాయకుల చరిత్రాంశము లందు రచింపఁబడియున్నవి. అట్టి కావ్యరచన చాల కష్టతరమైనది. కథాంగము లొకదానితో మరొకటి బిగువైన పొత్తుఁగలిగియున్నప్పుడే కావ్య రమణీయత. కాని, యట్టి కృతియందవి సాధారణముగా సడలియుండుటయే సంభవించును. ఏకవిషయకమైన కృతికి బహువిషయకమైన కృతికి నింత వ్యత్యాసమున్నది. ఏకవిషయకమగు కృతియందలి ప్రధానకథయు నవాంతరకథలును నేకప్రయోజనసాధనకు గురిపెట్టఁబడియుండును.

బహువిషయకమగు కృతియం దట్టిది పొసఁగఁజాలదు. అందువల్ల నట్టి కావ్యమునఁ గావ్యమున కవశ్యావశ్యకమగు గృత్యస్మైకత పనుపడుట కష్టాతి కష్టతరము.

కేవలము (శ్రీ) విష్ణుస్వరూపులు సీతారామచంద్రులు. ఆదికవీంద్రుఁడు వాల్మీకి యీ యాదర్శదంపతుల దివ్యచరిత్రను రామాయణమహాకావ్యమున నింపులుగురియు చక్కని పద భావముల వితానములతో మనఃపేయముగా గానముచేసి యున్నాఁడు. మరియు, వాల్మీకియందుఁ గాళిదాసునకుఁ బరమ భక్తి. కాని, యీ లోకారాధ్యుల పరిమళజీవికలను దానుగూడ గానముచేసినఁగాక యతని యుత్సుకత తనియున ట్లగపడలేదు. ఆదికవి రచన యప్పటికే మంచిప్రసిద్ధిఁ గలిగి యున్నది. మరియు నతఁడు పెద్దవాఁడు. అప్పుడిఁక మహాకవి తచ్చరిత్ర మును బ్రత్యేకముగా వ్రాయ నుంకించుట లాక్యము కాఁ జాలదు. కాబట్టి, యతఁడు తనకుఁగల శక్తిని మరొక క్రొం గ్రొత్తబాటకుఁ బట్టించి నడపుటయే సర్వథా శ్రేయస్కరము. అదుగో, యీయుద్దేశముతోనే మహాకవి రఘువంశరచనకు దిగినాఁడు.

సీతారాములు రఘువంశీయులు. ఇఁక, నొక చక్కఁ గవిరాజభూషణుని యుత్కత తనియఁగలదు; మరొకక్రొవ నతని బాటకు నవనవ్యతయు సిద్ధింపఁగలదు.

అయినను, నతఁడు గ్రహించిన పుంత నిపీయదుర్గమము. సూర్యవంశ్యుల చరితమును గేవలమైన చారిత్రక శైలినై

వ్రాయుటకా దతని యుద్దేశము. చారిత్రిక శైలితోఁ బొచ్చె ములేని పొందుఁ గల కావ్యభావపరంపరలలోఁ దద్రచనము పూర్తిగ విలీనము గావలయును. ఆ కావ్యభావపరంపరలును హృదయావర్జకములుగాఁ దలకూడవలయును. అప్పుడుగాని యతని హృదయము తృప్తిపడదు. అతని కవితాహృదయపు ధాళధళ్యముల సాక్షాత్కృతియు నప్పుడే. మరి, యతఁడు సాటిలేని ప్రతిభఁగల మహాకవి. శ్రీరామచంద్రునకు ముందుఁ గల సూర్యవంశజులలోఁ జేసుప్రతిష్ఠలతోఁ గూడి రమణీయ చరిత్రఁగల మహామహులనే యత డు తనకావ్యమున కధిష్ఠాన వర్గముగాఁ బరిగ్రహించినాఁడు. కేవలము విష్ణ్వంశసంభూతుఁ డగు శ్రీరామచంద్రుఁడు రఘువంశ్యుఁడగుట నతఁడు తచ్చరిత్ర కీర్తనరతుఁడగుటను గాళిదాసుఁ డామహనీయుని చరిత్రకుఁ దన కావ్యమందు నెక్కువభాగమును గేటాయించి సమర్పించెను.

రఘురాజమౌళి వంశకర్త. ప్రథమ ద్వితీయ సర్గము లతని జన్మవృత్తాంతమునకుఁ జెందియున్న కావ్యభాగములు. కాబట్టి యవి నితాంతముఖ్యములు.

తరువాతి మూడుసర్గములు రఘునరేంద్రుని పుట్టుక, యౌవనోదయము, నతేయ బలపరాక్రమములు, హృదయౌ దారత మున్నగు విషయములను వెలువరించుచున్నవి. ఇఁకఁ దక్కటి యారేడు సర్గములందును నతని రూపురేఖలు కనఁ బడుచున్నవి; కాని, యవి ప్రత్యక్షములు గావు; కేవల పరో క్షములు. అవి యిందుమతి స్వయంవరవివాహదృశ్యములందు

నజుఁడు పరిపంథిరాజులతోఁ బోరు ఘట్టమునందును గందళించి యున్నవి. అష్టమసర్గమునఁగూడ నతని ఛాయ కొంతమట్టుకుఁ గనఁబడును. దశరథుని జననసందర్భమునఁ గాళిదాసు—

"దశరశ్మిశతోపమద్యుతిం,
యశసాదిక్షుదశస్వపిశ్రుతం;
దశపూర్వరథంయమాఖ్యయా,
దశకంఠారిగురుంవిదుర్బుధాః".

ఇట్లు వ్రాసియున్నాఁడు. (రఘు॥ సర్గ॥ 8 శ్లో॥ 29)

ఈ శ్లోకమున దశరథుఁడు దశకంఠారి గురుఁడుగాఁ జెప్పఁబడియున్నాఁడు. కాబట్టి యష్టమసర్గమునఁ బ్రవేశించిన మఱుక్షణములోనే పాఠకలోకమునకు శ్రీరాముని నామము జ్ఞప్తికి రావచ్చును.

అది యట్లుండఁగా, నవమసర్గము సీతాపతి దివ్యరూప మును కేవలము చర్మదృక్కులకుఁ గాకున్నను, హృదయ దృక్కులకు మంచిగ నెత్తి చూపఁగల సమర్థతతోఁ గులుకు చున్నది. అదంతయుఁ గాళిదాసుని కథాకథననైపుణి. కావ్య పుటితివృత్త మాంగికసమైకత లేనిదేయైనను, అది యతని కవితాకళలోఁ గందళించి యసివారెడు నాకథాకథననైపుణి ముందుఁ బూర్తిగ మఱుగుపడిపోయి యొకవిధమగు క్రొంగ్రొత్తరూపుతోఁ బునరుద్భవించి చూపులకు మిరుమిట్లు గొలుపు చక్కని వెలుంగుఁ దునుకలను గురియుచున్నది. అదియే యతని కవితాసామ్రాజ్యమునఁ గందళించి పంటకు వచ్చియున్న

యొకవిధమగు నపురూపపుఁ గందువ. పాశ్చాత్యుఁడగు రైడరు విద్వాంసుఁడు—"We must regard it as a poem in which single episodes take a stronger hold upon the reader than does the unfolding of an ingenious plot."
ఇట్లు కరాళించుచున్నాఁడు.

ఏకకథ తానెంత చమత్కారమైన దైనను గావచ్చును. కాని, బాగుగా నిర్వహింపబడినచో విడికథల గుచ్ఛము దానికంటెఁ గోటిగుణంబులధికముగాఁ బాఠకుల నధ్యక్షింపఁ గలదు. అట్టిదియే రఘువంశ మహాకావ్యము.

అది కథావైవిధ్యముఁగల మిశ్రకావ్యమేయైనను; బాఠకులయు, శ్రావకులయు హృదయములను హాయిగాఁ గట్టడచేయఁ గలుగునంతటి కందువతో వెల్లివిరిసి తొంగలించుచున్నది. పదునేడవ సర్గమున రచన సామాన్యముగనే పరిక్రమించినది. అయినను, నయ్యెడ నింపితమైన కమ్మనీటిని గిలకొట్టి చిలకరించెడు చక్కని ధారాశుద్ధి వెల్లివిరిసి యున్నది. మరియు, లోకమున కవశ్యసంపాద్యమగు రాజకీయపరిజ్ఞాన మయ్యెడ విశేషముగాఁ గేంద్రీకృతమై యున్నది. ఈసందర్భమున—

పరేషు స్వేషు చక్షిప్తై, రవిజ్ఞాతపరస్పరైః;
సోఽపసర్పైర్జజాగార, యథాకాలంస్వపన్నపి. ॥51 శ్లో ॥
సధర్మస్థసఖః శశ్వ, దర్థిప్రత్యర్థినాం స్వయం;
దదర్శసంశయచ్ఛేద్యాన్, వ్యవహారానతంద్రితః. ॥39 శ్లో॥

ఈ శ్లోకముల జంట కన్నడింపరానిది.

అతిథి క్షితిపాలుఁడు మంత్ర్యాదులగు తన యున్నతోద్యోగుల యెడల సపసర్పులను నియోగించుచుండెడివాఁడు. కాని, యార్థికమంత్రి రహఃప్రవృత్తులను గనిపెట్టుటకు నియుక్తుఁడయిన చారుఁడు వ్యవసాయమంత్రి రహఃప్రవృత్తి నరయుటకు నియమింపఁబడిన ప్రణిధి యెవరో యెరుగఁడు.

అట్లే, యితఁడును నతఁడెవరో యెరుఁగఁడు. అతని చారనియుక్తి యంత కుశలత గలదియైయుండెడిది. శాత్రవుల కందువలలోఁ గూడ నత డదే కైపున వేగులవాండ్రను బనిగొనుచుండెడివాఁడు. తదీయ నియుక్తియు నంతటి కౌశలము గలిగియుండెడిది. మిక్కిలి చిక్కుసమస్యలతోఁ బెనగొని యుండెడు నర్థిప్రత్యర్థుల వ్యవహారములను రారాజు తానే స్వయముగా ధర్మాధికారులతోఁ గూడి యతంద్రితుఁడై పరిష్కరించుచుండెడివాఁడు. ఇప్పుడిఁక గామందకయాజ్ఞవల్క్యులు గ్రథించిన—

"చారాన్విచారయేత్తీర్థే, ష్వాత్మనశ్చపరస్యచ;
పాషండ్యాదీనవిజ్ఞాతా, నన్యోన్యమితరైరపి." (కామందకః॥)
"వ్యవహారాన్నృపఃపశ్యేద్విద్వద్భిర్బ్రాహ్మణైస్సహ
(యాజ్ఞవల్క్యః.)

ఈ భాషితములు గమనింపఁదగును.

రాజు తన యధికారివర్గముల యెడలను బరులయెడలను నాడికము గల గూఢచారులను నియోగింపవలయును. వారు

చారులను విషయము దరస్యులే కాక తామును నొండొరు నెరుఁగఁజాలని విధముగఁ దన్నియుక్తిఁ యొడఁగూడవలయును. మహీపతి తాన స్వయముగా లోక వ్యవహారములను గమనింపవలయును. కాని, యట్టి సమయములం దతఁడు విద్వాంసులగు బ్రాహ్మణులతోఁ గూడి వానిని పరిష్కరించుట శ్రేయోదాయకము. ప్రకృతి వ్యవహారములను భూనాయకుఁడే విచారించి పరిష్కరింపవలయునని యాజ్ఞవల్క్యుఁడు శాసించుటకు దగినంత ప్రబలహేతువు లేకపోలేదు. అట్లయినయెడల లోకములో లంచగొండితనము తొలకరించుటకెంతమాత్రము నవకాశముండదు. మరియు, నతఁడు వానిని బరిష్కృతి చేయునప్పుడు తానుత్తమ శ్రేణికిఁ జెందెడు పరిణతపండిత వర్గముతోఁ గొలువుఁదీర్చి యతంద్రితుఁడై యుండవలయు ననుట హర్షింపఁదగిన ప్రముఖ విషయము.

ఆనాఁడు భారత చతురంతలోఁ దొలకరించిన రాజకీయ శాస్త్రము భూస్వాములకు నిరంకుశ ప్రభుత్వము నెంత మాత్రము ననుమతింపలేదను మహత్తర విషయమొకఁ డిప్పుడు వెల్లివిరిసినది.

దీనిని బట్టి పూర్వము భరతఖండమునఁ గల ప్రభుత్వము; లవి యేక నాయకములైనను, బహునాయకములైనను, గర్మలత లేని యొడికంపుఁ బ్రజాస్వామికములని విశ్వసింపనచ్చును. చారనియామకమును గురించిన విధులు పాశ్చాత్యకాలము నాటి భారతపరిపాలన పద్ధతి యెంతటి చాతురీ జాగర్యలతో

ఘనీభవించియుండెడిదో యెరుకచేయఁజాలి యున్నవి. ఇఁకఁ గడసారిగా—

"బంధచ్ఛేదం స బద్ధానాం, వధార్హాణామవధ్యతాం;
ధుర్యాణాంచ ధురో మోక్ష, మదోహంచాదిశద్గవాం." 19. శ్లో॥
ఖనిభిః సుషువే రత్నం, క్షేత్రైః సస్యం వనైర్గజాన్;
దిదేశ వేతనం తస్మై, రక్షా సదృశ మేవ భూః" 66. శ్లో॥

ఈ శ్లోకములను గూడ నుపలక్షించుట సమయోచితము కాకపోదు.

అతిథి తాను సింహాసనమధిష్ఠించిన మలినిమునమునఁ గారాగార బద్ధులకు బంధవిచ్ఛేదము, వధ్యులకు వధ్యతానివృత్తి, ధుర్యములకు భార మోక్షము, గోవుల కదోహంబును గావల యునని యాదేశించెను.

ఇవన్నియు హర్ష లాంఛనములు. ఆనాఁడు భారతీయు లమలుపరచిన యీ లాంఛనము లిప్పుడును లోకమం దమలు జరుగుచునే యున్నవి. విశ్వంభరకు రక్షణ యొసఁగు వాఁ డతిథి చక్రవర్తి. కాబట్టి విశ్వంభర యతనికి రక్షాసదృశ మయిన జీతము నీయవలసి యున్నది. అందుకొరకు నఃర్వర గనుల నుండి రత్నాదికమును, క్షేత్రములనుండి పంటలను, వనములనుండి గజాద్యావశ్యక జంతువులను దెచ్చి యతని కిచ్చు చుండెడిది. ఇప్పు డానాటి భారత ప్రభువులు ప్రజాద్రవ్య మును దుర్వినియోగము చేయని సునియమనంతులనియు, వారు ప్రజలపట్ల రక్షకులుగా వ్యవహరించెడివారనియుఁ,

ప్రాచీన భారతీయులు భూగర్భశాస్త్రపరిశోధనాదుల గడి చేరిన దిట్టలనియు విశదమగుచున్నది.

అందుల్లిఖితములయిన చారనియోగాది రాజకీయతంత్రములా రోజులలోనే కాక యీరోజులలోఁ గూడ లోకవ్యవహృతి నాశ్లేషించియే యున్నవి. మెట్టుకు బదునేడవసర్గము రాజకీయముగా నెంతేని ప్రాధాన్యము వహింప గలదు.

భారతీయ జ్యోతిష్పథమున నంతములేని యొక యఖండ జ్యోతిగా వెల్లివిరిసియున్న ప్రాక్తన రాజకీయ నాగరికతను నాకావ్య భాగము మంచి నిగ్గయిన తెక్కుతో రుచి చూపుచున్నది. ఎంతటి యుత్తమ కావ్యమందయినను, గవిత కేవల వర్ణనలతోఁగాని, కేవల కథనములతోఁగాని నిండి యుండదు. అట్టి కావ్యప్రపంచమున వర్ణనాకథనములు రెండును దమతమ వంతుల ప్రకారము తమతమ చెల్లుబడులను సాగించు చుండును. కాని, ధారాశుద్ధి, శైలి లోనుగాఁ గల యుదాత్త కవితాగుణగణమంతటను నొకేమాదిరిగానుండును. ఈ కావ్యోత్తమ ధర్మము రఘువంశమహాకావ్యమందుఁ గాపుండి కన్గంటఁ దులకించుచున్నది. వివిధకథలతోఁ గదంబించి యిగురొత్తిన కబ్బము రఘువంశమని పైన గ్రథించియుంటిని.

మొత్తముమీద నయ్యెడ వాని సంఖ్య పెక్కునగనే చూపట్టుచున్నది. అయినను, నవి యెంత చదివినను నింకను జదువ వలయునను నుత్సుకతనే కాని, యిసుమంతయు విసుగును బుట్టించునవిగాఁ గనుపట్టవు.

అది కవిసార్వభౌముని చాతురీగరిమ. దిలీప సింహాముల పరస్పర సంభాషణములు, రఘు పురందరుల యుద్ధము, కొత్స దిలీపనందనుల సమావేశము, భోజావరజ స్వయంవరము, రఘునందనుని పరిదేవనములు, వసిష్ఠుని శాంతి సందేశము, వసంతవర్ణన, దశరథుఁడు, తదీయ శాప ప్రాప్తి, నిలింప జనార్దనుల సంవాదము, పరశురాముని క్రొధ ప్రసంగము, సీతాదేవి యపవాదము, తదీయ బహిష్కృతి, యాపె సందేశము, కొడుకులతోడి శ్రీరాముని పునఃసమావేశము, విషాదకరంబగు భూజాత యంతర్ధానము, కుశుని మోలి నధిష్ఠాన దేవతసాక్షాత్కృతి;—ఈ మొదలుగాఁగల వివిధ సన్నివేశముల యుపకథల నశ్వర హర్షస్ఫోరకములు. అది వానిలో విలీనముగాఁ గడలొత్తి తులకించెడు నపూర్వ రచనాభావముల యనుపమ సౌందర్యాదీప్తులకుఁగల గొప్పతనము.

వివిధ నాయకుల జీవిత ఘట్టములయందుఁ బ్రధానముగా నత్తమిల్లియున్న యవాంతర కథలను గవికులమూర్ధన్యుఁడు నిర్వహించిన విధాన మప్రమేయ నవ్యము.

దాని కదియే సాటి. వర్ణనాకథనముల యితరేతర సఖ్యము చూడ ముచ్చటయినది. ప్రసంగములు నన్యోన్య ప్రసంగములును గమ్మగాడ్పులలోని హాయి నలవోకగాఁ బ్రీతి ఘటింపఁగలవు. రసభావములు తమతమ జనన నిర్వాహణ పరివర్తన సమయములందుఁ గావ్యమునకు నొకవిధమయిన యనిర్వచనీయశుభగతను బహూకరించుచున్నవి. ఇఁక నందుఁ

గల కల్పనల తెమ్మెరలు పాఠకశ్రోత్రుల హృదయ ప్రపంచము నకుఁ గజ్జలపుమచ్చలు లేని ధవళిమల తళతళల నవలీలగాఁ బ్రసరింప జేయఁగలవు. ప్రస్తుతము—

"తథాగతాయాంపరిహాసపూర్వం,
సఖ్యాంసఖీవేత్రభృదావభాషే;
ఆర్యే! వ్రజామోఽన్యతఇత్యథైనాం
వధూరసూయాకుటిలంద దదర."

(సర్గ॥ 6. శ్లో॥ 82)

"సాయూనితస్మిన్నభిలాషబంధం,
శశాకశాలీనతయా న వక్తుం;
రోమాంచలక్ష్యేణసగాత్రయష్టిం,
భిత్త్వానిరాక్రామదరాళకేశ్యాః."

(సర్గ॥ 6 శ్లో॥ 81.)

ఈశ్లోకమిథునము సమాదృత్యము. "అమ్మా! ఇందు మతి! ఇఁక, మరొక తావునకుఁ బోవుదమురా" యని సునంద రాకుమారితోఁ బరిహాసముగా నన్నది. అది రాజపుత్రిక హృదయకమలమును దిగిచిపట్టిన రఘునందనుని విష్టర ప్రదేశము.

అది సునంద యెఱుఁగని విషయము కాదు. ఆమె యుపజ్ఞ చాలా గొప్పది. కాని, వేళాకోళము చేయవల యునని యామె యభిలాష. అప్పుడా పలుకులు రాజపుత్రికిఁ గేవలము శల్యప్రాయములు. అయినను, నది మాటలతో

జవాబీయఁదగ్గ సమయముకాదు. అందువల్ల, వినియు వినఁగనే యామె సునందవైపు నసూయాకుటిలమ్ముగఁ జూచినది. అదియే యప్పుడామెకుఁ దగిన ప్రత్యుత్తరము. ఇక్కడ నిందుమతీ సునందలకు నడుమ జరిగిన వాక్సంజ్ఞాసంభాషణము సమయపాత్రౌచిత్యములను జక్కఁగఁ బరిపోషించుటయేకాక, లోకవ్యవహృతియందుఁ గాళిదాసునకుఁ గల యుపజ్ఞను బహు చమత్కారముగాఁ బైటఁబెట్టుచున్నది. కవి లౌక్యుఁడు గూడఁ గావలయును. కానియెడల, నతఁడు తన కవిత్వమున లౌక్యమును జొప్పింపఁజాలఁడు. లౌక్యసంబంధికాని కవిత్వము లోకహృదయమునకు ధృతిఁ దలకొలుపఁజాలదు.

లోకులయెడందలకు సంతుష్టిఁగలిగించి వానిని నొడిసి పట్టలేని కబ్బము లోకమునకుఁ దానీయవలసిన సందేశమును విజయవంతముగా నీయఁజాలదు. అప్పుడది "విశ్వశ్రేయః కావ్య" మ్మను నానుడికి దవిష్ఠము గావలసివచ్చును.

కాబట్టి, లోకపరిజ్ఞానము మహాకవికి నుండవలసిన ముఖ్యపరిజ్ఞానములలో నొకఁటి. పతింవరరాకుమారి చివర కజకుమారుని కట్టెదుట నిలఁబడిపోయినది. కాని యాపె లజ్జాపరవతి. అప్పు డాజవరాలి హృదయప్రపంచమున నొక్క మారుగా వెల్లివిరిసి కళవళపాటుపై జలజలమని గట్లుత్రెంచు కొనుచుఁ బ్రవహించెడు నాయనురాగ నదీనదంబుల వెల్లువల మొత్తమువేగము కొలత కందదు. మనోహరుని బలుకరింప వలయునని యప్పుడాపె యభిలాష. కాని, శాలీనత దుర్వార

మైపోయినది. ఇఁక, నాయభిలాషయు లోపల నుండఁజాలదు. ఎట్లైనను బయటఁబడవలయునని దాని తత్తర. చిట్టచివర కది పులకల నెపమున నా పెగాత్రియష్టినుండి బయటఁబడఁగలిగినది. అది యాసమయదశావిశేషము. అట్టి యవసరంబుల ముగ్ధలకు సర్వసాధారణమైయుండెడు సాత్వికావిర్భావ మిక్కడ నింత యతిలోకసౌందర్యముః దలకొని ధృతిఁగొలుపుచున్నది.

అది యాకాళీవరప్రసాదలబ్ధుని కలము మొనయందలి నునుపుఁదనములోని పాటవము. ఎరమరిక యెరుఁగని వర్ణనా కథనముల చెలిమి యిక్కడఁ బదిలపడి హాయిగాఁ గాలము పుచ్చుచున్నది.

మహాకవికిఁ గల యాావత విజ్ఞానమునకు నీశ్లోక మొక చక్కని నిదర్శనము.

"సంచారిణీదీపశిఖేవరాత్రౌ, యంయంవ్యతీయాయపతింవరాసా;
నరేంద్రమార్గాట్ట ఇవప్రపేదే, వివర్ణభావఁసససభూమిపాలః."
(సర్గ॥ 6. శ్లో॥ 67)

స్వయంవరసదశ్శాలలోఁ బంక్తులు దీర్చియున్న సోఫాలమీాద నాసీనులైన నరేంద్రుల ముంగటఁ బరిక్రమించెడు నాపతింవర రాత్రి సంచరించెడు దీపశిఖవలె నున్నదఁట. రాజపథమున సంచారిణి యగు దీపశిఖ యేయేగృహములను నతిక్రమించునో, యాయాగృహములు తమోావృతములగును. అదే విధమునఁ బతింవరయగు నా యిందుమతి యేయేనరేంద్రుని నతిక్రమించినదో యాయానరేంద్రుఁడు వివర్ణభావమును బొందె

నఁట. ఇక్కడ నొకవిధమయిన మహత్తర సౌందర్యము తాండవించుచున్నది.

పతింవరయగు నాజన్మని తమ్ము నతిక్రమించి చను నప్పుడు నరేంద్రులు తమ యాశలు నిరాశలైనవని విచారించి రను సాధారణ భావమున కిక్కడింత యెనలేని కోమలికమ్ము కదియుటకుఁ దగిన కారణము లేకపోలేదు.

"సంచారిణీదీపశిఖేవ రాత్రౌ" యను నవనవ్య కల్పనయే యిందుకు మూలము. ఆ రమణీయకల్పన యొక వైపున, నిందుమతి మూర్తీభవించిన సాటిలేని యందాల రాశి యని ప్రకటించుచున్నది; మరొక వైపున నది దీపము వెలుఁగు ముందుఁ బ్రకాశించెడు వస్తువులువలె నిందుమతి యందాల వెలుఁగువల్ల నానరేంద్రుల యాకృతులు తులకించిన; వంతి యేకాని, వారి సొగసుందన మాపె కోమలికమ్ముతో నించు కంతయుఁ దులఁదూఁగఁజాలదను గురుతర భావమును నందిచ్చు చున్నది. ఆమాటలు చూపులకుఁ జిన్నవి. కాని, యవి యందిచ్చెడు భావము లనంతములు నప్రమేయములు. సిద్ధహస్తుల రచన లెప్పుడు నట్లే యుండును. మొత్తముమీఁదఁ గాళిదాసుని యూహాప్రపంచ మందాలు విరఁజిమ్మెడు చక్కని యపూర్వ కల్పనలకు జన్మభూమి. అతఁడెప్పుడెక్కడేకల్పనలు పరఁ గింపవలయునో బాగుగా నెరిఁగిన మనీషి.

అర్థి ప్రదాతలగు కొత్స రఘునరేంద్రుల ద్వాంద్వీక ప్రసంగమునందు శ్రవణపేయత కడలుకొని క్రీడించుచున్నది.

అందు లోకము ముఖ్యముగా గ్రహింపఁదగ్గ సదుపదేశ మెంతేని గలదు.

ప్రకృతము కేవలము మచ్చుఁదునకలుగా—

"భక్తిః ప్రతీత్త్యేషుకులోచితా తే,
పూర్వాన్ మహాభాగ! తయాతిశేషే;
వ్యతీతకాల స్త్వహ మభ్యుపేత,
స్త్వామర్థిభావాదితి మే విషాదః." (సర్గ॥ 5. శ్లో॥ 14)
"సత్వంప్రశ స్తేమహితే మదీయే,
వసంశ్చతుర్థోఽగ్నిరివాభ్యగారే;
ద్విత్రాణ్యహాన్యర్హసిసోఢుమర్హన్!
యావద్యతేసాధయితుం త్వదర్థం."
(సర్గ॥ 5. శ్లో॥ 25)

ఈ శ్లోకద్వయి నాహ్వానింపవచ్చును. ఇయ్యెడ నర్థి ప్రదాతల యొక్క నిగ్గయిన మానసిక వైఖరుల యాకృతులు ముద్దుగాఁ బ్రతిబింబించియున్నవి.

మహాభాగ! పెద్దలయెడల నీకుఁ గల భక్తి విశ్వాస ములు నిరుపమములు. కాని, యిప్పుడు నేను నీసన్నిధికి వచ్చి నది కాలముకాని కాలము. ఇదియే నా విచారము. ఇది కౌత్సుని ప్రసంగము.

నాయనా! నాయందు దయయుంచి యెట్లయిన నొక రెండుమూడురోజులు మాయింట నుండుము. ఈ లోగా నీ కొరకు నా శక్తికొలఁదిఁ బ్రయత్నముచేసి చూచెద. ఇది దిలీపనందనుని

ప్రసంగము. పట్టభద్రుఁడు కౌత్సునకుఁ గావలసిన ద్రవ్యము పదునాల్గుకోట్లు. రఘున రేంద్రుఁడు స్వార్థ మెరుఁగని మహాదాత. కాని, యది యెద్దడి సమయము. వారి యుభయుల సమావేశ మును బరీక్షార్థమో యనున ట్లప్పుడే తటస్థించినది. అయినను, జూచియుఁ జూడఁగనే యర్థిభావము మారిపోయినది. తన కెంతయక్కరయున్నను నట్టిపర్యాయమున నరేంద్రుని మన స్సును గక్కసపెట్టఁగూడదని కౌత్సుని నిశ్చయము. తన సన్నిధికి వచ్చిన యభ్యర్థిని రిక్తహస్తములతోఁ బంపివేయఁ గూడదని నరేంద్రుని పట్టుదల. అంతియకాక, యతఁ డున్నతిఁ గాంచిన మహావిద్వాంసుఁడు; కేవలము త్యాగము నిమిత్తమే యర్థమును సేకరించెడు నిక్ష్వాకువంశమునఁ బట్టినవాఁ డితఁడు.

ఇక్కడఁ గేంద్రీకరింపఁబడియున్న యర్థి ప్రదాతల మానసిక వైఖరు, లొక వైపు లోకమున కాదర్శప్రాయములు; మరొక వైపు కాళిదాసుని మానసికతత్త్వపరిజ్ఞానమునకుఁ బరిహ రింపరాని యమోఘ దృష్టాంతములు.

మహాకవి తనకుఁ గల మానసికపరిజ్ఞానము నొక యిక్కడేకాక యితరచోట్లఁ గూడ విరఁజిమ్మియున్నాఁడు. అది రఘువంశమందలి సప్తమ సర్గమందు—

"మనో హి జన్మాంతరసంగతిజ్ఞం" (శ్లో॥ 15)

ఈరూపముగను నభిజ్ఞానశాకుంతలమందలి పంచమాంకమందు,-

"భావస్థిరాణి జననాంతరసౌహృదాని." (శ్లో॥ 2)

ఈ విధముగనే పక్వనీయమై యున్నది. ఇంకను దక్కటి నెలవులఁగూడఁ గనవచ్చును. మొత్తముమీఁదఁ గాళిదాసు గడించిన మానసికతత్త్వపరిజ్ఞాత. భవభూతియుఁ దన యుత్తరరామచరితమందుఁ దనకుఁ గల మానసికతత్త్వపరిజ్ఞానమును నలుఁగడల వెదచల్లియున్నాఁడు. భవభూతి కాళిదాసునకుఁ దరువాతివాఁడు. కాబట్టి యీవిషయమున నితఁడాతని ననుగమించి యుండవచ్చును.

పదముల పొందిక, పాదముల నడక, భావముల గాంభీర్యము, ప్రయోగముల యౌచితి, వాకుల వైచిత్రి, పాలితపాలకుల యితరేతరసంబంధము, శైలీసారళ్యము, అన్వయసౌష్ఠవము మున్నగునవి కొత్త రఘునరేంద్రుల యాగ్మికసంవాదమునఁ గమ్మగాఁ గుప్పించి క్రేళ్ళుదాటుచున్నవి.

కవిత కథాకథనఘట్టములం దొకమాదిరిగను, వర్ణనాపర్యాయముల మరొకమాదిరిగను, యౌగిక సంవాద సందర్భములందు నింకొకమాదిరిగను బ్రిగమించుచుండును. అది హస్తవంతులు వెలువరించెడు కబ్బముల వైఖరి. అట్టి దుర్లభవైఖరి కాళిదాసుని కవితాప్రపంచమునఁ జెక్కుచెదరని దివ్యమైన సప్తభూమికాసౌధము నేర్పరచుకొనియున్నది. కవిశేఖరుని వర్ణనాశక్తి సామర్థ్యము లతని యితర కృతులందు నిగ్గయిన పసిండిసస్యములను ముమ్మరముగాఁ బండించుచున్నవి. రఘువంశమునఁ దదీయములగు కమ్మని మచ్చుఁదునుకలను హాయిగా రుచిచూడవచ్చును. ప్రథమ సర్గమందలి యా

వసిష్ఠాశ్రమవర్ణనయు, షష్ఠసర్గమందలి యా స్వయంవరమండప వర్ణనయుఁ బాఠకశ్రోతల కెంతేని చేతోమోదము నొదవింపఁగలవు.

ఇప్పుడు—

కాలాంతరశ్యామసుధేషు నక్తం,
మితస్తతో రూఢతృణాంకురేషు;
తఏవముక్తాగుణశుద్ధయోఽపి,
హర్మ్యేషుమూర్ఛంతినచంద్రపాదాః.

(సర్గ॥ 16 శ్లో॥ 18.)

ఇది గమనింపఁదగిన శ్లోకము. ఇది యయోధ్యానగరపు టధిష్ఠానదేవత కుశావతి రాజధానిగా రాజ్యము చేయుచున్న కుశరాజమౌళి మ్రోల నిలఁబడి తనకుఁ బాటిల్లిన తన కష్టదశను బురస్కరించి చెప్పుకొనుచున్న ఘట్టములోని శ్లోకము.

శ్రీరామచంద్రుఁడను పేరితో మధ్యమలోకము నేలెడు శ్రీపతి నిజధామము చేరినాఁడు. అంతవరకు నొకే యొక బాటలో స్థిమితముగా జరిగిపోవుచున్న కాలచక్ర మంతట నైమూలగా నడువసాగినది. దానంజేసి యంతయుఁ దారుమారైపోయినది. ఒకప్పుడు ధాళధళ్యముల ధగద్ధగలు కురిపించిన నగరసౌధములు నాఁడు మసిబారిపోయినవి. కూలియుఁ గూలకయున్న గోడలమీఁద నక్కడక్కడ గడ్డి ముండ్లతుప్పలు మున్నగునవి మొలిచి గుబురుగా నలముకొని పోయినవి. అట్టి దుస్సమయమునఁ దొల్లి చేతోహారముగాఁ

బ్రతిబింబించియున్న యాముక్తాగుణస్వాచ్ఛ్యములగు చంద్రకిరణములు కేవల మవేమైనను నిసుమంతయుఁ బ్రతిఫలింపఁజాలకపోయెను. అది కాలదోష మేకాని తదీయ దోషము కాదు.

ఇదంతయు నాఁడు పాడుపడియున్న యయోధ్యానగరపు వైఖరీవర్ణన. ఈ శ్లోకమం దత్తియున్న ప్రత్యక్షరమందును గరుణరసము జలజల జాలువారుచున్నది. కరుణవ్యంజకములగు నిట్టి శ్లోకము లాఘట్టమునం దింకను గలవు.

మరియు—

బాలార్కప్రతిమేవాప్సు, వీచిభిన్నాపతిష్యతః;
రరాజ రక్షఃకాయస్య కంఠచ్ఛేదపరంపరా.

(సర్గ॥ 12 శ్లో॥ 100.)

తామ్రోదరేషుపతితంతరుపల్లవేషు,
నిర్ధౌతహారగుళికావిశదంహిమాంభః
ఆభాతి లబ్ధపరిభాగతయాధరోష్ఠే,
లీలాస్మితం సదశనార్చిరివత్వదీయం.

(సర్గ॥ 5 శ్లో॥ 70.)

ఈ శ్లోకములను బరిశీలింపవలసియున్నది. మొదటిది ద్వాదశసర్గమందలిదగు రామరావణ సంగ్రామసందర్భములోనిది. రెండవది పంచమసర్గాంతమునఁ గాపురమేర్పరచుకొనియున్న వైభాతికవర్ణనమందలిది. శ్రీరాముని బాణమువలనఁ దెగి క్రిందఁబడెడు రావణుని కళేబరమందలి గొంతుముక్కల బారు, ప్రవాహమందుఁ గెరటములవలన ముక్కముక్కలుగాఁ జేయఁబడి ప్రతిఫలించెడు బాలసూర్యుని ప్రతిమవలెఁ గొరలినదఁట.

చెట్ల చిగురుటాకుల యుదరసీమలందుఁ బడిన మంచు నీరు, రఘునందనుని యధరోష్ఠదేశమున నృత్యముచేసెడు నతని దరహాసమువలెఁ దులకించుచున్నదని మహాకవి చెప్పు చున్నాఁడు. చిగురటాకుల మధ్య భక్తి తామ్రవర్ణము గలది.

అందుఁ బడియున్న మంచుజలము నిర్ధౌతహారగుళిక వలెఁ దెల్లఁగా మెరసెడు గుణముకలది. అధరోష్ఠము బింబ సదృశము. దానిమీఁదఁ దెల్లని మల్లెపూలవంటి చక్కని దశన రోచులతో నిండైన దరహాసము మంచిటెక్కుగా నాట్యము చేయుచున్నది. అత్తరుణమున నారెండింటికి సాదృశ్యము. ఆహా! ఎంత చక్కని వర్ణన! కేవలము వడఃబోసిన యతిలోక సౌందర్యమును నీ వర్ణన గుత్తఃగొన్నది. పై వర్ణనయుఁ గడమ లేని యందాలగుత్తి. లోకప్రసిద్ధములగు నీవర్ణనలు కాళిదాసుని ప్రాకృతికవిజ్ఞానసంపదను నలుఁగడల వెదచల్లుచున్నవి.

మత్స్యధ్వజా వాయువశాద్విదీర్ణై,
ర్ముఖైః ప్రవృద్ధధ్వజినీరజాంసి;
బభుః పిబంతః పరమార్థమత్స్యాః,
పర్యావిలానీవ నవోదకాని. (సర్గ॥ 7 శ్లో॥ 40)

ఈ శ్లోక మజకుమారుఁడు వివాహానంతరము సతీసమేతముగా స్వగృహమునకుఁ బోవునప్పుడు మార్గమధ్యమునం దతనికిఁ దక్కటి రాజన్యులకుఁ బనుపడిన సంగ్రామసమయమందలిది.

సమరము బ్రహ్మాండముగా విజృంభించి సాగుచున్నది. రథంబుల మత్స్యధ్వజమ్ములు వాయువశంబున విదీర్ణంబులగు

ముఖంబులతోఁ బ్రివృద్ధధ్వజినీరజంబులను గ్రోలుచున్నవి. ఆ సమయమున నవి పర్యావిలంబులగు నవజలంబులను దాగు యథార్థమత్స్యములవలెఁ దులకించుచుఁ జక్కని హాయులు వెద చల్లుచున్నవఁట. ఈ వర్ణన యెంతయు ననుభవసిద్ధమయి తనివి తీరని ముద్దులొలికించుచున్నది.

> తద్వ్యోమ్ని శతధాభిన్నం, దదృశేదీప్తిమన్ముఖం;
> వపుర్మహోరగస్యేవ, కరాళఫణమండలం.
> (సర్గ॥ 12 శ్లో॥ 98)

ఈ శ్లోకము రామరావణసంగ్రామ ఘట్టములోనిది. అది రామ రావణులు ముఖాముఖి పోరితమాడుచున్న సమయము. శ్రీరామచంద్రుఁ డప్పుడు తన ప్రియాశోకశల్యనిష్కర్షణౌషధమ్ము బ్రహ్మమ్ము నగు నొక యమోఘాస్త్రము నెదిరి నుద్దేశించి పరఁగించెను.

అంతట నాదివ్యాస్త్ర మ్ముప్పరవీధి కెగసి బహుచ్ఛేద ములయి దీప్తులు విరజిమ్మెడు ముఖంబులును భయమొదవించు పడగలపంక్తియుఁ గల కాయముతో నడరియుండెడు మహో రగముభంగి పశ్యప్రజ కగపడెనఁట. ప్రయుక్తంబయిన బ్రహ్మాస్త్రపు విజృంభణ మెట్లుండునో నేఁడెవ్వరు ననుభవ పూర్వముగాఁ జెప్పలేరు.

ఇఁక నేఁటి కెంతయో చిరత్నుఁడగు కాళిదాసుకూడఁ దదస్త్రమును బ్రత్యక్షముగాఁ జూచియుండఁడు. కురుక్షేత్ర మహాసంగ్రామముతో నట్టి దివ్యాస్త్రశాస్త్రమంతయు రూపు

వ్రాసినది. అది యీనాఁటి ప్రపంచమహాసంగ్రామము. దుర దృష్టవశంబున నేఁడు హైడ్రోజను ఆటముబాంబుల మహాసంగ్రామము తలయెత్తినచో నేఁటి నాగరికతకంతకు నెట్టిగతి పట్టునో, యీసమరసంభూతివల్ల నాఁటి నాగరికత కట్టి దుర్గతి పట్టినది. అంతతో భారతఖండాధిక్య మడుగంటుటయే కాక, దేశ మాదెబ్బనుండి యింతవరకుఁ గూడఁ గోలుకోలేకపోవు చున్నది. మరి, కాళిదాస కవీంద్రుఁడు కురుక్షేత్రమహాసంగ్రామ కాలమునకుఁ జాల యిటీవలివాఁడగు విక్రమార్క సార్వభౌముని యాస్థాన కవి. అందువల్ల బ్రహ్మాస్త్రము నతఁడు స్వయముగఁ జూచియుండఁడు. అయినను నాబ్రహ్మాస్త్రపు వర్ణన విశేషముగాఁ బ్రత్యక్షానుభూతిఁగల కవిశేఖరునిదిగా గోచరించుచున్నది.

బ్రహ్మాస్త్ర మెన్నఁడుఁ జూచియెరుఁగని వారికిఁగూడ నిది కనఁబడియుఁ గనఁబడగ నె యొక్కవైపు నొకవిధమగు భయకంపములను మరొకవైపు నపూర్వమగు విస్మయమును దల కొలుపఁగలదు. ఇందుఁగల మహత్తరశక్తి యట్టిది.

అపరిచితవస్తువైనను బరిచితవస్తువైనను గవి కలమునకుఁ జిక్కినప్పు డది పాఠకశ్రోతలమీఁద మంచి లగ్గయిన పలుకుబడి సాగింపఁజాలియుండవలెను. అట్లుండఁజాలనినాఁడు దానికిఁ గవిత్వ నామముఁ దలకొనుట కర్హతయుండదు. కాని, యది సిద్ధిమంతులగు కవిరాజులసొమ్ము. కాళిదాసు బ్రహ్మాండ రాజ్యవిభవములతో నడరియలరెడు విక్రమాదిత్యసార్వభౌముని

ద్యాస్థానకవియగుట నతఁడు స్వయముగ రణక్షేత్రములను దర్శించియుండవచ్చును. రఘువంశమునందుఁ బలుచోట్లఁ గసి మెసఁగియున్న జన్యవర్ణనఁబట్టి తిలకించినను రణక్షేత్ర మతనికి దృష్టపూర్వమనియే చెప్పవలెను. అక్కావ్యమునఁ దదీయ చిత్రకృతి యించుమించుగా మూడునాలుగయిదేడు పండ్రెండు సర్గములందును బదునేను పదునారు సర్గములందును వెల్లివిరిసి యున్నది. ఈ జిజ్ఞాసావసరమున—

సచ్ఛిన్నమూలక్షతజేన రేణు,
స్త్రస్యోపరిష్టాత్పవనావధూతః;
అంగారశేషస్యహుతాశనస్య.
పూర్వోత్థితో ధూమఇవావభాసే.

(సర్గ॥ 7, శ్లో॥ 43)

ఈ శ్లోకము నొకించుక తడివి చూచుట సముచితము. ఇది యజకుమారుఁ డెదిరివర్గముతోఁ బోరుచున్న సందర్భమందలి శ్లోకము. సమరము సంకులముగా నవఘళించి సాగుచుండెను.

జన్యక్షేత్రమంతయు శోణితమయమైపోయినది. ఇఁక రేణువునకు భూమిమీఁదఁ దావులేకపోయెను. అందువల్ల నది యాక్షతజమునకుఁ బైగాఁ బవనావధూతమై నలుఁగడలఁ గ్రిస్సుకొనుచుండెను. అప్పుడా దృశ్య మంగారశేషముఁగల యగ్నియందుఁ దొలుతో ల్తు బైకిలేచి దశదిశల నలముకొనెడు పెన్పొగవలెః దురంగలించినదఁట. నిపీయ మనోజ్ఞమగు నీ యనుభవసిద్ధచిత్రకృతియుఁ గవికులోద్వహుని రణరంగపరిచితికి సాక్షీభూతమగుచున్నది. అనుభూతిలేని కేవలున కింతటి

చేతోహరవర్ణన సిద్ధించదు. ఇది జనసామాన్యము చెప్పకొనెడు మాట. నైసర్గికప్రతిభఁ గల సిద్ధహస్తులగు కవులకు నొక విధమగు దివ్యదృష్టియుండును. దాని సహకారమున వారు తమరు చూడని పదార్థమును గూడఁ జూచిన పదార్థముగాఁ జిత్రింప గలరు. మనుచరిత్రలోఁ గల పెద్దనామాత్యుని హిమాచలవర్ణన యాశక్తికిఁ జెందినదే. అందువల్లనే యది యంత రమణీయముగాఁ బొసఁగియున్నది.

ఇఁకఁ గేవల భగవత్ప్రసాదలబ్ధుఁడగు కాళిదాసుని బురస్కరించి వేరుగఁ జెప్పనక్కరలేదు. అతఁడేది ముట్టినను అది మంచి నిగ్గయిన బంగారమే కాఁగలదు. అందువల్లనే యతని వర్ణనలెందుఁజూచినను నంతటి యతిలోకసౌందర్యమును దాల్చియున్నవి.

కొందరు కవులు పరోక్షవస్తువుల మాటయటుంచినను దాము నిత్యము జూచెడు ప్రత్యక్షవస్తుజాతమును గూడ సరిగా వర్ణింపఁజాలరు. వారు కేవలము కృత్రిమకవులేకాని, నైసర్గిక ప్రతిభతోఁ గూడిన సిద్ధహస్తత గల మహాకవులు కారు. ఇఁకఁ గవితాప్రపంచమునకుఁ జెందిన దివ్యదృష్టి వారికిఁ గడుంగడు దవీయము. అటువంటప్పుడు కేవల మదృష్టపూర్వమగు బ్రహ్మాస్త్రమును గాళిదాసకవీంద్రుఁ డింత యిదిగా వర్ణింప గలిగి నాఁడు కాబట్టి, యతనియూహాశక్తి యనన్యసామాన్యమని చెప్పఁదగును. ఇట్టి రమణీయచిత్రీకృతు లక్కావ్యమున నింకను గలవు. నవమసర్గమునందు వసంతవర్ణన కలదు. అదియు విను

వాదవింపని యందచందములతోను నూహింపనలవికాని చాతు రీచమత్కారములతోను సంతరింపఁబడియున్నది. అందు నిబద్ధమై యున్న పదజాలమును శ్రుతి సుఖావహి.

రఘువంశమున, నందు ముఖ్యముగా, నేకాదశ ద్వాదశ సర్గములందుఁ గవికులశేఖరుని కథనప్రౌఢిమ ప్రత్యగ్రదీధితుల గ్రుమ్మరింపఁగల యత్యున్నతస్థాయి నధివసించియున్నది. బహు వైశాల్యముఁగల యుద్గ్రంథము రామాయణము.

తదీయేతివృత్త మక్కడ మసలినంత స్వేచ్ఛగా రఘు వంశమున మసలఁజాలదు. రఘువంశము రామాయణమంత పృథులకృతి కాదు. అంతేగాక, దానియం దాకథకు మిగిలిన తావుకూడఁ గుశలమే. అటువంటప్పుడు తదీయ రచయిత యొక మామూలు కవి యైనచో నందిమిడియున్న తత్కథా కథనసౌందర్య మెంత దిగజారియుండవలయునో యంత దిగ జారియుండెడిది. కాని, యతఁ డద్వితీయప్రజ్ఞాశాలియగు కాళి దాస మహాకవి. అందువల్ల నాగాథ యక్కడెంత నిర్వృతితో విహరించుచున్నదో రఘువంశమందును నంత హాయిమై వచా రించుచున్నది. అయినఁ దదీయవిహారము రామాయణమునం దొకమాదిరిగను రఘువంశమునం దింకొకమాదిరిగను నున్నది. అయినను, దాని ప్రకృతిసౌందర్యమునకుఁ బరిపుష్టియేకాని, యిసుమంతయుఁ గడమ చూపట్టదు.

రామాయణగ్రంథమున విచ్చలవిడిగాఁ దిరిగెడు తదితి వృత్తమెల్ల రఘువంశమునందుఁ గేటాయింపఁబడియున్న

యొక యారుసర్గములలో నిమిడియుండవలయునన్న చో, నదం తయుఁ గోరీకృతము గావలయును.

అది యేదోవిధముగాఁ గోరీకృతమైన నేమియుఁ బ్రయోజనముండదు. కాబట్టి యాకోరీకృతి యెంతేఁ బదిలముగా నుండవలయును. ఇత్తరుణమున—

కృచ్ఛ్రలబ్ధమపి లబ్ధవర్ణ భా,
క్తందిదేశ మునయే సలక్ష్మణం;
అప్యసుప్రణయినాం రఘోకులే,
న వ్యహాన్యత కదాచిదర్థితా

(రఘు॥ సర్గ॥ 11. శ్లో॥ 2)

సాసీతాసన్నిధావేవ, తంవవ్రేకథితాన్వయా;
అత్యారూఢోహినారీణామకాలజ్ఞోమనోభవః.

(రఘు॥ సర్గ॥ 12. శ్లో॥ 33.)

ఈ శ్లోకద్వయి సమీాత్మ్యము. ఒకరోజున విశ్వామిత్రుఁడు దశరథునిపాలి కరుదెంచి తన యధ్వరవిఘాతశాంతినిమిత్తము లక్ష్మణునితోఁగూడ రామభద్రుని దనవెంటఁ బంపవలసినదని యతని నభ్యర్థించెను.

రామచంద్రుఁడు దశరథునకుఁ గడుంగడు కృచ్ఛ్రలబ్ధుఁడు. మరియుఁ బసికూన. అయినను, రారాజు వెంటనే యతని నతఁడడిగినట్లుగా నతని వెంటఁ బంపివైచెను. ఔనుమరి, యవసరమగుచోఁ బ్రాణముల్నైనత మర్పించెడు రాఘువవంశీయులు దేహీయని కోరెడు నర్థులకు లేదని చెప్పఁజాలరు.

కౌశికుఁడు కోరియుఁ గోరఁగనే యాకోరికను రారాజు తత్ క్షణంబ పూరగించి వైచెనని పై శ్లోకము వాచించుచున్నది. కాని యిదేఘట్టము వాల్మీకి రామాయణమున—

విప్రియుక్తోహి రామేణ, ముహూర్తమపినోత్సహే;
జీవితుం మునిశార్దూల! న రామంనేతు మర్హసి.
(బా॥ కా॥ సర్గ॥ 20 శ్లో॥ 8.)

పూర్వమర్థంప్రతిశ్రుత్య, ప్రతిజ్ఞాం హాతుమిచ్ఛసి;
రాఘవాణామయుక్తోఽయం, కులస్యాస్యవిపర్యయః.
(బా॥ కా॥ సర్గ॥ 22 శ్లో॥ 2.)

ఈ విధముగా దర్శన మొసఁగుచున్నది.

కాళిదాసకవీంద్రుని దశరథునివలె నాదికవీంద్రుని దశరథుఁడు కుశికనందనుని కోరికను వెంటనే నెరవేర్చలేదు. అది నెరవేరుటకు ముందు విశేషముగాఁ గొన్ని చర్చోపచర్చలు జరిగినవి.

"రామచంద్రుఁడు లేనిచో నొకక్షణమేని జీవింపఁ జాలను. కాబట్టి దయయుంచి నా ముద్దులపట్టిని గొంపోవ"ద్దని రారాజు; "ముందు నిచ్చెదనని వాగ్దానముచేసి యిప్పుడు సంకోచించుచున్నావు. ఈవిపర్యయము నీ వంశమునం దింతవరకు నెన్నఁడుఁ దలయెత్తలేదు. ఇది నీకిప్పు డెంతమాత్రము తగ" దని ఋషిపుంగవుఁడును గంటలకొలఁదిగా నిండుసభలో వాదోపవాదములు జరుపఁగాఁ జివరకు వసిష్ఠాదులుకూడ జోక్యము చేసికొన్న తరువాత నెట్టకేలకు దశరథమహారాజు విశ్వా

మిత్రుని యర్థిత్వము నమోఘమొనర్చెను. ఇంత విస్తృత విషయమును గాళిదాసు రఘువంశమునం దొకేయొకశ్లోకమున టూకించి వైచినాఁడు. పైగా నాశ్లోకమున కర్థాంతరన్యాసాలంకారము నొకదానిని జతపరచినాఁడు. ఈ విపులకథ యాశ్లోకమున నల్పీకరింపఁబడినను, దానిని వెంబడించియున్న యాయలంకృతి నెంతేఁ జక్కఁగఁ బ్రతిబింబించుచున్నది.

ఎవరే నడుగకపోవలయునే కాని, యడిగినచో నసువులనైనను నిచ్చెదు విశ్వదాతలు రాఘవులని యాయలంకృతి వక్కాణించుచున్నది. నిజమే, కాని, యెంత మహాశయుఁడైనను సహజముగాఁ దన ప్రాణముల నితరుల కప్పనము చేయునప్పుడు కొంచెమైనను గాసిపడకపోఁడు.

అది మానవప్రకృతి. మానవత్వ మున్నంతవరకు నది తొలఁగఁజాలదు. అట్లే, దశరథపృథ్వీపతి తన యసువులతోఁ దుల్యుఁడైన, కాదుకా, దంతకంటెను నధికుఁడైన తన ముద్దుల పట్టి విశేషించి యాచిరుతవయసునం దంతటి ఘోరారణ్యభూముల కాఋషిపుంగవుని వెంట నంపుటకుఁ జాల గాసిపడెను. కాని రఘువంశీయులు విశ్వదాతలు. కనుకఁ దుదకు సమ్మతించి రారాజు మునిరాజును గృతార్థుఁజేసె నను మహత్తరార్థమొకఁడాయలంకృతి నుద్యోతించుచున్నది. ఇఁక, రెండవ శ్లోకము.

అదియుఁ బైదానివలె నర్థాంతరన్యాసముతోఁ బొందుపరపఁబడియున్నది.

సీత దగ్గరనే యున్నది. అయినను రాముని బ్రతిమాలుట మొదలుపెట్టినది మదనాతుర యగు శూర్పణఖ. స్త్రీలు తమ మదనవ్యథ యత్యారూఢమగునప్పు డకాలజ్ఞత్వమైఁ బ్రవర్తింతురఁట.

ఆదికావ్యమందు శూర్పణఖకు శ్రీరామునకు నడుమ జరిగిన సంభాషణము మిక్కిలి యెక్కువగ నున్నది. అది రఘువంశమందుఁ గైకథవలెనే సమయానుకూలముగఁ దగ్గింపఁబడియున్నది. అయినను నా తగ్గింపు పై తగ్గింపుమాదిరిగా నా యర్థాంతరన్యాసమునం దతి నిగూఢముగఁ గాపురముచేయుచున్నది. అత్యారూఢంబులగు మన్మథవ్యథలతో ఘనీభవించి యున్న యాయమీయసి యాయమీయునితోఁ బ్రసంగించునప్పుడు నూరెల సీత యున్నదని యెంచకపోవుటయే కాక, యింతస్త్రైపైన దంత స్త్రైపైన దిట్లు మాట్లాడుచుంటి నట్లు మాటాడుచుంటి నను సమయవాగౌచితిఁగూడ సరకుఁగొనలేదను నొకభావమును నాయలంకృతి ప్రకటించుచున్నది. కాబట్టి యాయలంకృతి నరయు మనీషు లారక్కసి శ్రీరామునితో సమయాసమయజ్ఞతమాలి చాలసేపు బహువిధములఁ బ్రసంగించి యుండునని తలంపకపోరు.

అయినప్పుడది తదీయ శ్లోకమున నల్పీకృతమైయున్న యామూలకథావైపుల్యము నతిచోద్యముగా విమిడించుకొని యవసరము వచ్చునప్పు డతిమనోహరముగా దానిని బ్రదర్శించుచున్నదని నిస్సంశయముగాఁ బ్రవచింపవచ్చును.

శ్రీరామచంద్రునకు సుగ్రీవునకు బంధుత్వ మేర్పడిన తరువాతి సందర్భమందుఁగల యీ—

స హత్వావాలినం వీర, స్తత్ప దేచిరకాంక్షితే;
ధాతో స్థానఇవా దేశం, సుగ్రీవం సన్న్యవేశయత్.
(రఘు॥ వర్గ॥ 12 శ్లో॥ 58)

ఇత స్తతశ్చ వైదేహీం, మన్వేష్టుం భర్తృచోదితాః;
కపయశ్చేరురా ర్తస్య, రామస్యేవ మనోరథాః.
(రఘు॥ వర్గ॥ 12 శ్లో॥ 59.)

శ్లోకముల నిఁకఁ బరిశీలింపవలసియున్నది. శ్రీరాముఁడు వాలిని వధించి సుగ్రీవునకు సింహాసనమొసఁగెనని పై శ్లోకము నుడువుచున్నది. పిమ్మటఁ గపిసేనలు భర్తృచోదితములై వైదేహిని వెదకుటకు బయలుదేరి పలుచోట్లఁ దిరిగినవని క్రిందిశ్లోకమనుచున్నది.

ఇది రఘువంశమందలి స్థితి. ఇఁక వాల్మీకి రామాయణమందలి స్థితి—

స కాలం పరిసంఖ్యాయ, సీతాయాః పరిమార్గణే;
కృతార్థః సమయంకృత్వా, దుర్మతిర్నావబుధ్యతే.
(వర్గ॥ 30. శ్లో॥ 69.)

త్వంప్రవిశ్యచ కిష్కింధాం, బ్రూహివానరపుంగవం;
మూర్ఖంగ్రామ్యసుఖేస క్తం, సుగ్రీవం వచనాన్మమ.
(వర్గ॥ 30. శ్లో॥ 70.)

ఇట్లున్నది.

సుగ్రీవుఁడు కొంతగాథ జరిగిన పిమ్మటనే కాని, తాను రాజైన వెంటనే శ్రీరాముని పనియందు శ్రద్ధ వహించియుండ

లేదని యాదికావ్యము నొక్కి నొక్కి చెప్పుచున్నది. వానర పుంగవుఁడు తాను రాజుకాఁగనే "యిదిగో సీతాన్వేషణము నకుఁ దగిన యేర్పాట్లు చేయించుచున్నా"నని శ్రీరాముని ముంగట మాట్లాడినాఁడు. కాని యతఁడంతటఁ గేవల గ్రామ్య సుఖాసక్తుఁడై యంతయు మరచిపోయినాఁడు. ఇదిగో యదిగో యని యెంతకాలము నిరీక్షించినను నేమియుఁ బ్రయోజనము లేకపోయినది. తుదకుఁ బరమార్థమును దెలియఁగోరి యనుజుని సందేశమిచ్చి కిష్కింధకుఁ బుత్తెంచి నాఁడు శ్రీరామచంద్రుఁడు.

కాని, కేవలము మూర్తీభవించిన మహోగ్రరాశిగా నగపడెడు నారామానుజుని మోల నప్పుడు తగినంత ధైర్య సాహసములతో నిలఁబడి మాట్లాడఁగలవారెవరక్కడ? ఎవ్వ రును లేకపోయిరి. భయకంపములతో సుగ్రీవుఁడు నిలువునఁ గొయ్యఁబారిపోయినాఁడు.

అప్పుడిఁకఁ బట్టమహిషి తారయొక్కతె మిగిలినది. ఆమె లక్ష్మణుని పాలి కరిగి వినయవిధేయతాచాతుర్య ములతో—

నకోపకాలః క్షితిపాలపుత్ర! నచాతికోపః స్వజనేవిధేయః;
త్వదర్థకామస్యజనస్యతస్య, ప్రమాదమప్యర్హసివీర! సోఢుం.
(వా॥ రా॥ సర్గ॥ 33 శ్లో॥ 50॥)

ఇట్లు ప్రసంగింపమొదలిడెను. క్షితిపాలపుత్ర! ఇది కోప సమయముకాదు. మరియుఁ గావలసిన వారలయెడ నతి

కోపము విధేయమును గాదు. అంతేగాక, వానర పుంగవుఁ డెప్పుడు మీకార్యసిద్ధినే కోరుచుండును. ఓవీర! అట్టి యుత్తమ మిత్రుఁడొకవేళ దైవికముగాఁ బ్రమాద మొనర్చినను మీబోఁటి మహామహితాత్ములు తప్పక సహింపవలయును. ఇది తార యుపన్యాసమందలి చోద్యపు ధోరణి. మరియు నామె గడిదేరిన వాగ్మిని.

లక్ష్మణుఁడు తారయొక్క వాక్చాతుర్యపు ధోరణివల్లఁ గొంత శాంతించెను. అయినను జివరకుఁ గపిరాజున కతని చివాట్లు తప్పలేదు. కావలసినదంతయు నైన పిమ్మటఁ గపినాథుఁడు జగన్నాథుని ప్రయోజనమునందు శ్రద్ధ వహించెను.

మూలమునం దింత విపులతరముగాఁ జెప్పఁబడు గాథ రఘువంశమునందంత కనీయముగా సూక్ష్మీకరింపఁబడినది. ఇఁక సుగ్రీవుని విజయమిచ్చి రాజధానికిఁ బంపి వేసినపిమ్మట శ్రీరామ చంద్రుఁడు సలక్ష్మణుఁడై యాఋష్యమూకాద్రిఁ గాలముఁ బుచ్చవలసివచ్చెను. అది ప్రావృట్కాలము. అతఁ డొంటి గాఁడు. అందువల్ల నప్పు డతని భావపరంపర వివిధగతుల నాశ్రయింపవలసివచ్చెను. తదుపరి మెల్లఁగా శరత్కాలము వచ్చినది. సీతాన్వేషణమునకుఁ గపివాహినులు దశదిశలకు బయలుదేరవలసిన సమయమది. కాని కపిరాజప్పుడు ప్రమత్తతలో నిమగ్నుఁడైయుండుట నట్టి సూచన లెవ్వియుఁ గనఁబడకుండెను. అది నరనాథుని వంతకు మరింత కారణమయ్యెను.

ఈ గాథ రఘువంశమునఁ గనఁబడదు. కాని—

ఇత_స్తతశ్చ వైదేహ్యా, మన్వేష్టుం భర్తృచోదితాః;
కపయశ్చేరురా_ర్తస్య, రామస్యేవ మనోరథాః.

ఈ శ్లోకమం దిమిడియున్న యుపమలో నిదంతయు బహు చమత్కారముగా నణఁగియున్నది.

ఒక యిదేకాదు. ఇంచుమించుగాఁ గిష్కింధకాండమంతయు నీయుపమాలంకృతి నిండుగాఁ బ్రతిబింబించుచున్నదన వచ్చును. ఈ విధముగా నొక వైపు మూలకథను బహుజాగ్రత్తతోఁ గ్రోడీకరించుచు, మరొక వైపు గ్రోడీకరింపఁబడిన ఘట్టములను వీలైనంతవరకు నుపమార్థాంతరన్యాసాద్యలంకారములఁ జేతే మోదముగాఁ బ్రతిఫలింపఁజేయుచుఁ బొంకము చెడకుండఁ గ్రొంగ్రొత్త చక్కఁదనంబుతో నుట్టిపడునట్లు రామాయణము నంతను దన రఘువంశమునందు . విడియించినాఁడు మహాకవి కాళిదాసు. అలంకారములను సొగసుగా నుపయోగించుట యందును గథాగమనికల పొడిగింపు తగ్గింపులయందును గాళిదాసు కడుంగడు హా_స్తవంతుఁడు.

మొ_త్తముమీఁద మహాకవి తన కావ్యమందు రామాయణకథను సూక్ష్మీకరించునప్పుడు వసివాళ్ళులేని క్రొంగ్రొత్త చక్కఁదనంబుల నొరగఁబోసెడు మంచి కమ్మని కవితా శిల్పమును రూపొందించినాఁడు.

ఇంతకు నతఁడయ్యెడఁ గనిపెట్టి యవలంబించిన యామురిపెము పోకడ లట్టివి. మహాకవి కాళిదాసు వాల్మీకియందు మంచి భ_క్తివిశ్వాసములు గల బుద్ధిమంతుఁడు. అతఁ డాదికవి

యెడల నెంత వినయవిధేయతలు గలవాఁడో సౌందర్యోపాసన యందంత నియమ నిష్ఠలు గల మనీషి. అందువల్ల నతఁ డొక వైపు తొంటి కవీంద్రుని ధిక్కరింపఁజాలఁడు; మరొక వైపు కవితా సౌందర్యమును విడిచిపెట్టను జాలఁడు. అది పరిష్కరింప వశముకాని చిక్కుసమస్య. వెండియు నొకపర్యాయము—

కృచ్ఛ్రలబ్ధమపి లబ్ధవర్ణ భా,
క్త్రంది దేశమున యేసలక్ష్మణం;
అప్యసుప్రణయినాం రఘోః కులే,
న వ్యహాన్యత కదాచిదర్థితా.

విప్రయుక్తోహి రామేణ, ముహూర్తమపినోత్సహే;
జీవితుం మునిశార్దూల! నరామం నేతు మర్హసి.

ఈ శ్లోకమిథున మరయవలయును.

పై శ్లోకము రఘువంశీయము. క్రింది శ్లోకము రామాయణస్థము. కుశికనందనుఁడు కోరియుఁ గోరఁగనే రారాజతని కోరికను నెరవేర్చినట్లు రఘువంశశ్లోకము చెప్పుచున్నది.

అదికాదు. ఎన్నో రాద్ధాంతసిద్ధాంతము లయినపిమ్మ టనే కాని, వెంటనే యతని కామ్యము నెరవేరలేదు సుమా యని రామాయణ శ్లోకము నుడువుచున్నది. ఇప్పుడు పరస్పర విరుద్ధమొకఁడు తటస్థించినది. ఇఁక దీనికి బహులోక్యముగా నుద్వాసన చెప్పినఁగాని సిస్సలైన పరిష్కృతి నిష్పన్నము కాఁజాలదు. "త్యాగాయ సంభృతార్థానా" మని కాళిదాసు ప్రథమ సర్గమునందు వర్ణించిన యిక్ష్వాకుల యింటివాఁడు దశరథ

మహీపతి. అంతేకాదు, కేవలము జగన్నాథుఁడగు దశకంఠారి కతఁడు కన్నతండ్రి. అస లిక్ష్వాకులే యాచకులను వట్టిగాఁ బంపఁజాలని మహనీయప్రకృతిఁగల దివ్యపురుషులు. అటువం టవ్వం డట్టి కులమునం దేకైకపుత్రుఁడై కారణమానుషమూ ర్తిగా నవతరించిన కేవల పరమాత్మమూర్తికి సాక్షాత్తు కన్న తండ్రియైన దశరథమహీపాలుఁడు విశేషముగా విశ్వామిత్రుని వంటి యర్థి మహనీయులపట్ల నెంత యుదాత్తతఁ గనఁబరచ వలయును ?

అది భావనాదురాపము. అయినను, దేవీవరప్రసాద లబ్ధుఁడగు కాళిదాస కవీంద్రుని భావన కది కడుంగడు సుగ మము. అది యతని ప్రత్యేకత. దానంజేసి యతని దశరథుఁ డడుగుటయే తడవుగాఁ గుశికనందనుని యీప్సితమును సఫల మొనర్చెను. కాళిదాసు రఘువంశమందలి నాల్గవ సర్గమందు—

... "ఆదానంహిత్యాగాయ, సతాంవారిముచామివ".

అని చెప్పియే యున్నాఁడు. దశరథునివంటి యుత్తమపాత్రలను జిత్రించునప్పు డతఁ డీనిరుక్తి నతి జాగ్రుతితో వర్ణించియుండ వచ్చును. ఏదెట్లున్నను మొత్తముమీఁదఁ గాళిదాసుని కౌస ల్యాపతి మంచిధీరోదాత్తుఁడుగాఁ జోషింపఁబడినాఁడని చెప్పఁ దగును. అయినచో, నాదికవీంద్రుని కౌసల్యాపతి? ఉండవలసిన చిక్కంతయు నిక్కడనే యున్నది.

రామాయణము కేవల కావ్యతనే కాక, పురాణతా శాస్త్ర తాదికముఁగూడఁ గల యుద్గ్రంథము. పురాణమనఁగాఁ బ్రాచీన

చరిత్రఁ గల గ్రంథము. ప్రాచీనమైనను అర్వాచీనమైనను జరిత్ర చరిత్రగానే నడువవలయును.

సాధారణముగా లోకములోఁ దల్లిదండ్రులు తమకు లేకలేక కలిగిన యపత్యమును విడిచి యొకక్షణమైనను నుండఁ జాలరు. అట్టియెడలఁ బశ్చిమవయస్సునం దతికష్టముమీదఁ బడసి యుల్లారుముద్దుగాఁ జూచుకొనుచున్న పెద్దకుమారుని దెలిసియుఁ దెలియని యాచిన్నయీడునం దంతటి ఘోరారణ్యభూముల కొకజడదారివెంట నట్లు బంపుట కప్పుడా కన్నతండ్రి యెంతేఁ గొందలపడి యుండ వచ్చును. అది మానుష తత్త్వము. కావున వాల్మీకిమహర్షి తన కృతి యందు దశరథుని పాత్ర నట్లు చారిత్రకస్థితి చెడకుండ మానుష ప్రకృతి కనుగుణముగా రూపించి కట్టకడకు మహాశయునిగాఁ జిత్రించినాఁడు. మరియు రామాయణము కేవల మాయొక్క కథకే కేటాయింపఁబడిన యుద్గ్రంథము. అందు వల్ల నతని కట్లు వ్యవహరించుటకు నవకాశము చిక్కినది. చరిత్రస్థితియుఁ దోడ్పడినది.

ఇఁక రఘువంశము కేవలము కావ్యము. మరియు నది వివిధకథలగుచ్ఛము; కాని, యొకేయొక కథకుఁ బ్రత్యేకింపఁబడిన కృతి కాదు. అందువల్ల రామప్రేషణవిషయమున దశరథునకు విశ్వామిత్రునకు మధ్య జరిగిన యాదీర్ఘసంవాద మక్కడ జరుగఁజాలదు.

కాని, దశరథుని పాత్రి యుత్తమపాత్రిగాఁ బోషింపఁ బడవలయును. ఇఁకప్పుడు మహాకవి యేమిచేయవలయును? ఎప్పుడైనను, మూలకథను సూక్ష్మముగాఁ గుదించి చెప్పునప్పు డందలి పాత్రిచిత్రణమును వెంటనే తేల్చివేయఁదగును. దానంజేసి మహాకవి ఋషీశ్వరుఁడు వచ్చి కోరఁగనే జనేశ్వరుఁ డతని కోరికను దీర్చివైచెనని యానుదీర్ఘగాథ నొక రెండుముక్కలతో ముగించివైచెను. అంతతో నతఁడూరుకొనలేదు. అర్థాంతరన్యాస మను నొక చక్కని నగయుం దావిపుల గాథ యంతయు నింపితముగ నిమిడి యరచాటుగఁ బ్రతిబింబించునట్లు వ్యవహరింపఁగలిగినాఁ డామహామహుఁడు. అదంతయుఁ బైన నావిష్కరింపఁబడియే యున్నది. మరియు, "కృచ్ఛ్రిలబ్ధమపి" యను నీసమస్తపదవిశేషణమందలి భావశీకరములును నాయాభరణమందుఁ గల భావకణంబులకుఁ జేతో మోద మొదవించుచున్నవి.

అందువల్లఁ, బాత్రిపుష్టి మహత్తరముగఁ గుదిరినది. కోఁడీకృతికి నొకవిధమగు రమణీయతయుఁ దలకూడినది. మహాకవి కాళిదాసు తనరఘువంశమునందు రామాయణము నంతను గాదు కాని యందుఃగల ఘట్టములలోఁ గొన్నింటినైనను బూర్తిగ వ్రాయవచ్చును.

కాని వీలగునంతవరకు నతఁడట్లు చేయలేదు. అందు కతని కాదికవీంద్రునియందుఁగల యాయపారభక్తివిశ్వాసములే మూలము. ఆయపారభక్తివిశ్వాసముల నతఁడింకొక

క్రొత్తబాటను బట్టవలసివచ్చినది. అదియే క్రోడీకరణము. అదియు మంచి ప్రేమైన యందచందములను నలుగడల వెద చల్లెడు క్రోడీకృతియే కాని యేదో యొక మామూలు క్రోడీకృతిమాత్రము కాదు. ఆ విధముగాఁ గాళిదాసు భక్త్యుపాసనలోను సౌందర్యోపాసనలోను వ్యత్యాసము లేని సంపూర్ణసిద్ధిఁ బడసి శాశ్వతముగాఁ గృతార్థుఁడైనాఁడు. మొట్టుకు లోకమున కొక నవ్యకృతియు లభించినది.

రామరావణులకు నడుమ జరిగిన పోరాటము నాఁటి ప్రపంచమహాసంగ్రామము. అం దేకైకవిజేత జగదీశ్వరుఁడగు శ్రీరామచంద్రమూర్తి. కేవలము మూర్తీభవించిన యోపికలగుంపు సీతాసతీమణి.

అంతతో నామె యిడుమలు జర్ఝరితములై చూర్ణములై మటుమాయమైపోయినవి. వనవాసమునకు నిర్ణీతమైన గడువు చేరుగడకు వచ్చినది. తదీయ ప్రయోజనమును ముగిసినది. ఇఁక విజేత కళత్రబంధుమిత్రపరివారసమేతముగా నెకాయెకి నయోధ్యకుఁ బోవలసియున్నది. అందుకుఁ దగిన శీఘ్రయానము విమానము. నవలంకాధిపతి విభీషణుఁడు దానిని వెంటనే తీసికొనివచ్చినాఁడు. జగత్పతి కేమి కొదువ! ఎప్పుడేది కావలయునన్న నప్పుడది సిద్ధముకాఁగలదు. అప్పుడు విజయోత్సాహము నలువైపుల వెల్లివిరిసి చేతోమోదముగ నృత్యమొనర్చుచుండగా నందరు నయోధ్యాభిముఖులై బయలుదేరినారు. ఆనాఁడు నిరంతర పుష్పవృష్టివల్ల నూర్ధ్వలోకమునకు

నిరవధిక విజయగేయములవల్ల మధ్యమలోకమునకును నేమియుఁ దీరికలేకపోయెను. అది యొక యపూర్వ సువర్ణయుగము.

సీతారాముల కది యితరేతరముగఁ జిరకాలమునకుఁ బొసఁగిన సంయోగ సమయము. ఆనాఁడా యాదర్శ సతీపతుల హృదయోత్కర్షతకు సరిహద్దులు లేవు. అది చిరవియోగ వ్యథల నలిగి నలిగి చివరకు సంయుక్తి నొందెడు అసహైన ప్రేమికాప్రేమికుల సహజగుణము.

తిరుగుప్రయాణముగూడ నించుమించుగా వచ్చిన బాటనే సంభవించినది. అయిన వచ్చునప్పు డది భూసంబంధి, పోవునప్పు డాకాశసంబంధి. పరిచితములు నపరిచితములు నగు నెలవుల నెల్ల నాసతీపతులు చూచి వినోదించుచుండ విమానము వాయువేగముతో నయోధ్యామార్గముగాఁ బ్రగమించుచుండెను. ఈ—

కురుష్వతావత్కరభోరు! పశ్చా,
న్మార్గే మృగప్రేక్షిణి! దృష్టిపాతం;
ఏషా విదూరీభవతః సముద్రా,
త్సకాననా నిష్పతతీవ భూమిః.

(రఘు॥ సర్గ॥ 13. శ్లో॥ 18)

క్వచిత్పథాసంచరతే సురాణాం,
క్వచిద్ఘనానాంపతతాంక్వచిచ్చ;
యథావిధోమేమనసోఽభిలాషః,
ప్రవర్తతే పశ్యతథా విమానం.

(రఘు॥ సర్గ॥ 13. శ్లో॥ 19)

శ్లోకము లాసందర్భములోనివే.

సీత! అదిగో, యటు వెనుకవైపు చూడు. ఆదృశ్య మెంత బాగున్నదో! ఒకవైపు సముద్రము దూరీభూతమగు చున్నది. మరొకవైపు దానినుండి వనసంపత్సమేతగా వసుంధర నిష్క్రమించుచున్నదో యన్నట్లగపడుచున్నది. ఆహా! ఎంత బాగున్నది!

మనోహరీ! ఈ విమానపు నడక యెంత చోద్యముగా నున్నదో చూచితివా? ఒకమాటిది మిక్కిలి యెత్తుగా నున్న సుపర్వుల బాటను బోవుచున్నది. మరొకమాటు మేఘ మార్గమునుబట్టి నడుచుచున్నది. ఇంకొకమాటు పక్షిపత్రిలోలి కయం దరుగుచున్నది. ఇప్పుడు పరిశీలించి చూచినచో నామా నసాభిలాషకు దీని గమనవైవిధ్యమునకు నేమియు నంతరము లేదని చెప్పవచ్చును. ఆహా! ఎంత చక్కని యానము! శ్రీరామచంద్రుఁ డిట్లు మార్గమధ్యమునఁ గనిపించెడు వింతలను సీతాదేవికిఁ జూపుచు రాజధానికిఁ బయనించెను. ఈ మార్గవర్ణన యెంతే రమణీయతఁ బ్రచురించుచున్నది. కేవలము నాఁటి విమానగమనానుభూతికేకాక నేఁటి విమాన గమనానుభూతికిఁగూడ నీచిత్రికృతి పూర్తిగ సరిపడియున్నది.

ఈమార్గవర్ణన రామాయణ మందును గలదు. వాల్మీకి కాలమున విమానము లున్నది. కాని కాళిదాసుని కాలమున విమానము లున్నట్లు బలవత్తరములైన చారిత్రకనిదర్శనము లేమియుఁ గనఁబడుట లేదు.

మరి, యీవిమానయానవర్ణన మిక్కిలి స్వానుభూతిఁ గల మహాకవి సంతరించిన ట్లగపడుచున్నది. ఒకవేళఁ గాళిదాస కవీంద్రుఁ డీసందర్భమున వాల్మీకి యడుగుజాడల ననుగమించి యుండునేమోయన్న నదియుఁ గనిపింపదు. ఈ విషయమున నతఁ డాదికవీంద్రున కచ్చియున్న దేమియు లేదు. ఇదంతయు నతని సొంతయాస్తి. పితార్జితమును గాదు, కేవలము స్వార్జితము. అటువంటప్పు డీవర్ణన యింత ప్రకృతిసిద్ధముగను నింత చేతోహరముగను బొసఁగినదన్నచో దీనికంతకు బలవత్తరమగు కారణ మేదే నొకఁ డుండకపోదు. అదియే దివ్యదృష్టి. అదియు శ్రీమన్మహాకాళీవరప్రసాదలబ్ధుఁడగు కాళిదాసకవీంద్రుని దివ్యదృష్టి. ఇదంతయు నింతకు ముందొకపర్యాయము ప్రవచింపఁబడియే యున్నది. కనుక నిప్పుడింతకంటె నెక్కువ చెప్పనక్కరయుండదు.

సీతారాములు సలక్ష్మణ బంధుమిత్రింబుగ గమ్యస్థానమును జేరుకొనిరి. రాజప్రతినిధి భరతుఁడు బ్రహ్మాండసన్నాహములతోఁ బ్రత్యుద్గమించినాఁడు. ప్రజ లానందబాష్పముల నేకధారగా వర్షింపించిరి.

ఆనాఁడు కేంద్రనగరము నవనవారూఢగురుప్రహర్షతఁ గేవలము పరవశకైపోయినది. అఖండవైభవోపేతముగాఁ బట్టాభిషేకమును ముగిసినది. బంధుమిత్రాదులు సముచిత సన్మానముల నందుకొని యెవరియింటికి వారు తరలిపోయిరి. కొంతకాలము సుఖముగాఁ గడచిపోయినది. అదేమోకాని,

మరల హఠాత్తుగ నింకొక పిడుగు పడినది. శ్రీరాముఁడు వచనీయము సహింపఁజాలఁడు. అది కేవల మపవాదసముత్థితము. సీతాదేవి మహాపతివ్రత. అది యతనికి బాగుగా నవగతమైన విషయమే. కాని యతఁ డయశోభీరుఁడు. అందువల్లఁ దుదకాసాధ్వీమతల్లికి నిర్వాసనము తప్పకపోయెను. అది విధినిర్ణయము.

సాహం తపః సూర్యనివిష్టదృష్టి,
రూర్ధ్వంప్రసూతేశ్చరితుంయతిష్యే;
భూయోయథామేజననాంతరేఽపి,
త్వమేవభర్తానచ విప్రయోగః.

(సర్గ॥ 14. శ్లో॥ 66)

ఇది సీతా పతివ్రత యరణ్యానినుండి రామమహీపాలున కంపిన సందేశములోని శ్లోకము. సందేశవహుఁడు మరది లక్ష్మణుఁడు. ఆమె పురుడు వచ్చినపిమ్మటఁ గఠినతపస్సుఁ జేయ నుంకింపఁదలఁచినది. ఎందుకు? ముందుజన్మఁగూడ శ్రీరాముఁడే తనకు భర్తకావలయునని యామె యభీష్టము.

కాని, యప్పు డిప్పుడుమాదిరిగా విప్రయోగముండఁగూడదు. ఆహా! ఎంతటి మృదుమధురభావమిది! నాయింట నుండవలదని బైటకు గెంటివైచిన పెనిమిటి రామమహీపతి. అయినను, జననాంతరములఁగూడ నాతఁడే యామెకు భర్తగావలయున టం. ఎంత యుదారహృదయము! నిజమాయౌదార్యము, ఆయోపిక చెప్పనలవికానివి. అందువల్లనే యామె మహిళా ప్రపంచమునకంతకు నేకైకాదర్శభూతురాలుగాఁ

చేర్కొనఁబడినది. సీతాదేవి తానెంత పతివ్రతయో, యంత విజ్ఞానముఁ గల నారీశిరోమణి. రామభూపాలుఁ డామెను వెడలఁగొట్టినది కేవలము సన్నిధినుండియే కాని హృదయము నుండి కాదు. ఆ పరమార్థ మామెకు సువిదితము.

అందువల్లనే కాఁబోలు—

నృపస్య వర్ణాశ్రమపాలనం య,
త్స ఏవ ధర్మో మనునా ప్రణీతః;
నిర్వాసితాప్యేవమత స్త్వయాహం,
తపస్విసామాన్య మవేక్షణీయా. శ్లో॥ 67

ఈ తుదిపలుకులతోఁ దనసందేశమును ముగించి వైచిన దాభూపాలిక.

నన్నీవిధముగా బైటకు సాగనంపితివి. పోనీలే, వర్ణాశ్రమపాలనము నృపున కత్యాజ్యధర్మము. కాబట్టి, నన్నిఁకఁ దపస్విసామాన్యముగ నైనను జూడు. ఇదియే నాకడసారి కోరిక. ఇది సారాంశము. ఈ సందర్భమున నాదికవీంద్రుఁ డేమనుచున్నాఁడో కొంచెము పరికింపవలసియున్నది.

యథా భ్రాతృషు వర్తేథా, స్తథా పౌరేషు నిత్యదా;
పరమో హ్యేష ధర్మ స్తే, తస్మాత్కీర్తి రనుత్తమా.
అహం తు నానుశోచామి, స్వశరీరం నరర్షభ!
యథాపవాదం పౌరాణాం, తథైవ రఘునందన!
పతిర్హి దేవతా నార్యాః, పతిర్బంధుః పతిర్గురుః;
ప్రాణైరపి ప్రియం తస్మాత్, భర్తుః కార్యం విశేషతః.

(ఉ॥ కాం॥ అధికపాఠ శ్లోకారంభము. సర్గ॥ 18౨)

స్వామీ! సోదరులయెడల నెట్లు ప్రవర్తించెదవో, పౌరులయెడలఁగూడ నట్లు ప్రవర్తించుము. అందువల్ల ననుత్తమ కీర్తి లభింపఁగలదు. మఱియు, నీవు రాజువు కనుక, నది నీకు ముఖ్యధర్మము.

నరర్షభ! ప్రమదకు నన్నివిధముల దిక్కు—కపతియే. కాబట్టి, భర్తృకృత్యము నామెకును గడుంగడు ముఖ్యము. అందువల్ల నేనును నీవలె నిష్కారణముగాఁ బైఁబడిన యీ యపవాదును గురించియే కుందుచుంటి గాని, నాయీశరీరమునకు నొదవిన చిక్కుల నుద్దేశించి యొక్కింతయు వాపోవుట లేదు. ఇది యతని యభిభాషణము. అంతిమార్థమునం దాశ్లోక విషయమునకు నీశ్లోకవిషయమునకు నేకీభావమున్నది. కాని యది పైశ్లోకమునఁ గ్రోడీకృతమై వ్యంగ్యనేపథ్యముఁ దాల్చి యున్నది. మరియు నాదశరథసఖుఁడు—

జానాసిచయథాశుద్ధా, సీతాతత్త్వేన రాఘవ!
భక్త్యాచపరయాయుక్తా, హితాచతవనిత్యశః.
అహంత్యక్తాత్వయావీర! అయశోభీరుణాజనే;
యచ్చతేవచనీయంస్యా, దపవాదసముత్థితం.
మయాహిపరిహర్తవ్యం, త్వంహిమేపరమాగతిః.

ఇట్లనుచున్నాఁడు. రాఘవ! శుద్ధచరిత్ర సీత, యని యెరుఁగుదువు; నీయెడల మిక్కిలి భక్తిఁగలదనియు నెరుఁగుదువు; పిమ్మట నీకవసరమైనచోఁ దన ప్రాణములైనను దెగఁగోసి యిచ్చునంతటి పరమహిత యనియు నెరుఁగుదువు.

మరి, యిప్పుడు విడిచిపెట్టితివి. అది కేవల మయశోభీరుత యని యెఱుఁగుదును. నీవే నాకన్నివిధముల దిక్కు. కాబట్టి ప్రస్తుతము నీకుఁ గలిగిన యీయపవాదొక నీకే కాదు నాకును బరిహర్తవ్యమే. ఇది పరమార్థము. ఈ పరమార్థము నంతను గాళిదాసు—

నచావదద్భర్తురవర్ణమార్యా, నిరాకరిష్ణోర్వృజినాదృతేఽపి;
ఆత్మానమేవస్థిరదుఃఖభాజం, పునఃపునర్దుష్కృతినంనినింద.
(సర్గ॥ 14. శ్లో॥ 57 )

ఈ మాదిరిగాఁ దనూకరించినాఁడు. ఆమె యార్య. భర్త తన్ను కారణముగా నిరాకరించినను నాపె యతనిని బల్లెత్తుమాటైనను అనలేదు. అది కలగలుపులేని పతివ్రతల నైసర్గికగుణము. ఇది సందేశమునకుఁ గొంచె మావలిది.

ఇది పైపైగఁ జూచినఁ దనూకృతిగా నగుపించదు. కాని, లోతుగాఁ బరికించి చూచినచో నిది యొక యపూర్వతనూకృతి యని నిగదింపక తప్పదు. రఘువంశము కావ్యము, బహుకథాకమనియు; రామాయణము పురాణలింగితమగు నేక కథక కృతి యనియుఁ బైన వ్యాఖ్యానించితిని.

కాబట్టి, రఘువంశమునకుఁ దనూకృతి యెంత యావశ్యకమో; రామాయణమునకుఁ బృథూకృతి యంత యావశ్యకము. వాల్మీకి బహులీకరణ మొకవిధమగు హాయిలు చిలకరించుచుండఁ, గాళిదాసుని సూక్ష్మీకృతి మఱొక విధమగు హాయి లోలికించుచున్నది. ఇఁక—

వాచ్య స్త్వయా మద్వచనాత్స రాజా,
వహ్నౌ విశుద్ధామపి యత్సమక్షం;
మాం లోకవాదశ్రవణా దహాసీః,
శ్రుతస్య కిం తత్సదృశం కులస్య?

ఈ శ్లోకము ద్రష్టవ్యము. మనోహర! అనాఁడు హుతాశనుఁడు నాపరిశుద్ధతకు సాక్షీభూతుఁడైనాఁడు. అదంతయు నీకన్నుల ముంగటనే జరిగినది. అయినను, నేఁడు లోకవాదమున కగ్గమై విడిచిపెట్టితివి. ఇది యున్నతకులమునకు సదృశమగు కర్జమేనా?

ఇది సీతాసందేశమందలి తొలి యవస్థ. ఎంతటి నిర్మల హృదయులకైనను ఎట్టి సచ్చరిత్రులకైనను బిడుగువంటి వార్త వినినప్పుడు హృదయము క్షుభితముకాక తప్పదు.

అది నిగ్గయిన మానవ తత్త్వమునకుఁ గల సహజ గుణము. దానిని బాగుగా గుర్తెఁగినవాఁడు మహాకవి కాళిదాసు. అందువల్లనే కాఁబోలు పైశ్లోకమం దాగుణమును మూచాయగ నగపరచి యనుపదంబ యీ—

కళ్యాణబుద్ధేరథవాతవాయం,
న కామచారోమయిశంకనీయః;
మమైవజన్మాంతర పాతకానాం,
విపాకవిస్ఫూర్జథురప్రసహ్యాః.

శ్లోకముతో దాని కుద్వాసన చెప్పివైచినాఁ డాపరమార్థవేది. రాముఁడు కళ్యాణబుద్ధిఁగలవాఁడు. కాబట్టి యతఁడు తనయెడల నెన్నఁడుఁ గామచారిగఁ బ్రవర్తింపఁడని యాపె నిశ్చయము.

ఇఁక నావిపద్దశకు మూల మామె జన్మాంతరములం దార్జించు కొన్న పాతకముల విపాకమేయఁట. ఫైది మానవత్వము. ఇది దివ్యత. మొత్తముమీఁద నీకైవున సీతయందలి దివ్యతా మానవత్వములను మంచినేర్పుగాఁ గనఁబరచినాఁడు మహాకవి కాళిదాసు.

ఈ భావస్ఫులింగములు రామాయణమునం దగుపింపవు. కనుక నిదంతయుఁ గాళిదాసుని ప్రత్యేకత యని వక్కాణింప వచ్చును. అయినను, వాల్మీకి దివ్యత్వ మానవత్వముల నెరుఁ గనివాఁడనుట సముచితము కాఁజాలదు.

అతనికిఁ గల యీపరిజ్ఞానమంతయు రామాయణమం దితరత్రఁ బరిమళించుచునే యున్నది. అయినప్పుడు, సీతా సందేశమం దది యెందుకుఁ గనఁబడదు? అయ్యెడఁ దదీయ సంస్థితి సముచితమే కదా? ఔను, సముచితమే. అక్కడ గూఁడ నది లేకపోలేదు. కాని, యది రామాయణమం దొక మోస్తరుగను రఘువంశమం దింకొకమోస్తరుగను ప్రతిఫ లించుచున్నది. అది వారల వైయక్తిక శక్తులకుఁ గల విశిష్టత. మరియు నది మహాకవుల లక్షణము. లక్ష్మణుఁడు తనకు వదినె గారిచ్చిన సందేశమును బదిలముగా మూటఁగట్టుకొని మెల్లఁగాఁ గోటలోఁ బాదముపెట్టినాఁడు. వినయవిధేయతలు వెల్లివిరి యఁగా నన్నగారిని దర్శించినాఁడు. "అన్నయ్యా! మీయాజ్ఞ ననుష్ఠించి వచ్చితి" నన్నాఁడు గద్గదస్వరముతో. ఎట్లో వీలు చేసికొని మూటవిప్పి ముందుఁ బెట్టినాఁడు.

అప్పుడు రామచంద్రుని హృదయవాతావరణ మెట్లుండ వచ్చును? దాని యాకృతి యంతయు——

బభూవ రామః సహసాసబాష్పః
స్తుషారవర్షీవ సహస్యచంద్రః,
కౌలీనభీతేన గృహాన్నిరస్తా,
న తేన వైదేహసుతా మనస్తః.

(సర్గ॥ 14. శ్లో॥ 84)

ఈ యక్షరగుచ్ఛమున సాక్షాత్కరించి యున్నది.

తమ్ముఁడు తెచ్చిన సందేశమును బూర్తిగ వినెనో, లేదో, యప్పుడే యతనిని గన్నీటికెరటాలు ముంచివైచినవి. అత్తరుణమునఁ దుషారవర్షియగు పౌషచంద్రునకు, రామచంద్రునకు నేమియు నెరమరిక యుండియుండదు. ఔరా! కౌలీనభీతికిఁ గల ప్రభుత్వ మెంతగొప్పది! అయినను, నొక గృహమునుండియే కాని, హృదయమునుండి యాతఁ డామె నెన్నఁడు వెడలఁగొట్టలేదు. నాఁటి రామచంద్రుని యాబాష్పమయాకృతిని సహస్యచంద్రునితోఁ బోల్చినఁగాని మహాకవికిఁ దృప్తి లేకపోయినది కాఁబోలు. అబ్బా! ఎంతటి భావగాంభీర్యము! ఆ సందేశ మొకవైపున, నెంతటి హృదయములనైనను నొకక్షణములోఁ గరఁగివేయఁగల యతిలోకకరుణరసమును జిమ్మించుచున్నది; మరొకవైపున నా యాదర్శప్రేయసీప్రేయసుల పరస్పరామలినప్రేమను గడు మనోహరముగా నెత్తి చూపుచున్నది.

అంతలో నూరుకోనలేదది. అత్యుత్తమమైన దాంపత్య వైఖరిని బ్రదర్శించుచు నిష్కల్మషముగా లోకసేవ కంకితము కాఁదగ్గ మానవోత్తమజీవికలను బహు సుందరముగా సృజించి పెట్టిన దాదివ్యాసం దేశము.

రామచంద్రుఁడు సార్వభౌముఁడు. కాబట్టి యతని కేసౌఖ్య మనుభవించుటకు లోటుండదు. కాని, యతఁడు సామాన్యసార్వభౌముఁడు కాఁడు. ఉత్తమప్రవర్తనలకు వరవడి కాఁదగిన పరమోత్తమప్రవర్తనుఁ డామహనీయుఁడు. సీతా వియుక్తికి బిమ్మట నేర్పడిన యతని ప్రవర్తనాకృతిని—

నిగృహ్య శోకంస్వయమేవధీమా,
న్వర్ణాశ్రమావేక్షణ జాగరూకః;
సభ్రాతృసాధారణభోగ మృద్ధం,
రాజ్యం రజోరిక్తమనాః శశాస.

(సర్గ॥ 14. శ్లో॥ 85)

ఈ శ్లోకము ప్రస్ఫుటముగ నగపరచుచున్నది. అతఁడు ధీమంతుఁడు. కనుక స్వయముగనే శోకమును నిగ్రహించుకోఁ గలిగినాఁడు. ఆడంబర మెరుఁగని సామాన్యజీవికతో రజోరిక్తమానసుఁడై కేవలము ప్రాణరక్షణకు వలయు నాహారము మాత్రమే స్వీకరించుచు నాపురుషోత్తముఁ డప్పుడు ప్రజాపాలన మొనర్చినాఁడఁట.

ఔనుమరి, స్వార్థమెరుఁగని ప్రజాపరిపాలకుఁడు శ్రీరామచంద్రుఁడు. ఏకనాయకప్రభుత్వమైనను, బహునాయక

ప్రభుత్వమైనను అట్టి ప్రభుత్వమే యస్వైన ప్రజాప్రభుత్వ మనిపించుకోఁగలదు.

అదిగో, యప్పుడే దేశమునకు సుభిక్షతాప్రాప్తి. ఆ నాఁడే యది సర్వసౌఖ్యములతోఁ జెనుపొందఁగలదు. కాబట్టి లోకక్షేమాపాది యగు నట్టి దివ్యస్వామ్యము, మగుడి దేశ ములోఁ దలయెత్తవలెనని భారతభాగ్యవిధాత గాంధి మహాత్ముఁ డాగోజులలోఁ బదింబదిగాఁ గలలు కనుచుండెడి వాఁడు. తరతరాలుగా, యుగయుగాలుగా నణఁగఁద్రొక్కఁ బడిన భారతదేశము మరల నేఁడు తన తొంటివైభవములను జేకొని మహోన్నతస్థాయి నుండవలయునన్నచో నట్టి దివ్య ప్రభుత్వ మవశ్యావశ్యక మని యతని దృఢవిశ్వాసము. కాని, యనుభూతియోగ మింకను జేరుగడ లేకో, యేమో, భారత వసుంధర కంతటి సమగ్రభాగధేయ మిప్పుడు చేపడలేక పోయినది. ఇఁక ముందైనను ఆ మహాభాగ్యము ప్రాప్తించె నేని, మన పంటవలంతి యెంతే నదృష్టవంతము కాఁగలదు.

రాజ్యభారమంతయు నజ యువరాజు భుజస్కంధము లపై మోపఁబడ్డది. రఘుసార్వభౌమునకు వార్ధకదశయు సమీపించినది. అయినను సూర్యవంశ్యులు కులధుర్యు లుం డఁగాఁ దాము గృహస్థితి కిచ్ఛగింపరు.

అది వారి కనుక్రమముగా వచ్చుచున్న వంశాచారము. కాని, నవమహీపతి పితృవియుక్తికి నావంతయు నిలుపోవలేని సుకుమారహృదయుఁడు. తండ్రిగారి యంతిమాశ్రమ జీవికయుఁ.

దన కన్నులముంగటనే జరుగవలయునని యతని మనోవృత్తి. అందువల్ల దిలీపనందనుఁడు దూరస్థములగు విపినముల కరుగకుండఁ బురోపకంఠమున నుండుట కంగీకరింపవలసినవాఁడయ్యెను. నగరము వెలుపలి యాశ్రమమందు విశ్రాంతిఁ గైకొన్న వృద్ధమహీపతియు, రాజగృహమున సింహాసన మెక్కిన నవమహీపతియు—

పరిశమస్థిత పూర్వ పార్థివం,
కుల మభ్యుద్యతనూతనేశ్వరం;
నభసా నిభృతేందునా తులా,
ముదితార్కేణసమారురోహతత్.

(సర్గ॥ 8 శ్లో॥ 15.)

ఈ శ్లోకమున నీట్లు వేర్వేరు తావుల నాక్రమించియున్నారు.

అది యిక్ష్వాకుల కులము. ఒకవైపు వృద్ధరాజు పరిశమస్థితుఁడై పొద్దులుపుచ్చుచున్నాఁడు. మరొకవైపు నూతన భూపతి సింహాసనారూఢుఁడై రాజ్యముచేయుచున్నాఁడు. అందువల్ల నది యొకప్రక్క నాసన్నాస్తమయుఁడగు చంద్రునితోను మరొకప్రక్క నభ్యుదితుఁడైయున్న సూర్యునితోను గలిసిమెలసి యుండెడు నాకసముతో సాదృశ్య మందియున్నదఁట.

ఇది లోకరూఢిఁగల దృశ్యమే, కాని, యెక్కడో మారుమూలల నుండెడు దృశ్యము కాదు. శుక్లపక్షపు రోజులలో దీని నెల్లరుఁ జూడవచ్చును. కాని, దీని రమణీయత మాత్రము చాలా గొప్పది. ఈ శ్లోకమును సంతరించునప్పుడు

గాళిదాసున కీసుచిరభావము స్ఫురించినందు కతనికి దేశ మత్సరలక్ష లిచ్చినను నష్టములేదు. ఇందలి యాలేఖ్యమట్టిది. దీని నేకాలమందైనను నేజాతీయుఁడైనను నరసి యానంద వీచికల మొగ్గలువేయకుండ నుండఁజాలఁడు.

అనయత్ప్రభుశక్తిసంపదా,
వశమేకోనృపతీననంతరాన్;
అపరఃప్రణిధానయోగ్యయా,
మరుతఃపంచశరీరగోచరాన్.

(సర్గ॥ 8 శ్లో॥ 19)

వ్యవహారాసనస్థుఁడైన యజుఁడు తన ప్రభుశక్తిసంపద వల్ల ననంతరులగు నృపతులను వశముచేసికొనుచుండఁ, గుశ పూతవిష్టరస్థుఁడైన వృద్ధరాజు తన సమాధ్యభ్యాసమువల్ల శరీరమందలి ప్రాణాది పంచమారుతములను స్వాయత్తముచేసి కొనుచుండెనని యీశ్లోకము ముచ్చటించుచున్నది.

కోశదండబలాదులు ప్రభుశక్తి యని మితాక్షర చెప్పు చున్నది. ఏకకాలమున జరిగెడు తండ్రి కొడుకుల వ్యవ హారములనిది ప్రకృతిదృశ్యము. నాదర్శమువలె మంచి సురు చిరముగఁ బ్రదర్శించుచున్నది. కాళిదాసునకుఁ గల ఘనతర కవితాసంపదనేకాక, యతని యౌగిక రాజకీయ శేముషీశక్తిని గూడ నిక్కడఁ జక్కఁగ మచ్చుచూడవచ్చును. ఈ సందర్భ మునఁ గవిశేఖరుఁడు తన యౌచితీఘనతల శేముషీసంపద నొకేయొక గుట్టగా నొరగఁబోసియున్నాఁడు. ఇది చూచిన

కొలఁదియూ నస్తైన కోమలతలను నలు మొగంబుల విరఁజిమ్మెడు అందాలగుట్టగనే కనఁబడు గాని, యేదోయొక మామూలు గుట్టమాదిరిగా మాత్రము కనఁబడదు. ఈ గుట్ట వయస్సిప్పటికి రెండు వేలయేండ్లకుఁ దక్కువలేదు. అయినను దీని యౌవన ప్రతిభ మొదట నెట్లున్నదో, యిప్పుడు నట్లేయున్నది.

ఒకవేళ నిది కసుగందు లెరుఁగని యందాల నొలికించెడు నిత్యయౌవనశ్రీయేమో! అయినఁ గావచ్చును. మొత్తముమీద నీ ఘట్టమున నతని యనితర కల్పనాశక్తి బ్రహ్మాండముగా సహకరించినది.

కవిసార్వభౌముని యౌచితీ బుద్ధికుశలతయు, శాబ్దికన దీక్షతఁగల యతని ప్రతిభావైభవమును నిందుమతీ స్వయంవరఘట్టమునం దింతకంటెను సుస్పష్టముగఁ బ్రతిఫలించుచున్నవి. ఇదిగో—

సంభావ్యభర్తారమముంయువానం,
మృదుప్రవాలోత్తరపుష్పశయ్యే;
వృందావనే చైత్రరథాదనూనే,
నిర్విశ్యతాం సుందరి! యౌవనశ్రీః.

(సర్గ॥ 6. శ్లో॥ 50)

ఈ శ్లోక మాఘట్టమందలిదే. అది స్వయంవరసదోగృహము. రాజకమంతయు నయ్యెడఁ బంక్తులు పంక్తులుగా సోఫాల నధిష్ఠించియున్నది. అప్పుడు శుద్ధాంతరక్షియగు సునంద శూరసేనాధిపుండగు సుషేణుని జూపుచు నిందుమతితో,—

"సుందరి! ఇతఁడు శూరసేనాధిపతి సుషేణుఁడు. చాలా

గొప్పవాఁడు. ఈ సుందరుని యుద్యానవనము కుబేరుని యుద్యానవనమున కైనవచ్చెను నంతటి రమణీయతఁ గలది.

దాని పేరు బృందావనము. ఇఁక నీ రూపసిని వరించి యెప్పుడు నాబృందావనములో నా మృదుప్రవాళో త్తర పుష్పశయ్యలలో హాయిగా నితనితో యౌవనఫల మనుభవించు," మని గుసగుసలాడెను.

కాని, యతఁడు తనకు నచ్చలేదు కాఁబోలు, వెంటనే యాయావ ర్తనాభి తానన్యవధువు కాఁదలఁచుకొన్నదై, సాగర గామిని యగు స్రోతోవహ మార్గవశోపేతంబగు మహీధరంబును బలె నతని విడచి ముందునకుఁ బోయెను. అజకుమారుని సమీపించుదనుక నట్లే సునంద ప్రతి రాజును జూపి వర్ణించు టయు నిందుమతి యొల్లక ముందుకు సాగిపోవుటయు జరిగినది. ఇప్పు డొక విషయ మరయఁదగియున్నది. మహాకవి సునందా ముఖమునఁ బ్రతి నేతను నఖండముగా వర్ణించి యున్నాఁడు. మరియు నతఁ డిందుమతి వారల నేరిని వరించలేదనుచున్నాఁడు. అంత దేదీప్యమానముగా వర్ణింపఁబడిన రాకుమారుల నిందుమతీకుమారి యొక్కరి నైనను వరింపకుండుటకుఁ దగిన కారణ మొకఁ డుండవలయును. అయిన, నది యేదియై యుండవలయును?

ఒక వేళ నది వారెల్లరు దోషభూయిష్ఠులని యుండ వచ్చునా? అది యసంగతము. అట్లున్నచో నవరించుటకుఁ

గూడ వశముకానంత యాచితీభంగము సంభవించును. మరి, యది యేది కావచ్చును?

అది యేది కావచ్చునో యని మన మూహించి తంటాలు పడుటకన్న, బాహాటముగా రచయిత నడిగ తెలిసికొనుట యే మంచిది. ఆ మహామహుఁడు——

అథాంగరాజాదవతార్య చక్షు,
ర్యాహీతిజన్యామవదత్కుమారీ;
నాసౌ నకామ్యో నచవేదసమ్య,
గ్ద్రష్టుంనసా భిన్నరుచి ర్హి లోకః.

(సర్గ॥ 6. శ్లో॥ 30.)

ఇట్లనుచున్నాఁడు. శూరసేనాధిపుని జూపుటకుఁ గొంచెము ముందే సునంద యంగరాజును జూపినది. అతఁడును సురాంగనలు సైతము ప్రార్థించెడు యావనశ్రీః గలవాఁడేకాని, సాధారణవ్యక్తి కాఁడు. అయినను, నిందుమతీ మనఃకపోత మక్కడ వ్రాల నిచ్ఛగించలేదు. అది యెందువల్ల నక్కడ వ్రాలలేదో మహాకవి యొక చక్కని కారణమును జూపించి యున్నాఁడు. అతఁడు కామింపఁదగ్గ సుందరుఁడే. ఆమెయుఁ దెలిసికోఁదగినంత విదుషీమణియే. అయినను, ఆమె యతనిని వరించలేదు. ఎందువల్ల?

"భిన్నరుచి ర్హిలోక" యని యన్నాఁడు మహాకవి. వ్యాఖ్యాత మల్లినాథసూరి——"రుచిరమపి కించిత్కస్మై

చిన్నరోచతే" యని దానిని వ్యాఖ్యానించినాఁడు. లోకులు వివిధరుచులు గలవారని కవిశేఖరుని విశ్వాసము.

అతి మనోహరమగు పదార్థముగూడ నొకప్పు డొకరికి రుచింపకపోవచ్చుననుచు సూరిగారు కవిగారిని బలపరచు చున్నారు. ఈ కారణము, ఈ బలీకరణము నెంతే బాగున్నవి. ఈ హేతుప్రదర్శన మాఘట్టమున హృద్యంబులగు తులకింపు లను మంచి నాజూకుగాఁ గురియుచున్నది. సాధారణకవి యైనచో నక్కడ దీనికి మారుగ మరియొక కారణమును జూపి యుండెడివాఁడు. అప్పుడు తీరని యౌచితీభంగము పాటి ల్లెడిది. కాని యతఁడు సామాన్యుఁడు కాఁడు, కవికులాదర్శ భూతుఁడు కాళిదాసు. నిజముగా నది కష్టతరసందర్భము. అయినను, గాళిదాసుగా రక్కడఁ దమ యనితరప్రతిభా సంపదవల్ల నఖండవిజయము సాధింపఁగలిగినాఁడు.

ఈ సురుచిర హేతువు నతఁ డిక్కడొకచోటనే కాః దింకను, ననేకచోట్ల వాడియున్నాఁడు. ఆవాడుకయు నాత్మనీ నంబగు మార్గవైవిధ్యముగా నుండుఁగాని విసువునొదవించున ట్లొకేయొకకైవున నుండదు.

అదియే యతనిలోఁ గల క్రొత్తవిశేషము. పుత్రి సందర్శనమున జననీజనకులకు నొదవెడు నవ్యాజప్రేమను గవిశేఖరుని లేఖిని మంచి యింపితముగ నిరూపించు చున్నది.

తమంకమారోప్య శరీరయోగజైః,
స్పర్శైర్నిషించంతమివామృతంత్వచి;
ఉపాంతసమ్మీలితలోచనోనృపః,
చిరాత్సుతస్పర్శరసజ్ఞతాంయయౌ.
(సర్గ॥ 3. శ్లో॥ 26.)

ఉభావుభాభ్యాంప్రణతౌహతారీ,
యథాక్రమం విక్రమశోభినౌతౌ;
విస్పష్టమసాంధ్రతయా నదృష్టౌ,
జ్ఞాతౌసుతస్పర్శసుఖోపలంభాత్.
(సర్గ॥ 13 శ్లో॥ 2.)

పైది దిలీపచక్రవర్తి రఘుకుమారు నంకమున నిడుకొనియున్న దృశ్యము. క్రిందిది రామలక్ష్మణులు తమ తల్లులకు నభివాదము లర్పించుచున్న దృశ్యము.

తండ్రి కొడుకును తొడమీదఁ గూర్చుండఁబెట్టుకొన్నాఁడు. అప్పుడతని యొడలిమీఁద నమృతము తనకుఁ దానై వర్షించుచున్నదోయన్నట్లున్న దతనికి. అదంతయు శరీరయోగజంబులగు సుఖంబులవలని పారవశ్యము.

దానను పాంతసమ్మీలితలోచనుఁడైపోయినాఁడు దిలీపరాజేంద్రుఁడు. సుతస్పర్శరసాస్వాద మతని కంతటి యప్రమేయసౌఖ్యముఁ గలిగించినది. విక్రమశోభల కుట్టఁగట్టినయి మోడ్పులతో రామలక్ష్మణులు కట్టెదుట నిలఁబడినారు. కేవలము కన్నతల్లులు కౌసల్యాసుమిత్రలు. అప్పుడు వారి యశ్రు

స్ఫ్రీతికి విరామము లేదు. కాని, యవి యానంద బాష్పములు. అయినను, ఆ తల్లుల నొక వైపునుండి పరవశత, మరొక వైపు నుండి యసాంధ్రతయు నొక్కుమ్మడిగా ముట్టడించినవి. అంతయు నయోమయమై పోయినది. అందువల్ల వారు వారి కగపడలేకపోయిరి. అయినను, సుతస్పర్శసుఖోపలంభముకతన గుర్తింపఁ బడినారు.

నిత్యానుభూతిఁ గల తల్లిదండ్రులుకూడ బుత్రసౌఖ్యము నింత యిదిగా వివరించి చెప్పఁజాలరు. అనుభవించుటయే కాని, చెప్పుట వారికిఁ జేతకాదు. అందుకు వారికిఁ దగిన మాటలును దొరకవు.

ఇఁకఁ గాళిదాసునకుఁ బుత్రసంపద కలదో లేదో తెలియదు. మరి, యీవాక్చాతురిఁ జూచిన ధగధగ మెరసిపోవుచున్నది. ఇంతటి యద్వితీయ వచోవైచిత్రి కవిరాజభూషణున కెక్కడనుండి వచ్చిపడినదో! ఇది కేవలము తపస్సిద్ధిగమ్యము. కుమారసంభవ మేఘదూతములవలెఁగాక, రఘువంశ మెక్కువగా మానవీయములగు పాత్రలకు నికేతనమై యున్నది. కాని, యందలి నాయకుల జీవితము లమానుష స్థితిగతుల నెత్తి చూపుచున్నవి. అయినను, బుత్రోత్పత్తి కష్టకష్టములు పడిన సుదక్షిణా దిలీపులు, అనుత్తమమగు దాంపత్యప్రేమ కాదర్శభూతులగు సీతారాములును మానవత్వమున కనుగుణముగా శోభిలఁగలుపఁగల సమర్థులే.

మరియు, రఘుకుమారుని బాల్యము, అజుని ప్రేమ దుఃఖములు, భరతుని వైరాగ్యభాతృప్రేమలు నక్లే పచరింపఁగలవు. నిజముగా రఘువంశమందలి మానవజీవిత చిత్రి కృతి సమున్నతాదర్శములు గల స్థితిప్రవృత్తులతోఁ జెక్కుచెదరని పొత్తుఁ గలిగియున్నదని చెప్పవచ్చును.

దురాశలు లేనట్టియు, దేవతలకు సైత మక్కఱఁ గలిగించెడు నమోఘబలపరాక్రమములు గలట్టియు, న్యాయానుగమనమే తమ నిత్యజీవికగాఁ గలట్టియు మహామహితాత్ములు ప్రజాపాలకులు. తపస్సు లొనర్చుచు మతాచారకర్మలను సంబాళించుచు లోకుల యాధ్యాత్మిక నైతిక యోగక్షేమములను సమీక్షించెడు పరార్థపరులు మహర్షులు. శిష్టరక్షణము దుష్టశిక్షణము ముఖ్యవ్రతములుగాఁ దలయెత్తెడునవి ప్రభుత్వములు. చక్కని ప్రజాస్వామ్యమున కిఁక నింతకంటె నేమి కావలయును? ఇదంతయు రఘువంశప్రపంచమందలి వాతావరణము. మరి, యక్కడి ప్రజల యదృష్ట మెంత మహత్తరమైనదో!

ఇఁక, వివిధప్రకృతులుగల యక్కడి స్త్రీలును ఉత్తమ స్వాతంత్ర్యముతో రమించెడు పతివ్రతలు. ఉత్తమగృహిణియు, మహారాజ్ఞియు నగు సుదక్షిణ, సుందరి యిందుమతి, యాత్మవైరాగ్యము గల రాజమాతలు, కౌసల్యాసుమిత్రలు, పశ్చాత్తప్తహృదయ కైకేయి,—వీరెల్లరు నందలి యాదర్శస్త్రీలు.

వీరేకా, దగ్నినన్నుని భార్యవంటి యుత్తమచరిత్రలింకను గలరు. ఇఁక, మహాపతివ్రత సీతాదేవి. ఈమెను గురించి యెంత వ్రాసినను వ్రాయవచ్చును. మహాకవి కాళిదాసు తనకుఁ గల స్థలము కుశలమైనను ఈస్త్రీరత్నమును మిక్కిలి ప్రస్ఫుటముగఁ జిత్రించి కృతార్థుఁడైనాఁడు. సుదక్షిణయందుఁ గల యాగృహిణీయోగ్యప్రశాంతత, యిందుమతియందు రహించెడు ఆనిరుపమ సౌందర్యము నీమెయం దేకీభూతముగాఁ గాపురముచేయుచున్నవి. ఇఁక, కౌసల్యా సుమిత్రలయందుఁ దోతెంచియున్న యాయౌదార్య వైరాగ్యములీమెయందును గలవు. కాని, యీమెయందలి యౌదార్య వైరాగ్యములు వారలయందలి యౌదార్య వైరాగ్యములకంటె నెంతయు గరిష్ఠములు.

ఈమె తన భర్త యగు రామచంద్రున కంపిన సందేశము భారత స్త్రీలయొక్క యాదర్శ విషయముల సారము. ఎట్టి కష్టములు వచ్చి పైఁబడినను దన పెనిమిటిని బల్లెత్తు మాటయైన నని యెఱుఁగని సుసాధ్వి యీ వీరమహిళ.

ఆదుర్భర కష్ట పరంపరలు, ఆకులీనత, యాఘనత, యానిగ్రహము, అధృఢతర విశ్వాసము, ఆహృదయ వైపుల్యము, ఆబుద్ధివిశాలత, యావిపద్ధైర్యము, ఈమె నత్యద్భుతమైన యేకైకాదర్శస్త్రీగాఁ జేసివైచినవి. చక్కని నాజూకుఁ దనముగల వైదర్భీశైలియందుఁ గాళిదాసు గడితేరిన కవిసామ్రాట్టు. ఈవిషయమును గుమారసంభవాద్యితర.

కావ్యములే కాక, రఘువంశమును నొక్కి నొక్కి చెప్పుచున్నది. ఇంకొక ముఖ్యవిషయము. కాళిదాసు తానెంత మహాపండితుఁడో, యంత మహాకవి. అనగా: అతని పాండితీ వైవిధ్యమెంత యగాధమైనదో, కవిత్వమంత సులలితము, సరళము, మంజులము, ప్రస్ఫుటము, మనోహరము నై యుద్యోతించుచున్నది.

ఈమహత్తరశక్తి యెప్పుడో యెక్కడో కేవలము పెట్టిపుట్టిన మహనీయులకే కాని, యెల్లప్పుడు అందరకు నలవడునది కాదు. కడుంగడు దురాపంబగు దివ్యశక్తి యిది.

కాళిదాసుగారి కవితా కుమారికి నలంకారము లనినఁ జాలప్రీతి. మరియు నర్థాలంకృతులన్న నామెకు మరింత యిష్టము. అయిన, ఆయమ్మాయి నగ లొకవిధమైన చక్కని విలక్షణతఁ గలిగియుండును. అది యామె తన గతజన్మలందలి సుకృతములవల్ల సాధించి పరిపోషించుకొనిన యనితరప్రత్యేకత. ప్రస్తుతము—

తస్యాః ఖురన్యాసపవిత్రపాంసు,
మపాంసులానాంధురికీర్తనీయా;
మార్గం మనుష్యేశ్వరధర్మపత్నీ,
శ్రుతేరివార్థంస్మృతిరన్వగచ్ఛత్.

(2-వ సర్గము॥ శ్లో॥ 2.)

పురస్కృతా వర్త్మని పార్థివేన, ప్రత్యుద్గతా పార్థివ ధర్మపత్న్యా;
తదంతరే సా విరరాజ ధేను, ర్దినక్షపామధ్యగతేవ సంధ్యా.
(2వ స॥ శ్లో॥ 20)

ఈమచ్చుఁదునుకలు రుచిచూడవచ్చును.

మనుష్యేశ్వర ధర్మపత్ని సుదక్షిణ యపాంసులా గ్రసరి. ఆమె స్మృతి శ్రుత్యర్థము ననుగమించునట్లు యాదివ్యమార్గ మనుసరించి వెళ్ళినది. అది నందినీఖురన్యాసములఁ జెలరేగిన పవిత్రపాంసువులను హాయిగఁ గురిసెడు దివ్యమార్గము.

ఇందలి యుపమ కేవలోపమ కాదు. ఇది కాళిదాసుని శ్రుతిస్మృతివిజ్ఞాన వైభవమును దశదిశల నింపుచున్నది. మన్వాది స్మృతులు వేదార్థము ననుసరించియున్నవను కవిమూర్ధన్యుని విజ్ఞాన వైవిధ్య మెంత మహత్తరమైనదో! అది యూహాతీతము. ఈయలంకృతి పాఠకులకుఁ గ్రొంగ్రొత్త విషయమును గరపుచుఁ బరిశోధకుల కొక దివ్యమైన యఖండజ్యోతిగా నుపక రించుచున్నది. ఇట్టి సురుచిరాలంకృతులు కాళిదాసుని కవితలో లెక్కకుమించియున్నవి. "ఉపమా కాళిదాసస్య" యని పెద్ద లందురు. ఉపమాలంకృతులను బొందుపరచుటయందుఁ గాళి దాసు సిద్ధహస్తుఁడని వారి యభిప్రాయము.

కాని, యతఁడొక యుపమలయందే కాక, యలంకార ప్రపంచమందంతటను సుప్రసిద్ధత గడించిన సిద్ధహస్తుఁడు. అలంకారములను వాడుటయం దతని కొకవిధమైన విశిష్టత కలదు. అది కేవలమతని సొమ్ము. కాబట్టి యొుల్లకు దురాపము.

నందిని యథేచ్ఛగా మేతమేసి యాశ్రమమునకు వచ్చినది. పార్థివధర్మపత్ని ప్రత్యుద్గమించినది. పార్థివుఁ డనుగమించియున్నాఁడు. నందిని ప్రతిదినముఁ బసుపుఁగుంకుమపూవులతోఁ బూజింపఁబడుచున్నది. మొత్తముమీఁద నాసతీపతులకు నడుమ నుండుట సంభవించినది నందినికి. అందువల్ల నందిని దినక్షపామధ్యగతంబగు సంధ్యవలె నభూతపూర్వములగు చక్కని తులకింపులను నలుఁగడల వెదచల్లఁగలిగియున్నది. ఈయుపమలో ననన్యంబగు ప్రకృతిరామణీయకము కన్నులకుఁ గట్టినట్లు హాయిగఁ బ్రతిబింబించుచుఁ గసటులేని సొగసైన మరీచుల నదేపనిగా నొరగఁబోయుచున్నది. ఇట్టి వింకను ఎన్నో కలవు. అసలు దాసుగారి కవిత్వము వివిధములగు నిట్టి క్రొంగ్రొత్త నగల కొక పెద్ద బోషాణము.

ఇఁక, యమకాదులగు శబ్దాలంకారములును రఘువంశమందుఁ జక్కని జీవనోపాధులు గలిగియున్నవి. అందు ముఖ్యముగా నవమసర్గమందు నేబదినాలుగు శ్లోకములు విన సొంపైన యమకమును మధురమధురముగఁ బ్రదర్శించుచున్నవి. ఈః—

కుసుమజన్మతతో నవపల్లవా,
స్తదనుషట్పదకోకిలకూజితం;
ఇతియథాక్రమమావిరభూన్మధు,
ర్ద్రుమవతీమవతీర్యవనస్థలీం. — 26.

మచ్చుఁదునక యాశ్లోకాల గుత్తిలోనిదే. ఇది వసంతాగమ

సమయమందలి శ్లోకము. ముందుగాఁ గుసుమాలపుట్టుక, తరువాత క్రొంగ్రొత్త చిగురుటాకుల ప్రభూతి, పిమ్మటఁ దుమ్మెదల గుసగుసలు, పదపడి కోకిలల యాలాపాలు;—ఇట్లు క్రమానుసృతిగా ద్రుమవతి యూవనస్థలి నలుఁగడల మధుశోభలఁ గ్రిక్కిరిసిపోయినది. ఇది వసంతసమయమందలి ప్రకృతి దృశ్యముయొక్క ప్రతికృతి.

కాళిదాసుని ప్రకృతివిజ్ఞానమున కిది యొక లలితమయిన నిదర్శనము. ఈశ్లోకమందలి చివరిపాదమునఁ గల శబ్దాలంకృతి యలవోకగా వీనుల కానెత లీయఁగలదు.

కవికులేశ్వరుని భాష యెంత మధురమధురమైనదో, యతని శబ్దాలంకృతు లంత రుచిరరుచిరము లైనవి. ఒక యర్థాలంకారములను వాడుటయందే కాక, శబ్దాలంకారములను వాడుటయందుఁ గూడ నతఁడు సాటిలేని నేర్పరి. మహాకావ్యమందలి యర్థాంతరన్యాసాద్యలంకారములందుఁ గవికుల నాయకుఁడు కాళిదాసు తన మానవీయాది విజ్ఞానసంపద నే కాక మహాకవిగాఁ దాను లోకమున కందీయఁదలఁచిన దివ్యతర సందేశములను గూడ మంచి చోద్యముగా నిమిడ్చియున్నాఁడు.

కామంనృపాస్సంతుసహస్రసోఽన్యే,
రాజన్వతీమాహురనేన భూమిం;
నక్షత్రతారాగ్రహసంకులాపి,
జ్యోతిష్మతీ చంద్రమసైవ రాత్రిః.

(సర్గ॥ 6. శ్లో॥ 22.)

ఇది స్వయంవరమండపమున మగధరాజు నుద్దేశించి ప్రతిహార రక్షి సునంద పతింవర యిందుమతితో ముచ్చటించెడు తరుణ మందలి శ్లోకము.

రాజు లనేకు లుండవచ్చును. కాని, యితని కతమున విశ్వంభర రాజన్వతి కాఁగలిగినది. ఇతఁ డంతటి చల్లని రేఁడు. ఔను, నిజమే. రాత్రి నక్షత్రతారాగ్రహంబులతోఁ గ్రిక్కిరిసిపోయియుండును. అయినను, అది యొక చంద్రమసునివల్లనే జ్యోతిష్మంతము కాఁగలుగుచున్నది. అతని సత్వమంత చక్కనిది. చంద్రుని గుణములు చాలా చక్కనివి. అందువల్ల నతని నాబాలవృద్ధంబుగఁ బ్రజలెల్లరు బ్రేమింతురు. అదేవిధముగఁ బ్రజల కష్టసుఖములను దమ కష్టసుఖములుగాఁ జూచుకొనుచుఁ జక్కఁగఁ బరిపాలించెడు ప్రజానాయకులు లోకమున కెంతయుఁ బ్రీతిసంసేవ్యులగుదురు. అప్పుడు దేశము రాజన్వంత మని పించుకొని బహువిధగతుల వర్ధిల్లఁగలదు. ఇఁకఁ బ్రజాపీడనమే తమ సౌఖ్యముగాఁ జూచుకొనుచు రాజ్యముచేసెడి నాయకులు లోకాదృతి నెడఁబాసి చివరకు నామమాత్రావశిష్టు లగుదురు. అప్పుడు దేశము కేవలము రాజవంతమై యుండుఁగాని యేమాత్రము వృద్ధిఁబొందఁజాలదు.

కాబట్టి దేశము యశస్వంతము, శోభావంతము, బుద్ధిమంతమునై వర్ధిల్లవలయుననిన నుత్తమసత్వములు గల మహోదారులు ప్రజానాయకులు గావలయును. ఇఁకఁ దక్కటివా రెందరున్నను బ్రయోజనముండదు ఇది యర్థాంతరన్యాస

రూపముతో నీశ్లోకమున నాజూకుగాఁ బసచేసియున్న దివ్యసందేశము. ఎప్పుడైనను బాగుపడఁదలఁచిన దేశముల కిది విధిగాఁ బాటింపఁదగ్గ యమూల్యసందేశము. ఈసందర్భమున—

రాజన్స్వాన్ సౌరాజ్యే. పాణినీయం, 8-2-14.

రాజవానన్యత్ర. సిద్ధాంతకౌముది.

ఈవ్యాకరణాంశములు సందర్శనీయములు. ఉత్తమపరిపాలనఁగల దేశము రాజన్వంతము. దానికి వ్యతిరేకమైన ప్రభుత్వముఁ గల దేశము రాజవంతము. ఇది వీని సారాంశము. ఉత్తమాధమప్రభుత్వములు గల దేశములకు భారతవ్యాకరణశాస్త్ర మేర్పాటుచేసిన గుర్తులివి.

కౌశికేన స కిలక్షితీశ్వరో,
రామమధ్వరవిఘాతశాంతయే;
కాకపక్షధరమేత్య యాచిత,
స్తేజసాంహినవయః సమీక్ష్యతే.
(సర్గ 11. శ్లో. 1.)

అధ్వరవిఘాత శాంతినిమిత్తము రామలక్ష్మణులను తన వెంటఁ బంపుమని కౌశికుఁడు దశరథుని నర్థించినాఁడు.

అధ్వరవిఘాతకృతులు బలాతిబలులు రాక్షసులు. కేవలము ముక్కుపచ్చలారని పసిబాలురు రామలక్ష్మణులు. అయినను వారు మామూలు పసికూనలుగా, రనస్య తేజసులు. అట్టి నిస్తుల తేజులయందలి గుణమే కాని, వయస్సు గణింపఁబడదు. కాబట్టి తేజస్వితాద్యుత్తమసత్వములు గలవారు కేవలము బాలురే యైనను, లోకమున కారాధ్యులే కాఁగ

లరు. పూజ్యస్థానములు గుణములే, కాని, వయోలింగములు కావు. ఇది యీ శ్లోకమందర్థాంతరన్యాసవేషమున నున్న సుమనస్సందేశము. ఇట్టి సుసందేశము లక్కావ్యమం దింకను గలవు. ఇవి కేవలము మచ్చుఁదునకలు.

అజరాజమౌళికి ఘోరాతిఘోరమైన విపత్తు సంభవించినది. వసిష్ఠమహర్షి యతనికిఁ గులగురువు. కాబట్టి రారాజున కప్పుడు దుఃఖోపశమనము చేయవలసిన బాధ్యత యతని కున్నది. కాని, యప్పుడతఁ డధ్వరదీక్షితుఁడు; కనుకఁ, గదలఁగూడదు.

మరి, యది కేవల ముపేక్ష చేయఁదగిన సమయమును గాదు. అదిగాక, యతఁడారితేరిన సమయాసమయ విదుఁడు. కనుక నతఁ డప్పుడు నాకేమి యని యూరుకొనఁజాలఁడు; మరి, వెళ్లను జాలఁడు. దీక్షాభంగము కాకూడదు; పని నెరవేరవలయును. ఇఁకప్పుడు ప్రాతినిధ్యమే శరణ్యము. అదియు మంచి నైపుణ్యముఁ గల శిష్యునిదైన మంచిది.

రుదతాకుతఏవసాపున, ర్భవతా నానుమృతాపి లభ్యతే;
పరలోకజుషాంస్వకర్మభి, ర్గతయోభిన్నపథాహి దేహినాం.
(సర్గ॥ 8. శ్లో॥ 85.)

సపృథగ్జనవచ్ఛుచోవశం, వశినాముత్తమ! గంతు మర్హసి;
ద్రుమసానుమతాంకిమంతరం?యదివాయౌద్వితయేపి తేచలాః.
(సర్గ॥ 8 శ్లో॥ 90.)

ఇవి యట్టి గురుశిష్యుఁ డప్పుడు రాజగృహామునకుఁ దైకొని తెచ్చిన శాంతిసందేశమందలి శ్లోకములు.

రాజా! ఎంత యేడ్చినను బ్రయోజనములేదు. ఇఁక నూరడిల్లుము. దేహుల గతులు వానివాని కర్మలనుబట్టి భిన్నపథంబులుగా నుండును. కాబట్టి నీవిఁక ననుమృతుఁడ వైనను మహారాజ్ఞిని కలుసుకోఁజాలవు.

మరియు, నీవు జితేంద్రియుఁడవు. కాబట్టి పామరునివలె శోకపశుఁడవు కాకూడదు. గాలికి ద్రుమములు కదలును; కాని, సానుమంతములు చలింపవు. ఒకవేళ నవి కదలినచో వానికిఁ జెట్లకుఁ నేమియు నంతర ముండదు. అట్ల నీవిప్పుడు నీజితేంద్రియత్వమును వీటిబుచ్చిన, నీకును ఇతరులకు నేమియు భేదముండదు. కనుక, నీవిఁక శాంతించుట మంచిది. ఇది సారాంశము. ఈసందేశ మెంతో పెద్దది కాదు. కాని, యిందుఁగల మాటల నేర్పరితనము, పలుకుల పొందిక, శబ్దముల యౌచిత్యము, భావలాలిత్యము ఒకదానితో నొకఁటి చక్కఁగ వియ్యమంది హృదయ స్పృశంబులై తనరుచున్నవి. ఈసందేశము మహర్షి తానే స్వయముగఁ దెచ్చిన నింత యందగించియుండెడిది కాదు. ఇది మహాకవి యెఱుఁగక పోఁడు. వసిష్ఠుఁడు యజ్ఞదీక్షితుఁడగుటకు, శిష్యుఁడు సందేహ వహుఁడగుటకును ఇదే మూలము. ఇందువల్ల నొకచోట సమయౌచిత్యము మంచిగఁ బరిపుష్టమైనది; మరొకచోటఁ బ్రయోజనముఁ బూర్తిగ నెరవేరినది.

ఈసందేశమునకు మూలము రఘువంశకథలకు నాధార భూతములైయున్న వాయు విష్ణు నృసింహ పద్మపురాణము లందుఁగాని యితరత్రఁ గాని కంచుకాగడ వెలిగించి గవేషించి.

నను గనఁబడకున్నది. మరి యింకెక్కడ మరుగుపడియున్నదో. లేకున్న నొకవేళ నిదంతయుఁ గవిలోకవదాన్యుని యాద్యసృష్టి యేమో. ఏమైనను, లోకాచారమున కిది నేదిష్ఠమే కాని, యెంతమాత్రము దవీయము కాదు

ఇఁక, భౌగోళిక విషయములు. అవియుఁ గావ్యమందు మస్తుగ నున్నవి. అవి యందలి చతుర్థ షష్ఠ త్రయోదశ సర్గములందు దృక్సమ్మతముగ నిమిడి మనోహరముగఁ గనఁబడుచున్నవి. కావ్యయుగమందలి సంస్కృతకవి సమాజమందు భౌగోళికాంశములను లెస్సగఁ బరికించి చక్కఁగఁ జిత్రించిన వారిలోఁ బ్రప్రథముఁడు మహాకవి కాళిదాసు. అతనికిఁ దరువాతఁ గల కవిలోకమునఁ గూడ నతనివలె నావిషయముల నంతయుదిగాఁ దడివిచూచినవా రింకొక రేరును లేరనియే చెప్పవచ్చును. అవి యతని కనుభవపూర్వకముగా లభించిన విజ్ఞాన కుసుమములు.

తరువాత, కావ్యమందలి సప్తమసర్గమున హైందవ వైవాహిక దృశ్యము స్వాభావికశోభలతో మిసమిసలాడుచున్నది. మొత్తముమీఁదఁ గాళిదాసు ప్రతివిషయమును బాగుగాఁ బరికించి చూచిన లౌక్యుఁడుగాఁ గనఁబడుచున్నాఁడు.

పరస్పరేణ స్పృహణీయశోభం,
నచేదిదంద్వంద్వమయోజయిష్యత్;
అస్మిన్ద్వయేరూపవిధానయత్నః,
పత్యుః ప్రజానాం వితథోఽభవిష్యత్.

(శ్లో॥ 14.)

ఇది యిందుమతీ రఘునందనులను జూచినప్పుడు పౌరకాంతలు తామొకరితో నొకరు ముచ్చటించుకొనెడు సందర్భమందలి శ్లోకము. ఇవ్వధూవరు లిరువురు నిజముగాఁ జక్కని చుక్కలు. ఒకవేళ విధాత్రుఁ డీద్వంద్వము నేకముచేయకుండిన నతఁడిందు నిమిత్తము చేసిన రూపవిధానయత్నమంతయు నిష్ఫలమై యుండెడిది. ఇవి యమ్మహిళల పారస్పరిక ప్రసంగములు. ఆసమయమున వారి యంతస్సంతుష్టికిఁ బరిమితి యుండక పోవచ్చును.

ప్రదక్షిణప్రక్రమణాత్కృశానో,
రుదర్చిష స్తన్మిథునం చకాసే;
మేరోరుపాంతేష్వివ వర్తమాన,
మన్యోన్యసంసక్తమహ స్త్రియామం.

(శ్లో॥ 24.)

ఇది వధూవరు లగ్నికిఁ బ్రదక్షిణ మొనర్చెడి సందర్భమందలి శ్లోకము. కృశానుఁ డూర్ధ్వజ్వాలుఁడై యున్నాఁడు. అప్పు డతనికిఁ బ్రదక్షిణముచేయుచున్న యావధూవరులు మేరువు యొక్క యుపాంతముల నన్యోన్యసంసక్తములై తిరిగెడు అహ స్త్రియామములో యన్నట్లు ప్రకాశించిరఁట.

ఇవి యాపయామిక తరుణములందు నెల్లప్పుడు జరిగెడు సాధారణ విషయములు. అయినను, గవిశేఖరుని దివ్య కవిత్వనేపథ్యము వీని నక్కడంత సొగసుగా మార్చివైచినది. మామూలు విషయములను దీసికొని వానిని బహుసుందర-

ముగా నలంకరింపఁగల చాతుర్య మతని సొంతయాస్తి కాఁబోలు! కుమారసంభవమందలి సప్తమసర్గమునఁ గూడ వైవాహిక దృశ్య మున్నది. కాని, రఘువంశమందలి దృశ్యము తనూక రింపఁబడియుండఁగాఁ గుమారసంభవమందలిది పృథూకృతమై యున్నది. అయినను, జూడ ముచ్చటయ్యెడి త్రిట్క్రాణంబులను గురిపించుటయం దవి రెండును ఒకదానికొకటి తీసిపోవునవి కావు. కుమారసంభవమందలి పృథూకరణ మొకవిధముగా శోభించుచుండ, రఘువంశమందలి తనూకరణ మింకొకవిధ ముగా శోభించుచున్నది.

ఆ పెండ్లిపనులు, ఆయలంకృతులు, ఆయూరేగింపులు, ఆయాలోకినీజనసన్నివేశములు, ఆయంతర్గత భావాలు, ఆయా చారక్రియలు, ఆవధూవర సహజకృత్యములు, ఆగౌరవక్రియలు—నిజముగా నవన్నియు ముద్దులుమూటఁగట్టెడి నగిషీలతో నేకమై రుచిరరుచిరంబులగు శోభిస్సులను దశదిశల కెగఁదోయుచున్నవి. అది యతని కవితావిభూతి.

ఈవిధముగా రఘువంశమహాకావ్య మందుఁ గల వివిధ కథల యనితర కవితాసౌందర్యమువల్లను, మానవాభ్యుదయ సిద్ధి కవశ్యగ్రాహ్యముగా నందిల్లుగట్టి కాపురించియున్న యాయగణ్యనైతికసంపదవల్లను, అనుభూతికి దూరముకాని తదీయ మానవసంబంధమువల్లను ఎన్నఁడును దరుగులేని భారత జాతీయనిధిగా సార్వజనీనమై ప్రద్యోతించుచున్నది. మహాకవి దిలీపుఁడు మొదలు లగ్నివర్ణుని వరకుఁ గల మనువంశీయులను

మాత్రమే తన కావ్యమునకు నాయకులనుగాఁ దీసికొని యున్నాఁడు. కాని, వాయు విష్ణు పురాణాదులనుబట్టి చూచి నచో దిలీపునకుః బూర్వము అగ్నివర్ణునకు వెనుకను ఇంకను ఎందరో రాజులున్నట్లు తెలియుచున్నది.

లోకమును సదుపదేశములతో బాగుపరచునది కావ్యము. కాబట్టి యందలి కథావస్తువు మహోదాత్తమైనదై యుండవలయును. మరియు, నది ప్రబంధనిబంధనల కనుకూలించునదిగా నుండవలసియున్నది. ఇఁకఁ బోఁగా, నకావ్యము శ్రమనుదంబులగు మనోహర కథాంశములతో నాతిదీర్ఘముగను నాతిహ్రస్వముగను సమకూరుట యావశ్యకము.

అటువంటప్పుడు సుకుమారభావస్రుజుఁ డమ్మహాకవి యట్లుచేయుట తప్పుమియే కాఁగలదు. ఇఁకఁ గావ్యమందలి యారంభావసానము లెల్లప్పుడు నవనవరోచిస్సులతోఁ గలకల లాడుచుఁ గులుకవలయునని కావ్యకృత్తుని యంతరుద్దేశము. రఘువంశమందలి యారంభావసానములు నిజముగా నవ్యానవ్యములు, విశ్వజనీనములు నై మెలఁగుచున్నవి. అది యతని తపస్సిద్ధి మహిమ. ఇఁక ఇప్పుడు, కాళిదాసు తన కబ్బమునకు నాయకవర్గము నెన్నుకొనునప్పుడు వినియోగించిన కుశలత మనోహరమైనదని చెప్పక తప్పదు. తపస్సిద్ధులు, రససిద్ధులు నగు మహాకవులే యారంభమును దగినంత కారణములేకుండ నారంభింపరు. కవిరాజు తన కావ్యమునకు "రఘువంశ" మని పేరుపెట్టెను. రఘువంశ మను పేరుతో నున్నప్పు డందు రఘువు లోనుగాఁ గల నాయకుల

చరిత్రలేకాని, యతనికి ముందుఁగల నాయకుల చరిత్రలు ప్రవేశింపఁగూడదు. అతఁడు దిలీపునకు ముందుఁగల రాజుల కథలను దీసికొనకపోవుట కిదియు నొక ప్రబలకారణము.

సుదక్షిణా దిలీపులు రఘుసంభూతి కాధారభూతులు. దానంజేసి, రఘువంశమహాకావ్య మాపుణ్యదంపతుల పవిత్ర చరిత్రతోఁ దలయెత్తినది. అయినను, మిగిలిన తదీయ వంశ్యులను మహాకవి బొత్తిగా విడిచిపెట్టలేదు. గ్రంథారంభమునఁ బీఠికగా నున్న యీ"తదన్వయే శుద్ధిమతి", "క్వసూర్యప్రభవోవంశః" శ్లోకములందు వారల ప్రశంసలు తదీయ సంజ్ఞా సంస్థితి కడ్డమురాకుండ బహు సుకుమారముగఁ బ్రతిఫలించుచున్నవి. ఆప్రశంసలయందు వారి మహత్త్వాది సుగుణసంపదను సమష్టిగాఁ గనవచ్చును. కాని, యది బుద్ధిమత్తరులు చేయఁగల పని. మూలమందలి కథాంశములను సమయానుకూలముగా మార్చుటయందుఁ గాళిదాసు చాలా నేర్పరి. ప్రమాదవశమున జరిగిన మునిపుత్రుని నిధనము మాతృకయం దతని తల్లిదండ్రుల పరోక్షమునఁ గలిగినట్లున్నది. కాని రఘువంశమునం దది యాముసలిదంపతుల కన్నులముంగటనే జరిగినట్లుగాఁ గనఁబడుచున్నది. అది నవమసర్గోత్తరభాగమునఁ గలదు. ఆమునిదంపతు లతనిని కేవలము కన్న తల్లిదండ్రులు. అతఁడు వారి కేకైకపుత్రుఁడు. అంతేగాదు, వారప్పుడు కాటికిఁ గాళ్ళుచాపుకొనియున్న వృద్ధాతివృద్ధులు. అటువంటప్పు డాదుర్భరదృశ్యమును గన్నులారఁ జూడవలసివచ్చినందు

కావృద్ధదంపతుల మనస్సు లప్పు డెంత కలఁగిపోయెనో! అది వాగగోచరము.

కేవలమొక వారి హృదయములే కాదు, పాఠకశ్రోతల మనస్సులు గూడఁ గరఁగిపోఁగలవు. ఇఁక దర్శకహృదయముల నుద్దేశించి వేరుగఁ జెప్పనక్కఱ లేదు. అందుఁగల యీమహత్తర శక్తి యంతటి హృదయద్రావి. కవిరాజమహేంద్రుఁడు గావించిన యీమార్పువల్లఁ గావ్యమున కక్కఁడొక మహత్తరమైన నాటకీయ ప్రయోజనము స్వయముగ సిద్ధించినది. అట్టి మనఃస్పృక్పరివర్తన లక్కావ్యమం దింకను ఉన్నవి. అవన్నియుఁ గవికులపూజితుని చాతురీవిహారములు. కావ్యమందుఁ గల రామచరితము వాల్మీకి రామాయణమందే కాక, నృసింహ విష్ణుపురాణాదులఁ గూడ నున్నది. కాని కాళీదాసుని రచన కాదికావ్యమే మాతృక యని చెప్పవచ్చును. తరువాతఁ గావ్యాది నాక్రమించియున్న దిలీపుని వృత్తాంతమునకుఁ బద్మ పురాణము మూలముగా నిలువఁజాలియున్నది. ఆచరిత్ర యందలి యుత్తరఖండమునఁ గనఁబడుచున్నది. కాని, యీ రెండింటికిఁ గొంత యంతరమున్నది. రఘువంశమందలి దిలీప సింహముల సంవాదము మాతృకలోని సంవాదమును మించి యున్నది. అందలి యాదీర్ఘీకరణము కావ్యమున కొక విధమైన చక్కని జిలుఁగుఁదనముఁ గలిగించుటయే కాక, కథానాయకుని ధీరోదాత్తతను బహుసుందరముగఁ బైటఁబెట్టుచున్నది. ఇక, మహాకవి కురిపించిన యీపలుకులును బహువిధ సుఖశ్రవములు.

రాజదంపతు లాశ్రమముఁ జేరునప్పటికి సాయంసమయ మైనది. అంకలి మునులు వారికి సుస్వాగతమిచ్చిరి. అది వసిష్ఠుఁడు సాయంవిధి నెరవేర్చుకొనెడి తరుణము. అందువల్ల వారికి మునిదంపతుల దర్శనము కొంతతడవైనపిమ్మటఁగాని వెంటనే కాలేదని రఘువంశము చెప్పుచున్నది. వారి కప్పుడు వారి దర్శనము వెంటనే యైనట్లు మూలకృతి వాదించుచున్నది. మరియు నయ్యెడ రఘువంశమందుఁబలె స్వాగతవిషయ మగపడదు. అదంతయుఁ గాళిదాసుని రమణీయ పరివర్తన. అతని దృక్పథమునఁ బ్రభుత్వశక్తికంటెఁ దపశ్శక్తి మహత్తరమైనది. ఇక, మిగిలిన నాయికానాయకుల వర్ణనలు, మార్గాశ్రమవర్ణనలు, హిమాచలపరిసరదృశ్యవర్ణనలు లోనుగాఁగల యంశజాతమంతయు నతని సొంతయాస్తికిఁ జెందిన పసిఁడిపంట. పుత్రోత్పత్త్యుపాయగ్రహణనిమిత్తము రాజదంపతుల మున్యాశ్రమప్రయాణము మొదలు రఘూదయమువరకుఁ గల కథ మాత్రమే పద్మపురాణమందు లభించుచున్నది.

ఇఁకఁ గావ్యమందలి రఘ్వాజుల జీవితాంశములకును కుశాదుల జీవితాంశములకును మూలాధారము లింతవరకు వెల్లడికి వచ్చిన గ్రంథములం దెందును గనఁబడుటలేదు. ప్రస్తుత ముదాహరణములుగా రఘుసార్వభౌముని దిగ్విజయ యాత్రను, రఘువరతంతుల సమాగమమును, అజుని యుద్ధమును ఇందుమతి మరణమును, కుముద్వతీపరిణయమును గైకొన వచ్చును. పైనఁ జెప్పిన విధముగా వీని కాధారము లెక్కడఁ

జూచినను గనఁబడకున్నవి. మరియు నివి కాళిదాసుని కేవల కల్పితకథలును గాఁజాలవు. కాని, వీనికాధారభూతము లైన కృతులు నిన్నమొన్నటివరకు భాసుని కృతులు మరుగుపడి యున్న ట్లెక్కడో యజ్ఞాతముగ మూలమూలలఁ బడియుండ వచ్చును. ఏదెట్లున్నను మొత్తముమీఁద రఘువంశము లోక మునకు సమగ్రారాధ్యమగు పవిత్రగ్రంథము. అందుఁ జిత్రింపఁబడిన కథానాయకులలో దిలీప రఘు రామచంద్రు లతిభూమి నధిగమించియున్నారు. ఈ—

క్షతాత్కిల త్రాయత ఇత్యుదగ్రః,
క్షత్రస్య శబ్దో భువనేషు రూఢః;
రాజ్యేన కిం తద్విపరీతవృత్తేః,
ప్రాణై రుపక్రోశమలీమసైర్వా.

(రఘు॥ స॥ 2. శ్లో॥ 53)

మాదిరిగాఁ బరుల యోగక్షేమములను సంరక్షించుటకుఁ దమ యోగక్షేమములను 'సైతము బలియిచ్చెడు మహోదార పురుషులు వారు. వారెట్టి త్యాగమునకైనను సంసిద్ధులు కాఁగలరు; కాని, మలీమసంబగు జీవితానుభూతికి మాత్రము రవ్వంతయు నియ్యకొనఁ జాలరు. మొత్తముమీఁదఁ బరపీడ్యా మోహ మెఱుఁగని యాపన్నరక్షకులు వారు. అది వారికి నుగ్గుపాలతో నే యలవడిన రాజధర్మము.

వారు మూగురు నొకరిని మించినవా రొకరు.

ప్రజానాం వినయాధానా, ద్రక్షణాద్భరణాదపి ;
స పితా పితరస్తాసాం, కేవలం జన్మహేతవః. 1-24

మందోత్కంఠాః కృతా స్తేన, గుణాధికతయా గురౌ ;
ఫలేన సహకారస్య, పుష్పోద్గమ ఇవ ప్రజాః. 4-9

తేనార్థవాన్ లోభపరాఙ్ముఖేణ,
తేనఘ్నతా విఘ్నభయం క్రియావాన్ ;
తేనాస లోకః పితృమాన్వినేత్రా,
తేనైవ శోకాపనుదేన పుత్రీ. 14-23

ఇవి కాళిదాసుగారు తీసి దాచిన వారివారి ప్రభుత్వసంవిధా చిత్రములు. ప్రజల రక్షణ పోషణాది బాధ్యత వహించిన వాఁడు దిలీపమహీపతి. అందువల్ల వారి కారోజులలో నతఁడే యసలైన పిత. ఇఁక, వారి తల్లిదండ్రులు కేవలము జన్మమాత్ర కారకులు. అది లోకమునందంతటఁ జక్కని శిక్షణోత్సవముల నిమ్ముగఁ బ్రసరింపఁజేసిన యొక మధురాతి మధురయుగము. ఆ యుగమంత స్పృహణీయముగ రూపొంది యుండుటకు మూలము బహువిధవిజ్ఞాన మహుఁడు దిలీపుఁడు.

ఇఁకఁ దండ్రిని మించినవాఁడు కుమారుఁడు. రఘుమహీపతి ప్రభుత్వకాలమునఁ బ్రజలు వెనుకటి భూపాలుని యెడలఁ బూర్తిగ మందోత్కంఠులై పోయిరి. అతని ప్రభుత్వ విధాన మంత యుత్తమోత్తమమైనది.

వారిరువురిని మించి తనకు సాటి తానయ్యై ఖ్యాతికెక్కిన వాఁడు రామమహీపతి. అతని కాలమునఁ బ్రజలు మంచి రక్షణ పోషణ శిక్షణలను గలిగియుండెడివారు. విచారమనునది యెట్లుండునో యా కాలమువారి కించుకంతయుఁ దెలియదు. అందువల్ల లోకమప్పుడొకవైపు పితృమంతము, మరొకవైపు పుత్రివంతమునై కలకల లాడుచుఁ గులుకుచుండెడిది. ఆ జగదేకపతి యా రోజులలోఁ బ్రజల నొకమారు తండ్రిరూపము గను, మరొకమారు పుత్రరూపముగను ఆనందింపఁ జేయు చుండెడివాఁడు. అమ్మహానీయుఁడు కేవలము లోభపరాఙ్ముఖుఁడు. అక్కతమున లంచగొండితనమున కాయుగమునందు నిలువనీడైనను దొరకక పోయెను. అతఁడపూర్వదివ్యతేజస్వి. అందువల్ల నాఁటిప్రజ యెన్నఁడుఁ గార్యసిద్ధులనే కాని ప్రత్యూహముల నెరుఁగదు. అది కేవలము పుణ్యములను బండించిన సత్యయుగము. కాబట్టి, నాఁటి జనత సదా సంపత్సమేత.

పాలకుని యెడల భయభక్తులు, ప్రేమవిశ్వాసములు, చనవుఁ గలవారు పాలితులు. పాలితులయెడల వాత్సల్యాదరములు, రక్షణపోషణాది బాధ్యతలుఁ గలవాఁడు పాలకుఁడు. నాఁటి పాలిత పాలకుల నడుమఁగల యా యుత్తమోత్తమ సంబంధ మట్టిది.

అది యా పురుషోత్తముని ప్రభుత్వ విధానగరిష్ఠత. కవికులతిలకుని మతానుసారముగా దేశాభ్యుదయ మభిలషించెడి ప్రజాపాలకుని ప్రవర్తన యింకను,—

సమృగయాభిరతి ర్న దురోదరం,
న చ శశిప్రతిమాభరణం మధు;
తముదయాయనవానవయావనా,
ప్రియతమాయతమానమపాహరత్. 9–7

ఇట్లుండవలయును. మృగయాదురోదరములయం దనభిరతుఁడు, వ్యభిచార మద్యపానాదుల యెడలఁ బరాఙ్ముఖుఁడు నగు ఉత్తమోత్తమపవ్రర్తి ప్రజాస్వామిగా నున్నప్పుడు దేశమన్ని తెరంగుల పురోగమించి శోభింపఁగలదు. ఇంచుమించుగా రఘువంశమందలి కథానాయకులందరు మహోదారచరిత్రులు గానే చిత్రింపఁబడియున్నారు. వారలలో దిలీప రఘురాముల చిత్రములింకను మనోహరముగ నున్నవి. అందు రఘు రామ భూపాలుర చిత్రములు మరింత బాగున్నవి. అందులోఁ గేవలము శ్రీరాముని చిత్ర మసమవోచులతో ధగధగ మెరసి పోవుచున్నది.

అసలు కాళిదాసుని నాయికా నాయక పాత్రసృష్టి కేవల మద్వితీయము. అందుఁ గేవలము జగత్పితరులగు సీతారాముల పాత్రసృష్టి యద్వితీయ శోభలతో నధిభూమి నధిగమించి యన్ని విధముల నంతశ్స్పర్శమైయున్నది.

అభ్యుత్థాన మర్థించెడి మానవలోకమున కాపుణ్య దంపతుల పవిత్రజీవిక లేక్కై కాదర్శములను పరమార్థమాదివ్య సృష్టి నధివసించియున్నది.

వాగర్థావివసంపృక్తౌ, వాగర్థప్రతిపత్తయే;
జగతఃపితరౌ వందే, పార్వతీపరమేశ్వరౌ.

ఇది గ్రంథారంభమందలి శ్లోకము. రఘువంశమీ శ్లోకముతోఁ దలయెత్తినది. జగదేక పితరులగు పార్వతీ పరమేశ్వరుల కలయిక యనన్యమైన వాగర్థముల సంయుక్తిఁ బలె ననంతము మనోహరమునై యెల్లప్పుడు వర్ధిల్లుచుండును. మరి యతనికిఁ గావలసినది మామూలు వాగర్థప్రతిపత్తి కాదు. అది యనూనమైనట్టి శాశ్వత మనోహరముగా వర్ధిల్లెడు నిగ్గయిన వాగర్థ ప్రతిపత్తి. అబ్బా! ఎంత గడుసుఁదనము! ఇందలి భావగాంభీర్యము కొలతకందదు. అనన్యమైన వాగర్థములు చేపడునేని, తాను రచింపఁబోయెడి కృతి యెల్లప్పుడు స్పృహణీయముగాఁ బొడతెంచుచుఁ జిరంజీవిగా వర్ధిల్లఁగలదని కవితల్లజుని యాంతర్యము కాఁబోలు. ఆయుపమయందుఁ గల సౌష్ఠవ మంతటి మహత్తరభావనా భావి. దీనినిబట్టి కవి దీర్ఘదర్శియుఁ బరమలౌక్యుఁడు నని ఖండితముగాఁ జెప్పవచ్చును. ఇఁక నిప్పుడు కావ్యమునంతనుబట్టి చూడనక్కరలేదు. ఈయొక్క శ్లోకమునుబట్టి యది బహు శుభగతఁగల కావ్యరత్నమని తొలదొలుతనే నిశ్చయించి ప్రవచింపవచ్చును.

వసుధైకరక్షణభారము వహించి నిరుపమానముగా రాజ్యముచేసి మించిన రఘురామభూపాలుర కథాఘట్టములందును దదితర కథాఘట్టములందును చలనములేని సుస్థిర నివాసమేర్పరచుకొని హాయిగా ఘుమఘుమలాడెడు ఆరామణీ

యక పరీమళములకీ ప్రాథనాశ్లోక మొకేయొక చక్కని మచ్చుముక్క. ఇందలి రోచిఃప్రసారముల సత్రికత యట్టిది.

గర్భందధత్యర్కమరీచయోఽస్మా,
ద్వివృద్ధి మత్రాశ్నువతే వసూని;
అబింధనం వహ్ని మసౌ బిభర్తి,
ప్రహ్లాదనం జ్యోతి రజన్యనేన. 4.

ఇది పదమూడవసర్గములో రామచంద్రుఁడు సీతాదేవితో సాగరమునుగురించి ప్రసంగించెడి సందర్భమందలి శ్లోకము. సూర్యుని కిరణములు సాగరమువలన గర్భము ధరించుచున్న వని యిందలి పై చరణము పలుకుచున్నది. అనఁగా, సూర్య కిరణములు నీటిని గ్రహించుచున్నవని యర్థము. సముద్రాది జలాశయములందలి నీరు సూర్యకిరణముల వేడిమికి ఆవిరిగాఁ బరిణమించి పైకిఁ బోవును. అదియే మేఘముల గుంపు. అనఁగా, గాలిలో నెగిరెడు ఆవిరియే మేఘములని తాత్పర్యము. ఆ మేఘములు క్రమముగాఁ జల్లపడి వర్షించును. దీనినిబట్టి సూర్యకిరణ సముద్రముల పొత్తువల్ల వర్షములు కలుగుచున్న వని తెలియుచున్నది. ఇప్పుడు పరిశీలించి చూచినయెడల ఆపాదమందు మేఘవర్షములను పదార్థముల యుత్పత్తి క్రమ మంతయు నాజూకుగా నిమిడియున్నదని గట్టిగా నొక్కి చెప్ప వచ్చును. పదార్థశాస్త్రమంతయు (Physics) కాళిదాసునకుఁ గరతలామలకమై యుండెననుట కీశ్లోక మొక చక్కని నిదర్శనము. ఇది త్రయోదశసర్గములోని శ్లోకమని పైన వ్రాసితిని.

ఆ సర్గము నదీనద సముద్రాదులకు సంబంధించెడు చక్కని ప్రకృతివర్ణనలతోఁ గలకలలాడుచున్నది.

అందుఁ గల గంగా యమునా నదుల సంగమవర్ణన నితాంతరమణీయము.

క్వచిత్ప్రభా లేపిభి రింద్రనీ లై,
ర్ముక్తామయీయష్టిరివానువిద్ధా;
అన్యత్ర మాలా సితపంకజానా,
మిందీవ రై రుత్ఖచి తాంత రేవ. 54.

ఇది యీ సందర్భమందలి శ్లోకములలో నొకఁటి. యమునా తరంగముల కలయికవల్ల గంగ కొకవిధమయిన యపూర్వశోభ యబ్బినది. అందువల్ల నది యొకచోటఁ బ్రభలతోఁ గూడిన యింద్రనీలములతో ననువిద్ధమైన ముక్తామయయష్టివలెను, మరొకచోట నడుమనడుమ నీలోత్పలములతోఁ గూడిన సిత పంకజముల మాలవలెను జూడముచ్చటైన సౌభాగ్యములను గురిపించుచున్నదఁట.నిజముగా ఇది నిత్యయౌవనముగల స్పృహణీయవర్ణన. పంచమసర్గాంతమునఁ గల ప్రాభాతికవర్ణనయు నవమసర్గమందలి వసంతవర్ణనయుఁ గూడ నింతటివని నుడువ వచ్చును. అందును బ్రకృతివర్ణన సొంపుగా ముమ్మరించి యున్నది. వసంతవర్ణన మొక రఘువంశమందే కాక, కుమార సంభవమందును గలదు. అదియుఁ జక్కని ప్రకృతివర్ణనల శాలయమై యున్నది. అది తృతీయసర్గము.

సంత_స్తస్యాభిగమనా,దత్యర్థంమహతఃకృశాః;
ఉదధేరివజీమూతాః, ప్రాపుర్దాతృత్వమర్థినః. 72.

ఇది పదునేడవ సర్గమందలి శ్లోకము. ఇందలి తృతీయచరణ మందుఁగూడ మేఘవర్షముల యుత్ప_త్తిక్రమము కనఁబడు చున్నది. అతిథి నరేంద్రుని దాతృత్వగరిమను గురించి ప్రసంగించెడి సమయ మందలి శ్లోకమిది.

మేఘవర్షముల యుత్ప_త్తివిధాన మీ విధముగా నొక రఘువంశమందే కాక, కుమారసంభవకావ్యమందుఁగూడ—

తదిదంపరిరక్షశోభనే!
భవితవ్య ప్రియసంగమంవపుః;
రవిపీతజలాతపాత్యయే,
పునరోఘేనహియుజ్యతేనదీ. 4-44.

ఇట్లు కనఁబడుచున్నది. ఈ శ్లోకమందలి మూడు నాలుగు పాదములయందు దానిని సుస్పష్టముగాఁ గనవచ్చును. అది పై శ్లోకమందుపమారూపముగను గ్రిందిశ్లోకమునం దర్థాంతరన్యాసరూపముగను ఇమిడియున్నది. ఇది యాకాశవాణి రతీదేవిని మరణవ్యవసాయమునుండి తొలఁగించి యూరడించెడి సమయమందలి శ్లోకము. ఆ ఘట్టమును గుమారసంభవకావ్యవిమర్శయందుఁ బ్రస్ఫుటముగాఁ గనవచ్చును. మేఘములకు సముద్రుఁ డెన్నఁడును రి_క్తహ_స్తములను జూపి యెరుఁగని మహోదాత యని పై శ్లోకమందలి యలంకారమును, ఎండకాలములో

నెండిపోయెఁడు నది వర్షకాలములోఁ దిరిగి ప్రవహింపఁగలదని కిందిశ్లోకమందలి యలంకారమును దెలియఁజెప్పుచున్నవి. ఆ తెలియఁజెప్పుటయందే తదీయ విధానము గర్భీభూతముగా నావరించియున్నది.

ఈ సుముహూర్తమున రఘువంశమహాకావ్యమందలి దశమసర్గమునందు హాయిగా విశ్రమించియున్న—

తాభిర్గర్భః ప్రజాభూత్యై,దధ్రే దేవాంశసంభవః;
సౌరీభి రివ నాడీభి, రమృతాఖ్యాభి రమ్మయః, —58

ఈశ్లోకమును బరామర్శించి చూచినచోఁ దదీయ విధానమును గురించి యింకను విశేషముగా నరయవచ్చును. ఇది దశరథ నరేంద్రుని భార్యలు గర్భవతులయిన సందర్భమందలి శ్లోకము. ఇందలి యుపమయందుఁ దదీయ ప్రశంస పొడుకొనియున్నది. అమృతాఖ్యలు సూర్యసంబంధములు నగు నాడులు జలమయ గర్భమును ధరించునని యీశ్లోకమునం దుపమాలంకారముతో నిమిడియున్న చివరి రెండు పాదములు సంభాషించుచున్నవి. ఇప్పుడు మల్లినాథబుధేంద్రుఁడు తన సంజీవనీవ్యాఖ్యయం దెత్తివ్రాసిన—

తాసాంశతానిచత్వారి,రశ్మీనాంవృష్టిసర్జనే;
శతత్రయం హిమోత్సర్గే, తావద్గర్భస్యసర్జనే.
ఆనందాశ్చహిమేధ్యాశ్చ, నూతనా పూతనా ఇతి;
చతుశ్శతంవృష్టివాహా, స్తాస్సర్వాఅమృతాఃస్త్రియః.

యాదవః.

ఈ శ్లోకముల నాకించుక గమనించుట సముచితము. సూర్యు నకు వేయికిరణము లున్నవి. అవియే నాడులు. అందుఁ గేవల మొక నాలుగువందలనాడులు మాత్రమే వృష్టి నిచ్చుచున్నవి. అవి యమృతాఖ్యలు. ఇఁకఁ దక్కటి నాడులు మంచు మొద లగువానిని గురియుచున్నవి. ఇది వీని కేంద్రభావము. ఇది కేవలము ప్రాక్తనులైన భారతీయ శాస్త్రవేత్తల దివ్య పరిశోధన.

వర్షము నీరు తియ్యగా నుండును. కాబట్టి యిప్పుడిందు వల్ల లవణ తిక్తాద్యుదకము మంచినీరగు క్రమము గూడ స్పష్టమగుచున్నది.

రసాంతరాణ్యేకరసం,యథా దివ్యంపయోఽశ్నుతే;
దేశే దేశే గుణేష్వేవ, మవస్థా స్త్వమవిక్రియః. —17

ఇది దశమసర్గములో దేవతలు శ్రీమన్నారాయణుని స్తుతిం చెడి సందర్భమందలి శ్లోకము. సహజముగా మధురమైన వర్షమునీరు తదీయపాత్రస్థానగుణములనుబట్టి వివిధరసములుగా మారుచున్నదని యీ శ్లోక మనుచున్నది. దీనివల్ల నొకేయొక ద్రవము వివిధద్రవత్వముఁ బడయు పద్ధతి తెలియుచున్నది. ఇట్టి భౌతికశాస్త్రీయవిషయము లతని రఘువంశాది కృతు లయం దింకను గలవు.

వంగానుత్ఖాయ తరసా, నేతా నౌసాధనోద్యతాన్;
నిచఖాన జయస్తంభా, న్గంగాస్రోతోఽంతరేషు సః.—36

ఇది నాల్గవసర్గమున రఘుసార్వభౌముని జైత్రయాత్రకు సంబంధించియున్న శ్లోకము. నౌకాబలసంపన్నులగు వంగీయులను సార్వభౌముఁడు జయించెనని యిది పలుకుచున్నది.

దీనినిబట్టి కాళిదాసకవీంద్రుని కాలమునఁ గేవల మొక భూసురమే కాక, నౌసమరముగూడఁ గలదనియుఁ దదీయ విజ్ఞానము కవికంఠీరవున కెంతేని గలదనియుఁ బూర్వభారతీయులు జలయుద్ధములందుఁ గూడ నారితేరిన దిట్టలనియు ఘంటాపథముగా బల్లగుద్ది చెప్పవచ్చును.

తత్రజన్యంరఘోర్ఘోరం, పర్వతీయైర్గణైరభూత్;
నారాచక్షేపణీయాశ్మ, నిష్పేషోత్పతితానలం. 77.
శరైరుత్సవసంకేతా, న్స కృత్వా విరతోత్సవాన్;
జయోదాహరణం బాహ్వో,ర్గాపయామాసకిన్నరాన్. 78.

ఇవియుఁ దదీయ ఘట్టమందలి శ్లోకములే. హిమాచలపు టధిత్యకలందు సుస్థిరప్రభుత్వము లేర్పరచుకొనియున్న యుత్సవసంకేతగణములకు రఘుసార్వభౌమునకుఁ బెద్ద పోరితము జరిగినదనియుఁ దుదకు సార్వభౌముఁడే విజయము సాధింపఁగలిగెననియు నీశ్లోకద్వయి తెలియఁజెప్పుచున్నది.

ఇప్పుడు దీనిమూలమున ఒక మహత్తరమైన రాజకీయాంశము బహిర్గతమైనది. గణమనునది భారతరాజకీయ శాస్త్రపరిభాషకుఁ జెందియున్న పదము. కాబట్టి, దానికిక్కడఁ గేవల శాబ్దికార్థమును నిర్వచింపఁగూడదు. ఉత్సవసంకేత

గణము లనఁగా నుత్సవసంకేతగణప్రభుత్వములని యర్థము. గణప్రభుత్వము లనఁగాఁ బ్రజాప్రభుత్వములు. సూక్ష్మ దృష్టిమైఁ జూచిన-చోఁ గాళిదాసు ప్రజాప్రభుత్వముల నెరిఁగిన వాఁడేయని చెప్పుటకీశ్లోకద్వయి ప్రబలదృష్టాంతమై యున్నట్లు కనఁబడుచున్నది. కాని చరిత్రను బాగుగా నవలోడించి చూచునప్పుడతని కాలమున భరతఖండములోఁ బ్రజాప్రభుత్వములున్నవని విధిగాఁ జెప్పవలసియుండును. అవి యొక కాళిదాసుని కాలమునందేకా, దంతకుఁ బూర్వమును గలవు. వేదయుగమునకుఁ గొంచెమిటీవలి కాలమునుండి గుప్తరాజుల కాలమువరకు భరతఖండములోఁ గేవల మొక యేకనాయక ప్రభుత్వము లేకాక, బహునాయక ప్రభుత్వములును, అనగాఁ, బ్రజాప్రభుత్వములును ఉండెడివని చరిత్ర లుద్ఘోషించుచున్నవి. అందుఁ గే.పి. జయస్వాల్పండితుఁడు రచించిన "హిందూపోలిటి" యను గ్రంథరాజము ముఖ్యగణనీయము. ఆయుద్గ్రంథమంతయు నాంగ్లభాషలో వ్రాయఁబడియున్నది. "హిందూపోలిటీ" యనఁగా భారతరాజ్యాంగచరిత్ర యని యర్థము.

కౌరవ పాండవుల కాలమునందు భరతఖండములోఁ బ్రజాప్రభుత్వములున్నట్లు మహాభారతగ్రంథము సూచించుచున్నది. దాని నవగమించుకొనుటకు సాహితీదృష్టితో పాటు రాజకీయదృష్టి కూడఁ గావలయును. తరువాత, వేదయుగమందలివి కూడ నొక విధముగాఁ బ్రజాప్రభుత్వము లనియే

చెప్పవచ్చును. చరిత్రమాత్రము వానిని ఏకరాజప్రభుత్వము లనియే చెప్పుచున్నది. అయినను, వానియందు—

"త్వాంవిశోవృణతాం". 3–4–2. అథర్వవేదము.
"విశస్త్వాసర్వావాంఛంతు." 6–87–1. అథర్వవేదము.
"విశస్త్వాంసర్వావాంఛంతు." 10–173–1. ఋగ్వేదము.

ఈవిధముగాఁ బ్రజాస్వామ్యసాదృశ్యము లగపడుచున్నవి. వీనిని బట్టి వేదయుగమం దెన్నికలములలో నున్నవనియుఁ గేవలము ప్రజలచే నెన్నుకోఁబడిన మహితులే రాజ్యము చేయుట కర్హులై యుండెడివారనియు స్పష్టమగుచున్నది. ఈ సందర్భమున నొక ముఖ్యవిషయము గమనింపవలసియున్నది. ఆ రోజులలో నాయకుఁడు రాజనామముతో వ్యవహరింపఁబడు చుండెడివాఁడు. అతఁడు ప్రజల యిచ్ఛానుసారముగాఁ బ్రభుత్వాసన మధిష్ఠించిన పిమ్మట సర్వాధికారిగాఁ జూడఁబడు చుండెడివాఁడు. అందువల్ల నవి ప్రజాప్రభుత్వపుటాకృతిలో నున్నను జరిత్రయం దేకరాజప్రభుత్వములుగా వ్యవహరింపఁ బడుచున్నవి. అప్పుడు గణప్రభుత్వములును గలవు. కాని, యది తదీయోత్తరభాగము.

నాఁటి యేకరాజప్రభుత్వము లిటీవలఁ బొడమిన యేక రాజప్రభుత్వములవలె నిరంకుశగాములు కావు. ప్రజల యోగ క్షేమములను వేయికన్నులతోఁ గనిపెట్టి చూచుచు ధర్మదేవ తను హాయిగా నడువనిచ్చిన యుత్తమోత్తమ ప్రభుత్వము లవి. ఆ రోజులలోఁ బరిపాలకులు పాలనాచక్రము త్రిప్పెడు.

ప్రజాపరిషత్తున నిర్ణీతకాలములందుఁ బ్రత్యేకమై యుండవల యునే కాని, మరొకవిధముగా నిరంకుశత వినియోగించఁ గూడదు. అట్లు నడువని పరిపాలకులు—

"రాజా న సత్యః సమితీరియానః". 9–92–6 ఋగ్వేదము ఈ విధముగాఁ దమతమ యోగ్యతలను బోఁగొట్టుకొను చుండెడివారు. అవసరసమయములందుఁ బరిషత్తునకు హాజరు కాని రాజు సరియైన రాజుకాఁడని దీని నిర్ణీతి. అక్కాలమం దాప్రజాపరిషత్తు "సమితి" యను పేరుతో వ్యవహరింపఁబడు చుండెడిది. ఆ సమితి యవసరమైనప్పుడెల్లఁ దన నాయకుని నెన్నుకొనుచుండెడిది.

తొల్లి భరతఖండములో నెన్నికలప్పుడు ఛందముల పద్ధతి వ్యవహృతిలో నుండెడిది. ఛందమనఁగా వోటు — vote. అది సంస్కృత పదము. ఇది యాంగ్లశబ్దము. ఇప్పుడది తెలుఁ గులో నీషత్పరివర్తనతోఁ జందా యని వాడఁబడుచున్నది. కనుక, వోటను ఆంగ్లపదమునకు ఛందము, చందా యనునవి సరియైన తెలుఁగు శబ్దములని చెప్పవచ్చును.

"సమానోమంత్రస్సమితిస్సమానీసమానంమనస్సహ-
చిత్తమేషాం" ఋగ్వేదము 10–191–3

"సమానోమంత్రిస్సమితిస్సమానీసమానంవ్రితంసహ-
చిత్తమేషాం." అథర్వవేదము 6–64–2

ఇవి సమితి నుద్దేశించి ప్రసంగించుచున్నవి. సమితిలోఁ జర్చకు వచ్చి శాసనాదిరూపములు వహింపఁబోయెడి యంశము

లన్నియు సమితికి, లేక, శాసనసభ్యులెల్లరకు సమ్మతములై యుండవలెననియు, సమితిలోని సభ్యులందరు లోకక్షేమము కొరకజస్రమేకాభిప్రాయముతో మెలఁగుచుండవలెననియు వీని యాదేశము. ఆకాలమున గ్రామపరిభుత్వములకుఁ గూడఁ బ్రాధాన్యముండెడిది. కేంద్రపరిభుత్వము సమరములను బ్రకటించుటకైనను, సంధులు చేసికొనుటకైనను దక్కటి సమ్మతులతోపాటు వాని సమ్మతులను గూడఁ బడయుచుండెడిది. అది నాఁటి పరిభుత్వ నియమము.

ఆనాఁడు సమితితోపాటు మరియొక పరిషత్తుకూడ నుండెడిది. దాని పేరు సభ. దానికి నరిష్ఠయను నామాంతరముగూడఁ గలదు. నరిష్ఠ యనఁగా—

"నరిష్ఠా అహింసితా ప్రరైరనభిభావ్యా...బహవశసంభూయ యద్యేకంవాక్యంవదేయుస్తద్ధినప్రరైరతిలంఘ్యం. అతఃఅనతిలంఘ్యవాక్యత్వాత్ నరిష్టేతి నామ సభాయా యుజ్యతే". అథర్వవేదము 7–13–2

ఇది తాత్పర్యమని సాయణాచార్యుఁ డనుచున్నాఁడు. అందలి సభ్యులందరుఁ గలిసి నిర్ణయించి రూపొందించెడు విషయములు పరుల కనతిక్రమణీయములు, అనభిభావ్యములు కాబట్టి దానికాపేరు వచ్చినది.

సాధారణముగాఁ జట్టము లనుల్లంఘనీయములు. కాబట్టి యా విషయములు రాజశాసనములై యుండవచ్చును. సమితి సభలకు రెండింటికి నధ్యక్షులు, వక్తలు నుండుటయుఁ గలదు.

ఒకవేళ నా సభ సమితి యాధ్వర్యముక్రింద నెన్నుకోఁబడిన కొలఁదిమంది కార్యనిర్వాహక సభ్యులతోఁ గూడిన సంస్థయై యుండవచ్చును. అప్పుడవియేకాక యింకను గొన్ని పరిషత్తులుండెడివి. ఒకవేళ రాజు ధర్మవ్యతిరేకముగాఁ బ్రవర్తించునేని, వెంటనే యతనిఁ దొలఁగించి వైచెడి హక్కు సమితి కున్నది. అట్లుకానియెడల నతఁడెన్నికైనపిమ్మటఁ దన జీవిత కాలమంతయుఁ బ్రభుత్వము చేయవచ్చును. ఇఁక, వేద యుగమునకుఁ దరువాతఁ దలయెత్తిన యేకరాజప్రభుత్వములును నాఁటి యేకరాజప్రభుత్వములవలెఁ గేవలము ధర్మబద్ధములయిన ప్రజాస్వామ్యప్రతిబింబములే కాని, యెంత మాత్రము నిరంకుశములు కావని చెప్పవచ్చును. ఇందుకు దిలీప రఘురామాదుల చరిత్రములు కావలసినంత సాక్ష్యము నీయఁగలిగియున్నవి. ఈ సందర్భమున—

పరిచయం చలలక్ష్య నిపాతనే,
భయరుషోశ్చ తదింగితబోధనం;
శ్రమజయాత్ప్రగుణాంచకరోత్యసౌ,
తనుమతోఽనుమతః సచివైర్యయౌ. 9–49

స ధర్మస్థసఖః శశ్వ, దర్థిప్రత్యర్థినాం స్వయం ;
దదర్శసంశయచ్ఛేద్యాన్, వ్యవహారానతంద్రితః. 17–39

ఈ శ్లోకములును అవశ్య సందర్శనీయములు. దశరథుఁడు మహారాజు. అయినను, మృగయావిహారమునకుఁ బోవుటకతనికి మంత్రుల సమ్మతి కావలసివచ్చినదని పై శ్లోక

మనుచున్నది. అతిథి మహీపతి. అయినను, అతఁడు వ్యవహారములను జూడవలసి వచ్చినప్పుడు తాను స్వయముగాఁ గాక, కొంతమంది సదస్యులతోఁ గలిసి వానిని బరిష్కరించుచుండెడివాఁడని క్రిందిశ్లోకము పలుకుచున్నది. ఇదంతయుఁ బరిశీలించి చూచినయెడల, దశరథాతిథులు తమ యిష్టము వచ్చినట్లు సంచరించెడి నిరంకుశప్రభువులు కారనియు, వారి ప్రభుత్వము, లవి యేకరాజప్రభుత్వములే యైనను, కేవలము మాలిన్య మెఱుఁగని ప్రజాస్వామ్యప్రతిబింబములనియుఁ జెప్పక తప్పదు.

ఒకవేళ మంత్రులు నిరాకరించినచో, దశరథుఁ డప్పుడు తన మృగయావిహారమును విధిగా మానుకొనియుండెడివాఁడు. అది నాఁటి రాజధర్మము. దాని నానంతయు నెదిరింపఁగూడదు. ఎదిరించి స్వచ్ఛందముగాఁ బ్రవర్తించినయెడల నతఁడారోజులలో రాజుగాఁ బరిగణింపఁబడియుండెడివాఁడు కాఁడు.

"నఖల్వసౌ రాజా, యో మంత్రిణోఽతిక్రమ్య వర్తతే." 10

నీతివాక్యామృతం.

ఈ నీతి వాక్య మిదే విషయము నుద్దేశించి చెప్పుచున్నది. మంత్రిపరిషత్తునకుఁ బ్రతికూలముగా నడిచెడి రాజు పదవీభ్రష్టతఁ బ్రాపింపక తప్పదని దీని ముఖ్యోద్దేశము. ఒకవేట యేకా, దే కార్యమును రాజు స్వతంత్రించి చేయరాదు. రాజ్యవ్యవహారములను సమీక్షించునప్పుడు గూడ నతఁడు——

అష్టానాం మంత్రిణాంమధ్యే, మంత్రం రాజోపధారయేత్; 11.

తతః సంప్రేషయేద్రాష్ట్రే, రాష్ట్రీయాయ చదర్శయేత్. 12
మ॥ భా॥ శాంతిపర్వము 85

ఈశ్వరుఁ దన మంత్రిపరిషత్తుతోను, రాష్ట్రపరిషత్తుతోను, దదీయాధ్యక్షులతోను బోడిమిగా నేకీభవించి యందముగా వ్యవహరించుచుండవలయును. మొత్తముమీఁద నతఁడేమి మంత్రించినను ఆ మంత్రము పరిషత్తునందే జరుగవలయునుగాని మరొకవిధముగా జరుగఁగూడదు.

మరియు నామంత్రిణ మక్కడఁ గల సదస్యులం దధిక సంఖ్యాకు లురరీకరించినఁగాక యే విధమైన రూపమును వహింపఁజాలదు. కౌటిల్యుని యర్థశాస్త్రమం దిమిడియున్న—

"అత్యాయికే కార్యే మంత్రిణో మంత్రిపరిషదంచా
హూయ బ్రూయాత్. తత్ర యద్భూయిష్ఠాః కార్య
సిద్ధికరం వా బ్రూయుస్తత్కుర్యాత్." 1-15-11

ఈ పంక్తు లిదేయంశమును బ్రతిపాదించుచున్నవి. వీనినిబట్టి బహుళసంఖ్యాకపరిపాలన భరతవర్షమునకుఁ గేవలము సొంతమైనదే కాని మరొకరెవ్వరుఁ దెచ్చిపెట్టినది కాదని యూహిగాఁ జెప్పవచ్చును. ఒక సాధారణవిషయములనేకా, దసాధారణ విషయములను గురించి చర్చించునప్పుడుగూడ రాజు పరిషత్తును సమావేశపరచక తప్పదు. కేవల మొక రాజకీయవ్యవహారములను గురించి యాలోచించునప్పుడే కాక, లోకవ్యవహారములను సమీక్షించునప్పుడుగూడ నతఁడు సదోగృహముతోఁ గలిసి మెలసియే యుండవలయుఁగాని యొంటిపైని నునికి తగదని శుక్రనీతిసారము—

నైకః పశ్యేచ్చ కార్యాణి, వాదినోశ్శృణుయాన్నచ. 4-29
రహసి చ నృపః ప్రాజ్ఞః, సభ్యాశ్చైవ కదాచన. 4-30

ఇట్లాదేశించుచున్నది. అతిక్షేమమహారాజప్పుడెల్లు తన సదస్యులతోఁగూడి వ్యవహరించుట కిదియే కారణము. సదస్యులును అట్టి పట్టులయందు రాజు లేకుండ వ్యవహరింపఁగూడదు.

అట్లుగాక, పరిపాలకుఁడు స్వాతంత్రించి నిరంకుశముగా వ్యవహరింపఁదలపెట్టెనేని, అప్పుడతఁ డజయ్యమయిన ప్రమాదమునకు గురికావలసివచ్చునని—

ప్రభుఃస్వాతంత్ర్యమాపన్నో, హ్యనర్థాయైవకల్పతే;
భిన్నరాష్ట్రో భవే త్సద్యో, భిన్నప్రకృతి రేవ చ. 4
శుక్రనీతి॥ 2

ఈ శ్లోకము గట్టిగా నెచ్చరికచేయుచున్నది. రాజనీతికి విరుద్ధముగాఁ బరిఢవిల్లునప్పు డతఁడు ముందుఁ బ్రజావిశ్వాసమును, దదుపరి సింహాసనమును గోల్పోవునని దీని యంతరార్థము. నిజముగా, స్వామికంతకు మించిన మహాప్రమాదము మరొకఁడుండదు. కాఁబట్టి యతఁడు తానొకవైపు మంత్రిపరిషత్తునకు, మరొకవైపు పౌరజానపదసభకు ననుకూలుఁడై యుండుట యన్నివిధముల శ్రేయస్కరము. పౌరసభయు, జానపదసభయు వెరసి పౌర జానపద సభ యనఁబడును. అది నేఁటి లోకసభవంటిదని చెప్పవచ్చును. అందలి సభ్యులు రాజధానిలోను, రాష్ట్రములోను గల ప్రజలచే నెన్నుకోఁబడినవారై యుండెడివారు. కనుక నది దేశమునకంతకుఁ బ్రాతినిధ్యము.

వహించెడు సభయని చెప్పవచ్చును. అదియు మంత్రిపరిష త్తును బూర్వమీ భారతఖండమునం దెనలేని ప్రాముఖ్యము వహించియున్నట్లు రామాయణ భార తాదులవల్లను శుక్రనీత్యర్థశాస్త్రాదులవల్లను దెలియవచ్చుచున్నది.

అవి వేదయుగమునఁ బ్రధానరాజ్యాంగములుగాఁ బరిఢవిల్లి పేరెన్నికఁగన్న సమితిసభల స్థానములను క్రమముగా నాక్రమించుకొనిన యిటీవలి క్రొత్తసంస్థలని రాజ్యాంగచరిత్ర నుడువుచున్నది. వేదయుగమున సమితి సభల కెంత ప్రాధాన్యముండెడిదో తరువాతి యుగమునం దాపౌరజానపద మంత్రిపరిషత్తులకును అంతటి ప్రాధాన్యముండెడిదఁట.

మహాభారతములోని శాంతిపర్వము పౌరజానపదసభను గురించి—

పౌరజానపదా యస్య, స్వనురక్తా ప్రపీడితాః;
రాష్ట్రకర్మకరా హ్యేతే, రాష్ట్రస్యచవిరోధినః.

XCIV., 16

ఇట్లుపన్యసించుచున్నది. పౌర జానపద సభ యనుకూలముగా నున్నప్పుడు రాష్ట్రకార్యములన్నియుఁ జక్కఁగా జరిగిపోవుచుండును. అట్లుగాక, యొకవేళ నది ప్రతికూలించెనేని యంత విప్లవములతో రాజ్యవ్యవస్థ యంతయుఁ దారుమారగును. ఈ సందర్భమున—

ఖనీనేత్రస్తు విక్రాంతో, జిత్వా రాజ్యమకంటకం;
నాశకద్రక్షితుం రాజ్యం, నాన్వరజ్యంత తంప్రజాః. 8

త మవాస్య చ తద్రాజ్యే, తస్యపుత్రం సువర్చసం;
అభ్యషించంత కాకేంద్ర! ముదితాహ్యాభనం స్తదా. 9

మ॥ భా॥ అశ్వమేధపర్వము 4

ఈ శ్లోకద్వయి నూడఁదగ్గది. ఖనీనేతుఁడను నొకరాజు రాజ్యమును సరిగాఁ బాలింపలేక ప్రజారక్షణమును జూరకొనలేకపోయినాఁడు. అందువల్లఁ బ్రజాప్రతినిధు లతనిని దొలఁగించి తదీయస్థానమున నతని కుమారుని బ్రతిష్ఠచేసిరి. అతఁడు సర్వవిధముల దక్షుఁడగుట నచిరకాలములోనే యందరికిఁ బ్రేష్ఠుఁడయ్యెను. ఇది దీని సారాంశము. ఇప్పుడిఁకఁ బనిలోఁబనిగా—

కారయామాస సర్వాణి, మంగళార్థాని వై విభుః;
తంబ్రాహ్మణాశ్చవృద్ధాశ్చ, పౌరజానపదైఃసహ. 22
సర్వే నివారయామాసు, ర్దేవాపేరభిషేచనం;
స తచ్ఛ్రుత్వా తు నృపతి, రభిషేకనివారణం;
అశ్రుకంఠోఽభవద్రాజా, పర్యశోచతచాత్మజం. 23

మహాభారతము. ఉద్యోగ. 149

ఈ పంక్తులనుగూడఁ దడివిచూచుట మంచిది. జ్యేష్ఠపుత్రుఁడయిన దేవాపి కతని తండ్రి పట్టాభిషేకము చేయ సన్నద్ధుఁడు కాఁగాఁ బౌర జానపదాది పరిషత్తు లిష్టములేక యనుమతించ లేదనియు నందువల్ల నతని పట్టాభిషేక మాగిపోయెననియు నప్పుడేమియుఁ జేయునది లేక వృద్ధరాజు కంట నీరుపెట్టుకొని యాత్మజునిగురించి దుఃఖించెననియు నివి తెలియఁజేయు

చున్నవి. దుర్మార్గత్వాంగవికలత్వాదులు గల వ్యక్తులకు బాధ్యతఁగల ప్రజాపరిషత్తులు పరిపాలనా భారమును ముడి పెట్టఁజాలవు. ఇప్పుడు వీనివల్లఁ పౌరజానపద మంత్రిపరిషత్తు లకుఁ గల యధికారబాధ్యత లెంత మహత్తరమ్ములైనవో తేటతెల్లమైనది.

రాజనీతి బాహ్యు లయిన వారిని సింహాసనమునుండి తొలఁగించుటకు వాని కెంతయధికారమున్నదో, సంపూర్ణ రాజ లక్షణములు గల యుత్తమోత్తములను దమ పరిపాలకులనుగా వరించుటకును వానికంత యధికారమున్నది.

కోసలరాజ్యాధిపతి దశరథుఁడు బహుకాలము రాజ్యము చేసినవాఁడు. కాలక్రమమున నతఁడు వృద్ధత్వమునుగూడఁ బడసియున్నాఁడు. ఇఁక, శ్రీరామచంద్రుఁడు ధర్మాసనమధి ష్ఠింపవలయునని పౌరజానపదాదిపరిషత్తుల యభిలాష. అతఁడు సంపూర్ణ రాజలక్షణములుగల పురుషోత్తముఁడు. అంతటి మహ నీయుఁడు తమ కన్నులయెంగట సిద్ధముగాఁ గనఁబడుచున్న ప్పుడు ప్రాజ్ఞతఁగల ప్రజ యిన్నకుండఁజాలదు. అది దేశసాభా గ్యమునకు ముఖ్యోపాధి. అందువల్లఁ దదీయ ప్రతినిధులందరు కలిసి ముసలిరాజుతో—

తస్యధర్మార్థవిదుషో, భావమాజ్ఞాయ సర్వశః;
బ్రాహ్మణాజనముఖ్యాశ్చ, పౌరజానపదైస్సహ. 2–19
సమేత్యమంత్రయిత్వాతు, సమతాంగతబుద్ధయః;
ఊచుశ్చమనసా జ్ఞాత్వా, వృద్ధం దశరథం నృపం. 2–20

అనేకవర్షసాహస్రో, వృద్ధస్త్వమసి పార్థివ!
సరామం యువరాజాన, మభిషించస్వపార్థివం. 2-21
ఇచ్ఛామోహిమహాబాహుం, రఘువీరం మహాబలం;
గజేన మహతా యాంతం, రామం ఛత్రివృతాననం. 2-22

ఈ విధముగా నొకరోజున దమ నిశ్చితార్థము నుద్దేశించి ప్రసంగింప మొదలిడిరి. ఇవి రామాయణములోఁ గల యయోధ్యాకాండమందలి శ్లోకములు. "రాజా! నీవిప్పుడు మిక్కిలి ముసలివాఁడవై యుంటివి. ఇఁక శ్రీరామచంద్రునకుఁ గిరీట మొప్పగించుట మంచిది. అతఁడు భద్రాసనమధిష్ఠింప వలయునని మాసాముదాయిక వాంఛ"—ఇది నాఁటి ప్రసంగ మందలి సారాంశము.

మొత్తముమీద వైదికయుగమునందలి సమితి సభ లకుఁ గల హక్కులన్నియుఁ దరుషాతి కాలమునఁ దలయెత్తిన పౌర జానపద మంత్రి పరిషత్తులకు సంక్రమించినవని కచ్చితముగాఁ జెప్పవచ్చును. అయిన నప్పుడు రాజునకు రాజ్యాధికారము జీవితావధికమై యుండగాఁ దరువాత నది వంశపారంపర్యముగా మారుట సంభవించినది. అప్పటికైనను, దొలి యుగమందుఁబలెః దమకు నచ్చనివారిని సింహాసనమునుండి తొలఁగించుటకును, నచ్చినవారిని దమ రాజుగా నెన్నుకొనుటకును బ్రజలకు సంపూర్ణమైన యధికార ముండెడిదని యింత వరకు సమీక్షించిన నిదర్శనములను బట్టి ఖండితముగా వక్కాణింపవచ్చును. ఇఁకఁ గడసారిగా—

ఆసీన స్త్వేవ భరతః, పౌరజానపదం జనం;
ఉవాచసర్వతః పేృక్ష్య,కిమార్యంనానుశాసథ? 111-19
అథోత్థాయ జలంస్పృష్ట్వా, భరతో వాక్యమబ్రవీత్;
శృణ్వంతు మేపరిషదః, మంత్రిణః శృణుయుస్తథా. 24
నయాచే పితరంరాజ్యం, నానుశాసామిమాతరం;
ఆర్యం పరమధర్మజ్ఞం, నానుజానామి రాఘవం. 25

రామాయణము—అయోధ్య

ఈ శ్లోకములనుగూడ గాలించి చూచిన నాఁటి పాలకపరిష దాదుల నిజస్వరూపములు పూర్తిగాఁ గనఁబడఁగలవు. అది చిత్రకూటప్రదేశము. ఎంత బ్రతిమాలినను శ్రీరామచంద్రుఁడు మరలివచ్చి రాజ్యస్వీకృతి చేయుట కంగీకరింపకుండెను. అంత భరతుఁడు లేచి మంత్రిపరిషత్తులను సంబోధించుచు;— "తండ్రినిగాని తల్లినిగాని నాకు రాజ్యము గావలయునని నే నిది వరకెన్నఁడు యాచించి యుండనులేదు, ఇప్పుడిఁక అన్నగారిని విడచిపెట్టనుజాలను. ఈయన పరమ ధర్మజ్ఞతఁ గల స్వయంప్రకాశుఁడు. ఎన్నఁడైనను రాజ్యలక్ష్మి నిట్టి మహనీయుని చేతుల లోనే పెట్టవలయును. అది సర్వథా శ్రేయోదాయకము"— ఇట్లు గంభీరోక్తిగాఁ బ్రసంగించెను. అంతటి మహనీయుఁడు తను కేలిక యగుట నాఁటి పౌరజానపదాది సదస్సులకు హార్దదాయకమైన విషయమే. కాని, యతఁడు తప్పియెరుఁగని నియమపాలకుఁడు. అప్పుడతని దృక్పథమున రాజ్యపాలనముకంటెను నియమపాలనమే గరిష్ఠమైపోయినది.

ఇఁక భరతుఁడును ధర్మాధర్మజ్ఞానముఁ గల మహో దారహృదయుఁడే కాని సాధారణుఁడు కాఁడు. స్వయముగా వలచివచ్చిన రాజ్యవైభవమును ఆవంతయు నపేక్షింపని పదవీ వ్యామోహరహితులు వారు. నిజముగా వారిద్దరియందును రాజప్రతినిధియోగ్యతలు పరిపూర్ణములై యున్నవి.

దేశక్షేమము నభిలషించెడి పౌరజానపదాది పరిషత్తు లట్టి సుగుణాత్ముల కెన్నఁడు వ్యతిరేకముగాఁ బ్రవర్తింపవు. దేశోద్ధతి కేవల మొకపాలకుల నైతికసంపత్తిమీఁదనే కాక పాలితుల నైతికసంపత్తిమీఁదఁ గూడ నాధారపడియున్నది. కాబట్టి పాలకులకేకాక పాలితులకును ఉత్తమప్రవృత్తి యావశ్యకము. అది పుణ్యకాలవైఖరి. అదిగో—అటువంటప్పుడే దేశ సౌభాగ్యము పరిపూర్ణయౌవనవంతమై ఘుమఘుమలాడు చుండును. ఇంకొక ముఖ్యవిషయము. రాజు తన రాజ్యమం దెవ్వరి సొత్తయినను అపహరింపఁబడినప్పు డది సాధించి వారి కిప్పింపఁజాలఁడేని అప్పుడతఁ డాసొమ్మంతయుఁ దనకోశము నుండి తీసి వారికిఁ జెల్లింపవలయునని—

ప్రత్యాహర్తుమశక్తస్తు,ధనంచోరహృతం యది;
స్వకోశాత్తద్ధిదేయం స్యాదశక్తేన మహీభృతా.

ఈ శ్లోకము చాటి చెప్పుచున్నది. ఇది విజ్ఞానేశ్వరుఁడు యాజ్ఞ వల్క్యస్మృతియందుఁ గల యీ 2-2-36 శ్లోకమును వ్యాఖ్యా నించుచుఁ దన మితాక్షరలో నెత్తివ్రాసిన శ్లోకము. దేశ

ములో నేనష్టము వాటిల్లినను దానికి బాధ్యుఁడు రాజేకాఁ గలఁడు. కాబట్టి యానష్టము నతఁడు పూడ్చవలయును. నాఁటి యేకరాజప్రభుత్వ మెంతయందమైనదో యిప్పుడు దీనినిబట్టి తేలికగాఁ దెలిసికోవచ్చును.

కౌటిల్యుఁడు తన యర్థశాస్త్రములో వ్రాసిపెట్టిన—

ప్రజాసుఖే సుఖంరాజ్ఞః, ప్రజానాంచహి తేహితం;
నాత్మప్రియం హితంరాజ్ఞః, ప్రజానాంతు ప్రియంహితం.
1–19–16

ఈ శ్లోకమునం దాయేకరాట్స్వరూపమంతయు స్పష్టముగాఁ బ్రతిబింబించుచున్నది. ప్రజాసుఖమే తన సుఖముగాను బ్రజా హితమే తన హితముగాను ఎంచుకొనుచుఁ దదీయ సౌఖ్య హితములకుఁ దన సౌఖ్యహితములను బూర్తిగ బలియిచ్చెడు ఉత్తమప్రవర్తియే యేకరాట్టనియు నతని ప్రభుత్వమే యేక రాట్ప్రభుత్వమనియు నిప్పుడు స్పష్టమైనది. నిజము చెప్పవల యునేని, అట్టి మహామహితాత్ముని ఇటు పరిషత్తులు అటు ప్రజయుఁ గూడ, నెత్తిమీఁదఁ బెట్టుకొని పూజించును. ఈ సుముహూర్తమునఁ దలవనితలంపుగా—

తంవేధా విదధే నూనం, మహాభూతసమాధినా;
తథాహి సర్వే తస్యాస, న్పరార్థైకఫలా గుణాః. 1–29

స హి సర్వస్య లోకస్య, యుక్తదండతయా మనః;
ఆదదే నాతిశీతోష్ణో, నభస్వా నివ దక్షిణః. 4–8

దురితైరపిక ర్తుమాత్మసా,
త్ప్రియతం తే నృపసూనవో హియత్ ;
తదుపస్థితమగ్రహీదజః,
పితురాజ్ఞేతి నభోగతృష్ణయా. 8-2

రఘువంశము

ఈ శ్లోకములు స్మృతిపథమునఁ దట్టుచున్నవి. స్వార్థమెరుఁగని కేవల పరార్థపరతఁ గలవాఁడు దిలీపుఁడని పై శ్లోకమును, న్యాయైకపరిపాలనవల్ల లోకమునంతను ఆకర్షించుకోఁగలిగిన మహాత్ముఁడు రఘునరేంద్రుఁడని తరువాతి శ్లోకమును ముచ్చటించుచుండఁగాఁ గ్రిందిశ్లోకము పదవీవ్యామోహము లేని నియమపాలకుఁ డజుఁడని చాటుచున్నది. విష్ణుగుప్తుఁడు పై శ్లోకమునఁ జిత్రించి దాచిన యేకరాజపరిభుత్వచిత్రి మిా శ్లోకములం దడుగడుగునఁ బ్రతిబింబించుచున్నది. అది యొక యీ శ్లోకములయందే కాదు, దించుమించుగా రఘువంశప్రపంచమందంతటను బ్రతిఫలించుచున్నది. రఘువంశరాజుల ప్రజాపాలన దీక్ష యెంత మహత్తరమైనదో—

స పౌరకార్యాణి సమీక్ష్య కాలే— 14-24

మంత్రఃప్రతిదినం తస్య,బభూవ సహ మంత్రిభిః. 17-50

ఈ శ్లోకపాదములనుబట్టి గ్రహింప నగును. రామరాజు ప్రతిదినము నిర్ణీతకాలము తప్పకుండఁ బౌరజానపదకార్యములను జూచుచుండెడి వాఁడని పై పాదమును అతిథిరాజు ప్రతి దివసము విధిగా మంత్రిపరిషత్తుఁ జొచ్చి మంత్రులతోఁ గలిసి మంత్రించుచుండెడివాఁడని క్రింది పాదములును జెప్పుచున్నవి.

వారు పౌర జానపద మంత్రిపరిషత్తుల కానందదాయక ముగాఁ బ్రవర్తింపఁజాలిన ప్రజాస్వామ్యములు. భారతరాజకీయ వేత్తలయిన మను చాణక్యులు విధించిన—

తేషాంస్వంస్వమభిప్రాయ,ముపలభ్యపృథక్ పృథక్;
సమస్తానాం చ కార్యేషు, విదధ్యా ద్ధితమాత్మనః. 7-57
తాన్నేకైకశః పృచ్ఛేత్సమస్తాంశ్చ. 1-15-11
ద్వితీయే పౌరజానపదానాంకార్యాణి పశ్యేత్. 1-19-13

ఈ రాజకీయ విధులనుబట్టి ప్రకృతి యోగక్షేమములను వహింపఁదలఁచెడి ప్రజాప్రభువులు, లేక, యేకరాట్టులు తమ రాజ్య వ్యవహారములను దమంతఁ దామే యేదో తోఁచినట్లు చేసి వైవక తమ మంత్రిపరిషత్తులందు మంత్రులతో విడివిడిగను మొత్తముగను మంత్రణములు గావించి తగురీతిని వానిని సంపాలింపవలయుననియు వారనుదినము నిర్ణీతసమయములందుఁ బౌరజానపదసభలను జొచ్చి తదీయ వ్యవహృతులను సమీక్షించుచుండవలయుననియు నవగతమగుచున్నది. ఇప్పుడు దీక్షరయొనర్చి చూచితేని, రామాతిథిప్రభువుల ప్రజాపాలనము లన్నివిధముల శాస్త్రనిబంధనల కనుగుణములై యున్నవని తెలియకపోదు. సగటునఁ గొంచెము న్యూనాధికముగా రఘువంశరాజుల ప్రజాపాలనము లన్నియు నట్టివే యని చెప్ప వచ్చును. కాని, పురుషోత్తముఁడైన శ్రీరామచంద్రుని ప్రజాపాలన మసదృశము: వ్యక్తిగతములైన స్నేహాస్నేహములకు—

ద్వేష్యోఽపి సంమతశ్శిష్ట, స్తస్యార్తస్య యథౌషధం;
త్యాజ్యోదుష్టః ప్రియోఽప్యాసీ,దంగుళీవోరగక్షతా. 1-28
రఘు॥

ఈ విధముగా నావగింజంతయు లోగి యెరుఁగని గుణైకప్రభుత్వములవి. మహా కవి యీ శ్లోకమును దిలీపుని కథయందుంచి నను దీని కాంతిప్రసారము కావ్యమం దన్నిమూలలకు వ్యాపించియున్నది. లోకక్షేమము వాంఛించెడు ఉత్తమప్రభుత్వము లెన్నఁడు గుణాగుణములనే కాని, స్నేహాస్నేహములను ఆశ్రయానాశ్రయాదులను లెక్కచేయవు. తదీయ దృక్పథమున శిష్టులు ద్వేష్యులైనను సమ్మతులు. ఇఁక దుష్టులు ప్రియులయినను త్యాజ్యులు. ఈ ప్రసంగమున—

తస్మిన్మంత్రిప్రయోక్తవ్యో,దండమాధిత్సతానృప! 45
పౌరజానపదా యస్మిన్,విశ్వాసం ధర్మతో గతాః. 46
శాంతి॥ 83

ఈ భారతశ్లోకపాదములు సమీక్షణీయములు. మహామంత్రిపదవి తగిన యోగ్యతయుఁ బౌర జానపదుల విశ్వాసమును గల మహనీయునకే కాని, యేవో కొన్ని వ్యక్తిగతము లయిన పరిచయ స్నేహాదులను బురస్కరించుకొని తద్వ్యతిరిక్తునకు ముడిపెట్టఁగూడదని వీని ప్రబోధము. ప్రధానమంత్రిపదవి కడుంగడు బాధ్యతఁ గలది. అది రాజపదవి తరువాత రాజపదవియంతటిదని నిరాఘాటముగాఁ జెప్పవచ్చును.

అట్టి యుత్తమోత్తమ పదవి సన్నివిధముల యోగ్యతఁ గల దిట్టకే కాని తదన్యున కంటఁగట్టుట శ్రేయోదాయి కాఁ

జాలదు. పరపక్షీయమైనను రాక్షసుని ప్రధానిత్వముకొఱకు నాఁడు చాణక్యుఁ డంతగాఁ బాటుపడుట యిందువల్లనే కాఁబోలు.

ఒక యూపదవియే కాక, దించుమించుగాఁ బ్రభుత్వమందలి బాధ్యతఁ గల యధికరణాదులన్నియుఁ గడుంగడు జాగరూకమై నిండింపఁబడుటయే శ్రేయోదాయకము. ఇప్పు డొక రాజవృత్తియే కాక మంత్రివృత్తియు నతిభద్రముగా నిర్వహింపఁబడవలయునని తెల్లమైనది. ఇఁక, శుక్లయజుర్వేదములోఁ గల—

"ఇయం తే రాట్। యంతాసియమనో ధ్రువో౽సి ధరుణః।
కృష్యైత్వా క్షేమాయ త్వా రయ్యై త్వా పోషాయ త్వా". 9-22

ఈ మంత్ర మవలోకించిన మహీపతియనిన నెవరో తెలిసికొనవచ్చును. "ఈరాజ్యము నీకీయఁబడినది. కనుక యంతృత్వయమనత్వ ధ్రువధరుణత్వ బాధ్యతలిప్పుడు నీపైఁ బడినవి. ఇఁక, లౌకికమైన సర్వవిధాభ్యున్నతికి నీవ దిక్కు." ఇది సారాంశము. ఇది పట్టాభిషేకసమయమున నవరాజు ధర్మాసనమధిష్ఠింపనున్నప్పుడు చదువఁబడెడి రాజ్యాధికారప్రదానమంత్రము. దీనినిబట్టి రాజ్యము కేవలము ప్రజల సొత్తనియు నేలిక వారిపక్షమునఁ దదీయ రక్షకుఁడనియు నిర్వచించిన ప్రాజ్ఞలోకము కాదనఁజాలదు. ఈ యంశము పూర్వము కొంతమట్టుకు వివరీకృతమైయున్నది.

ఒకవేళ నతఁడాసొత్తును నిబంధనానుగుణముగఁ జూడక వ్యతిరిక్తమైఁ బ్రవర్తించినప్పు డతనికి వేనునికిఁబలె సింహాసనభ్రంశము తప్పదు. శతపథబ్రాహ్మణమందుఁ గల—

"యాన్చ రాత్రీమజాయేహంయాన్చ ప్రేతాఽస్మి
తదుభయమంత రేణేష్టాపూర్తంమేలోకంసుకృత
మాయుఃప్రజాంవృఞ్జీథయది తేద్రుహ్యేయం..." 8–15

ఈ మంత్రమునందిదే యర్థ మిమిడియున్నది. "ఒకవేళ నేనెన్నఁడైన నీతిఁదొలఁగి ప్రవర్తింతునేని, అప్పుడు మీరు నన్నుఁదొలగించి శిక్షింపవచ్చును" ఇది సారాంశము. ఇది రేఁడు తన పట్టాభిషేకసమయమునఁ జేసెడు ప్రమాణమునకు సంబంధించిన మంత్రము. చివర కతఁడు తనకుఁ గావలసి యసాధారణకరములను విధించునప్పుడుఁగూడ స్వవశతమై నడువఁగూడదని—

"ఏతేనప్రదేశేనరాజా పౌరజానపదాన్ భిక్షేత". 5–2–90
అర్థశాస్త్రము

ఈ నిబంధన తెలుపుచున్నది. అట్టి యవసరసమయములందతఁడు పౌర జానపద సభ నభ్యర్థించి తదీయ మతానుసారముగా నడుచుకొనవలయునని దీని తాత్పర్యము.

కడుంగడు నిటీవలి గ్రంథమైన మహాభారతములోఁ గనఁబడుచున్న—

యశ్చాత్రధర్మోనీత్యుక్తోదండనీతివ్యపాశ్రయః;
త మశంకః కరిష్యామిస్వవశో న కదాచన. 107
శాంతి—59

ఈ శ్లోకమును బురస్కరించి చూచినను రాజు రాజనీతికి విరుద్ధముగా స్వవశుఁడై ప్రవర్తింపఁజాలఁడని విశదమగుచున్నది. ఇదియు నట్టి ప్రమాణమునకు సంబంధించెడు శ్లోకమే.

పృథుని పట్టాభిషేకసందర్భమందలి శ్లోకమిది. ఇప్పుడు సమష్టిగా సమీక్షించి చూచినఁ గేవలము ప్రజారంజనము ధర్మాను సరణము ప్రధానములుగాఁ గల యుత్తమలోకపాలనమే యేక రాట్ప్రభుత్వ లక్ష్యమని చెప్పవలయును. ఇది నాఁటి యేక రాజప్రభుత్వపద్ధతి. కొన్నికొన్ని విషయములం దేవో కొన్ని వ్యత్యాసములున్నను రాజధర్మాది ప్రధానవిషయములలో మాత్రము దీనికి వేదయుగమునాఁటి యేకరాజప్రభుత్వపద్ధతికి నేమియు భేదము లేదు. ఈవిధానము భరతఖండములో నొకవిధముగా నశోకుని కాలముదనుకను వ్యాపించియున్నట్లవదానశతకాది బౌద్ధగ్రంథములు ప్రకటించుచున్నవి. మొత్తముమీఁదఁ గ్రీస్తుశక మేడవశతాబ్దికిఁబిమ్మట నీపవిత్రపద్ధతి కనఁబడకున్నదని జయస్వాలుని భారతరాజ్యాంగచరిత్ర—హిందూ పోలిటి—నుడువుచున్నది.

ఒకవేళఁ దదుపరి తలయెత్తిన యేకరాజప్రభుత్వములందు స్వవశత ప్రబలియుండవచ్చును. ఇంతవరకు నవలోడించి చూచినయంశములనుబట్టి యేకరాజప్రభుత్వముగూడ నూటికి నూరుపాళ్ళుఁ బ్రజాప్రభుత్వమేకాని యొంతమాత్రము వ్యక్తిగతప్రభుత్వము కాదని విశదమగుచున్నది. ప్రధానాశయములం దారెంటికిఁ గావలసినంత సారూప్యమున్నది. భారతభూమిలో నా రెండు ప్రభుత్వములు నొకొక్కప్పు డేకకాలమున నుండుటయుఁ గలదు. ఇందుకు మహాభారతాది గ్రంథములు కావలసినంత సాక్ష్య మీయఁగలిగియున్నవి. ఇప్పుడొకమారు—

భేదాద్వినాశః సంఘానాం, సంఘముఖ్యోఽసి కేశవ !
యథాత్వాం ప్రాప్యనోత్సీదే, దయం సంఘ స్తథాకురు. 81-25
మ॥ భా॥ శాంతి

ఈ శ్లోకము నుపలక్షించినఁ దత్సమస్య యిట్టే పరిష్కృత మగును. ఇది నారదుఁడు సంఘరాజ్యవిషయములను గురించి శ్రీకృష్ణునితోఁ బ్రసంగించెడి సందర్భమందలి శ్లోకము. "భేదో త్పత్తి ముఖ్యముగా సంఘప్రభుత్వములకు వినాశహేతువు. అదిగాన, కేశవ! నీ వెప్పు డేది చేసినను అది సంఘక్షేమము నకు భంగకారి కానిదై పునఁ జేయుట మంచిది. ఇంతకు నీవు సంఘముఖ్యుఁడవుగదా." ఇది ముఖ్యార్థము.

గణప్రభుత్వమన్నను సంఘప్రభుత్వమన్నను బ్రజా ప్రభుత్వమునకుఁ బర్యాయనామములు. గణమువలె సంఘ మును రాజకీయముగాఁ బారిభాషికపదమైయున్నది. శ్రీకృష్ణ భగవానుఁ డొకప్రజాప్రభుత్వమున కధ్యక్షత వహించి యుండెడివాఁడను పరమార్థ మిప్పు డీశ్లోకమువల్ల బహిర్గత మైనది. అది వృష్ణిప్రజాప్రభుత్వము. భారతకాలమునాఁడు భరతఖండములోఁ గురువంశజు లొకవైపు నేకరాజప్రభుత్వము చెలాయించుచుండ, మరొకవైపు వార్ష్ణేయుఁడు వృష్ణిప్రజా ప్రభుత్వమున కధ్యక్షుఁడై యుండెనని యిఁక నలవోకగాఁ జెప్ప వచ్చును. అప్పుడింకను గొన్ని గణప్రభుత్వము లుండెడివి. ఆగణ ప్రభుత్వములం దది బలిష్ఠమైన ప్రభుత్వమని తెలియుచున్నది. అది కేవల మొకగణప్రభుత్వములం దేకాదు, నాఁటి ప్రభుత్వ ములయందన్నింట నతి బలిష్ఠమయిన యజయ్యసామ్యమని—

యాదవాః కుకురా భోజా, స్సర్వే చాంధక వృష్ణయః;
త్వయ్యాయత్తా మహాబాహో! లోకాలోకేశ్వరాశ్చయే.
మ॥ భా॥ శాంతి॥ 81—29

ఈ శ్లోక ముపన్యసించుచున్నది. ఇదియు నారదుఁడు శ్రీకృష్ణునితోఁ బ్రసంగించెడి సందర్భమందలి శ్లోకమే. ఆ రోజులలోఁ గలవారెల్లరిలో నగ్రేసరుఁడు శ్రీకృష్ణస్వామియే యని దీని ముఖ్యార్థము. అతఁడొకనాఁడేకా, దెల్లప్పుడు నగ్రేసరుఁడే యని చెప్పవచ్చును.

దుర్యోధనుఁ డానాఁడు తనకుఁ బాండవులతోఁ గానున్న మహాసంగ్రామము నిమిత్త మతనిని సైనికసాహాయ్య మర్థించుట కదియే ప్రబలకారణము. శ్రీకృష్ణుఁ డానాఁ డతనికిఁ జేసిన తదీయ సాహాయ్యమునుబట్టియు నతఁడొక రాజ్యాధ్యక్షుఁడనియే తెలియుచున్నది.

ఆ విధముగా నవి తరువాతఁ బొడమిన జైన బౌద్ధాది యుగములయందును ఒకదానిప్రక్క నొకటిగా భారతవిప్లవములో జీవయాత్ర సాగించినవి. చంద్రగుప్తాశోకాదుల చరిత్రాదిక మిందుకుఁ బ్రబల నిదర్శనము. ఆ యుగములలో వారి ప్రభుత్వము లొకప్రక్క నేకరాజీయములై యుండఁగా మరొకచక్కిఁ గల ప్రభుత్వములు కేవలము సంఘీయములై యుండెడివి. పదపడి రఘుభూపాలుని యేకరాట్ప్రభుత్వకాలమునఁగూడ గణప్రభుత్వము లున్నట్లు వెనుక నుదహరింపఁబడిన యుత్సవసంకేత ప్రసంగిశ్లోకములనుబట్టి చెప్పవచ్చును. తదీయ ప్రసక్తి మహాభారతమునందలి సభాపర్వమున—

పునశ్చపరివృత్యాథ, పుష్కరారణ్యావాసినః; 32-8
గణానుత్సవసంకేతాన్, వ్యజయత్పురుషర్షభః. 9

ఇట్లు గోచరించుచున్నది. పాండవేయుఁడగు నకులుఁడు తన పశ్చిమ దిగ్విజయయాత్రలో నుత్సవ సంకేత గణప్రభుత్వము లను జయించెనని యీ శ్లోకపాదము లనుచున్నవి. రఘువంశ మవి హిమాచలప్రాంతీయములని పలుకుచుండఁగా, మహా భారతము పుష్కరారణ్యస్థములని చెప్పుచున్నది. ఒకవేళ, దిలీపాదుల కాలమునం దవి హిమాచలపరిసరభూములయం దుండి తదుపరిఁ గాలక్రమమున మహాభారతకాలమునాఁటికిఁ బుష్కరారణ్యభూములకు వచ్చియుండవచ్చును.

అట్లుగాక, కొందరి మతానుసారముగా, నా గణస్వా మ్యములు మహాభారతకాలమునకుఁ బూర్వము లేవయేని గౌరవుల కాలమునం దవి పుష్కరారణ్యభూములయందుండి పిమ్మటఁ గ్రమముగాఁ గాళిదాసుని కాలమునాఁటికి హిమగిర్యు పాంతభూములకు వలసపోయియుండవచ్చును. అప్పుడు భోజవిక్రమాదిత్యుఁడు తన దిగ్విజయయాత్రలో వానిని జయించి యుండఁగాఁ దదాస్థాని యగు కాళిదాస కవీంద్రుఁ డావిషయమును రఘుభూపాలుని జైత్రయాత్రయందుఁ బ్రతిఫలింప జేసియుండవచ్చును. పుష్కరారణ్య మనఁగా నేఁటి యజ్మీరుప్రాంతము. అటువంటప్పుడు రఘుభూపా లుని కాలమునఁ బ్రజాస్వామ్యము లున్నవని నుడువుట కాయుత్సవసంకేత ప్రసంగిశ్లోకము లాధారములు కాఁజాలవు.

కాఁగాఁ దదీయపు టునికివల్ల నవి కాళిదాసుని కాలమందున్న వనుట కవకాశమున్నది. చరిత్రియుఁ గాదని వాదాడదు. ఏక రాజ్యప్రసక్తి ఋగథర్వవేదసంహితలలో గోచరించు చుండఁగా, గణరాజ్యప్రసక్తి యైతరేయ తైత్తిరీయ బ్రాహ్మణములందును యజుర్వేదసంహితయందును గనఁబడుచున్నది.

కావున, ఆ రెండుప్రభుత్వములును వేదకాలమునాఁటివే యని చెప్పవచ్చుఁ; గాని, యంటేకరాజప్రభుత్వము పూర్వమందును గణరాజ్యవిధానము పరమందును వ్యవహరింపఁబడినవి. అందువల్ల, నేకరాజ్యవిధానము మొదటిదిగాను, గణరాజ్య విధానము రెండవదిగాను జెప్పవలయును.

తరువాత, గణప్రభుత్వముల ప్రసంగము జైనవాఙ్మయమునకుఁ జెందెడు ఆచారాంగసూత్రములో

" గణరాయాణి ". 133-1-10

ఈ విధముగను బౌద్ధవాఙ్మయమునకు సంబంధించెడు అవదాన శతకమునందు—

" దేవ ! కేచిద్దేశా గణాధీనాః కేచిద్రాజాధీనాః". 103

ఈ మాదిరిగను గోచరించుచున్నది. మధ్యదేశమునుండి దక్షిణా పథమునకు: గొందరు వర్తకులు వెళ్ళినప్పు డక్కడి రాజు మహాకప్పిణుఁడు "మీ దేశమున రాజెవ" రని ప్రశ్నింపఁగా నప్పుడు వారతనికిఁ జెప్పిన సమాధాన మిది. మధ్యభారతమందలి కొన్ని దేశములు గణప్రభుత్వాధీనములు, గొన్ని దేశము లేక రాజప్రభుత్వాధీనములు నై యున్నవని దీని తాత్పర్యము.

ఇది నాఁటి తదీయ వ్యవస్థ. అది యింకను జాతకాలు, పాళీపేటక, మజ్జిమనికాయము లోనుగాఁగల యితర బౌద్ధగ్రంథముల యందుఁగూడ దరీదృశ్యమై యున్నది.

"జనపదశబ్దాత్ క్షత్రియాదంఞ్." 4-1-168

ఇది పాణిని తన యష్టాధ్యాయిలో సూత్రించియుంచిన వ్యాకరణసూత్రము. దీనికి సంబంధముగాఁ గాత్యాయనుఁడు చేర్చిన—

"క్షత్రియా దేక రాజా త్సంఘప్రతిషేధార్థం".

వార్తికమిది. ఈ రెండింటిని ఏకముజేసి పతంజలి తన మహాభాష్యమునందుఁ గూర్చియుంచిన—

"క్షత్రియా దేక రాజాదితివ క్తవ్యం.
కింప్రయోజనం? సంఘప్రతిషేధార్థం." 4-1-4

పంక్తులివి. ఇప్పుడు వీనినన్నింటిని బరామర్శించి చూడఁగా సంఘరాజ్యప్రసక్తి, లేక, గణరాజ్యప్రసక్తి వీనియందును బ్రతిఫలించుచున్నట్లవగతమగుచున్నది. ఏకైశ్వర్య గణైశ్వర్యముల ప్రత్యేకతల నిక్కడఁ జూడవచ్చును. మరియు—

సంఘోద్ధౌ గణప్రశంసయోః. 3-3-86
అష్టాధ్యాయి

ఈ మొదలుగాఁ గల సూత్రములయందును దదీయచ్ఛాయలగపడుచున్నవి. క్షత్రియవాచియగు జనపదశబ్దమున కపత్యార్థమం "దంఞ్" ప్రత్యయము కలుగునని పాణిని యుపదేశించుచుండఁగాఁ గాత్యాయనుఁడు క్షత్రియపదమును సంఘప్రతిషే

ర్థ మేకరాజపదముగా నన్వయించుచున్నాఁడు. ఇక్కడ క్షత్రియుఁడనఁగా సంఘనిషేధార్థ మేకరాట్టనియే చెప్పవలయు నని మహాభాష్యకర్త పతంజలి యతనిని గట్టిగా బలపరచు చున్నాఁడు. సంఘమన్నను గణమన్నను ఒకఁడే యని క్రింది సూత్ర మనుచున్నది. వ్యాకరణశాస్త్రమున నయితము గణైక రాజప్రభుత్వముల ప్రత్యేకరూపము లిట్లగపడుచున్నవి.

పదంపడి, విష్ణుగుప్తుఁడు వ్రాసియుంచిన యర్థశాస్త్ర మందుఁగూడ—

"సంఘేష్వేవ మేకరాజోవర్తేత."

"సంఘముఖ్యశ్చసంఘేషు, న్యాయవృత్తిహితఃప్రియః;
దాంతోయుక్తజనస్తిష్ఠే, త్సర్వచిత్తానువర్తకః".

**11–1–160**

ఇట్లది స్పష్టముగా నిమిడియున్నది. సంఘప్రభుత్వములయెడల నేకరాజప్రభుత్వము నడుచుకొనవలసిన పద్ధతియు సంఘ నాయకుఁడు తన సంఘమునందుఁ బ్రవర్తింపవలసిన విధాన మును ఇక్కడ నివసించియున్నవి. ఇఁక, మహాభారతగ్రంథ మునఁ గలఁ దత్ప్రసక్తి వెనుక వివరింపఁబడియే యున్నది. దాని నింకను—

ద్రవ్యవంతశ్చశూరాశ్చ,శస్త్రజ్ఞాః శాస్త్రపారగాః;
కృచ్ఛ్రాస్వాపత్సుసంమూఢా,న్గణాఉత్తారయంతి తే. 20
భేదాచ్చైవప్రదానాచ్చ,నామ్యంతే రిపుభిర్గణాః;
తస్మాత్సంఘాత మేవాహు,ర్గణానాం శరణం మహత్. 31

మ॥ భా॥ శాంతి॥ 98 అ.

ఇత్యాది శ్లోకములందు విశేషించి దర్శింపవచ్చును. గణముల వైభవపాభవములు, గలిమి, శస్త్రాస్త్రశాస్త్రపారంగతా ద్యుత్కృష్టవిషయములు, వాని యనపాయాపాయమార్గములు నిక్కడ వివరీకృతములై యున్నవి. చివరకు, వరాహమిహిరాదుల రచనలుగూడ దాని నుద్ధరించి కనఁబరచుచున్నవి.

ఇవ్వి డొకమారు త్ప్రేక్ష చేయఁగా నేకరాజ్యప్రసంగముతో పాటు గణరాజ్యప్రసంగమును బ్రప్రథమముగాఁ దల యెత్తిన దొక వేదములయందే యని తెలియుచున్నది. వేదముల కాలము బహుపురాతనము. కాబట్టి, యేకరాజ్య గణ రాజ్య విధానములు ప్రపంచములో మొట్టమొదటగా భారత చతురంతలోనే జన్మించి వర్ధిల్లినవని చెప్పఁదగును. కేవల మవియే కాదు, తదితర ప్రభుత్వపద్ధతులు, గ్రామ పత్తన నగరాది పాలకసభలును బూర్వభారతీయులకు భుక్తానుభుక్తము లైనవియే కాని యెంతమాత్రము గ్రొత్తవి కావు. ప్రధానాదర్శములలో నారెంటికి నెట్టి భేదమును లేదని యింతకుముందు వివరించితిని. మూలసూత్రములనుబట్టి చూడఁగా నారెండును ఉత్తమ విధానములనియే చెప్పనొప్పును. ఇందు కవి యనుభవించిన సముజ్జ్వల దీర్ఘజీవికలే ప్రబల నిదర్శనములు. భరత ఖండములోఁ బూర్వ మొకనాఁటి యేకరాజ్యము లింకొక నాఁటి గణరాజ్యములుగాను, ఇంకొకనాఁటి గణరాజ్యములు మరొకనాఁటి యేకరాజ్యములుగాను బరివర్తిల్లుటయుఁ గలుగు

చుండెడిది. ఇందుకు నేపాలు దేశమును ఉదాహరణముగాఁ దీసికొనవచ్చును. అది బుద్ధునికాలమందును అంతకుఁ గొంచెము ముందు వెనుకలఁ గల కాలములయందును ప్రజాప్రభుత్వము క్రింద నుండెడిదని డేవిడ్సు ప్రభృతులు వ్రాసియుంచిన బుద్ధిస్టు ఇండియా మొదలగు గ్రంథములు నుడువుచున్నవి.

మరి, తరువాతఁ గొంతకాలమున కక్కడ దాని స్థానములో నేకరాజప్రభుత్వ మేర్పడినది. అదేవిధముగాఁ గురువిదేహాది భూములు పూర్వ మొకప్పు డేకరాజప్రభుత్వముల క్రింద నుండెడివి. అయినను, గ్రమముగాఁ గొంతకాలమున కవి ప్రజాప్రభుత్వములకుఁ జేవలఁతియైనవని హిందూ పోలిటి నాఁఅను గ్రంథము వ్యక్తము చేయుచున్నది. ఆదియందు త్తమ స్థాయిఁ బుట్టి పెరిగిన మూలసిద్ధాంతముల కనుగుణముగా నడిచినంతవరకు నేప్రభుత్వమైనను విజయవంతముగా సాగిపోఁగలదు. ఇఁకఁ బ్రతికూలత సంభవించినప్పుడు పరివర్తన నైసర్గికము. అది యప్పుడు వెంటనే కాకపోయినను దరువాతఁ గొంతకాలమునకైనను దలచూపక మానదు. అది లంఘింపనలవికాని యీశ్వరాదేశము. ఏదైనను అదియొకవైపు సర్వవిధముల దేశపురోగతికి ముఖ్యాధారమును, మరొకవైపు దేశాంతరములకు మార్గదర్శియునై తన జీవితములో నొకప్పుడును నైతికపతన మెరుఁగని యుత్తమోత్తమప్రభుత్వమై యుండవలయును.

అట్టి దివ్యప్రభుత్వ మెన్నఁడు దేశాభ్యుదయమునకుఁ బ్రతికూలముగాఁ బ్రవర్తింపదు. అదియే కాళిదాసుని హృదయ చతుష్పథములం దహరహము పరాకాష్ఠ నధిగమించుచు దిదృక్షులకు ముద్దుముద్దుగ దర్శనమిచ్చెడు పుణ్యతరప్రభుత్వము. లోకమునిమిత్త మతఁడు తన రఘువంశమహాకావ్యములో భద్రపరచియుంచిన యమూల్యసందేశములం దట్టి యాదర్శ ప్రభుత్వమునకు సంబంధించెడు మహత్తరసందేశ మొకఁడని యిప్పుడిఁక నెలుఁగెత్తి బాహాటముగాఁ జాటవచ్చును. మహాకవి మూటఁగట్టియుంచిన తత్సందేశము ప్రజాప్రభుత్వపరముగాఁగాక యేకరాజప్రభుత్వపరముగా నున్నది. రఘువంశమునకుఁ గథానాయకులైన దిలీప రఘు రామాదు లెల్లరు కేవల మేకరాట్టులు. అదియే యందుకు మూలకారణము.

ఇప్పుడొకమా రాదినుండి తుదివరకు సింహావలోకన మొనర్చి చూచిన రఘువంశాభిధ కబ్బమున కెంతయుఁ బొసఁగియున్నదని చెప్పక తప్పదు. కేవల మనితర కవితా రమణీయతలనే కాక, మొత్తముమీద రఘువంశమహాకావ్య మటు ప్రభుత్వములకు నిటు ప్రజలకు నవశ్యాదేయములగు చక్కని యుపదేశములను హృదయంగమముగా మూటలుగట్టి పొంకముగా ఉంచినది. కాబట్టి, యది యొక యీ వర్గమున కావర్గమున కేకాక, సర్వోదయజిగమిషఁ గల వర్గముల కన్నింటికి విధిగా నారాధింపఁదగిన మహాగ్రంథము.

# ముచ్చటలు

శాంతి సమర సమీక్ష: శాంతిసమర మను ఈ నాటికను శతావధానులు శ్రీ సత్యదుర్గేశ్వరకవులు (ద్వివేది సత్యకవి గారు, చెళ్ళపిళ్ళ దుర్గేశ్వర శాస్త్రిగారు) రచించారు. ఈ నాటిక ఇప్పటికి రెండేండ్ల నాడు సంస్థాన (హైదరాబాదు సంస్థాన) సత్యాగ్రహసందర్భంలో ఉద్దేశించి వ్రాయబడింది.

వ్రాత బలిగోరునన్న సామెతగా ఆ రోజులలో ఇది చాలా పనిచేసింది. ఈ నాటికారచన క్రొంగ్రొత్త బాటలో నడిచింది. అసలు దానికి పురోగమనిక చూపి తాంబూల మందుకున్నవారిలో వీరే మొట్టమొదటి కవులు. అల్లాంటి క్రొత్తదారి త్రొక్కేరు మన సత్య దుర్గ కవులు. ఈ కావ్యంలో ఉన్న కథావస్తువంతా ఆ నాడు దేశంలో వ్యాపించిన రాజకీయ వాతావరణం. అంతేకాని, ఏ పురాణంలోదీ కాదు. మన భాషలో రాజకీయ, అందులో, వర్తమాన రాజకీయనాటకాల్ని గాని, నవలలుగాని, కథలూ, కావ్యాలూ గాని ఇంత నిశ్చంకగా రచించినవారు మరొకరెవ్వరూ లేరని చెప్పడానికి సాహసిస్తున్నాను. కవులకూ రాజకీయాలకూ గల సంబంధాన్ని ఈ నాటిక ఋజువుచేస్తోంది. ఇది క్రొత్తరకం కాదా? నేను వీరిని పొగట్టానికి సమీక్ష చేయటంలేదు. నాటిక చదివిన తరువాత కలిగిన భావాలే నన్నీరీతిగా వ్రాయ ప్రోత్సహించాయి. ఇందులోని పద్యాలన్నీ ఒకవరుసగా చూస్తే

ఒక ప్రబోధపద్యమాలగా గోచరిస్తాయి. వీరు బ్రహ్మాండమైన పాండిత్యంగల వైయాకరణులు. అయినప్పటికీ, దీర్ఘసమాసాలను కురిపించక, అసలే వాడకుండా ఉండక యథోచితంగా వాడుతూ సామెతల్నీ జాతీయాల్నీ చక్కగా కూర్పులో బిగించారు.

ఎన్నో జాతీయ దేశీయ పదాలతో గుచులూరుతోంది ఈ నాటికారాజము. మచ్చుకి మూడు నాలుగు పద్యాలు ఉదహరిస్తా. "పురోగమనిక"లోనే ప్రస్తావనపరంగా ఉద్దేశించి నెహ్రూ పండితుణ్ణి అనుకుంటూ—

"అతడు మహామహుం; డతనివ్యాపృతకీర్తికి నేటి యీప్రపం
చితసువిశాలభూవలయసీమయు దా నిరుకయ్యె; అట్టి భా
రత జననీను తాగ్రణికి రాజులు కా, రధిరాజులైన ఏ
గతి జతవత్తు; రాతని ముఖాముఖి నిల్చుటకైన అర్హులే ?"

ఇల్లా వ్యక్తీకృతుణ్ణి చేసేరు. ఆ పైన కథలోకి దిగి అఖిల భారత ప్రజాపరిషత్తు (All India Congress) మతసంస్థ కాదంటూ హిందూ మహమ్మదీయ సఖ్యంకోసం తత్ప్రతికూలంగా ఉన్న భిన్నాభిప్రాయాల్ని ఛిన్నంచేయటానికి ఎల్లాసున్నితంగా ఎలుగెత్తి ప్రభోధిస్తున్నారో చూడండి;—

"మతముల జోక్యమిందు నణుమాత్రము లే; దదికాక, మాతృభూ
మితల సపర్యచేయుటకు మీరును మేమన నేల? సర్వభా
రతధరణీజు లందుకు నిరంతర మర్హులు; గాన, మహ్మదీ
య తరుణులార! పూనుకొనరయ్య! స్వరాజ్య సమార్జనాజికిన్"

ఆతరువాత, మహాభారతములోని "వచ్చినవాఁడు ఫల్గుణుఁడవశ్యము గెల్తుమనంగ రాదు" అనే పద్యం పోకడగా "వచ్చెడివాడు పండితుఁ డవశ్యము గెల్వనరాదు" అన్న పద్యాన్ని వ్రాసి ఆఫల్గుణుడికీ ఈ పండితుడికీ సమానధర్మాన్ని ఆరోపించిన కవి పుంగవుల చాతుర్యాన్ని గురించి ఏమని చెప్పాలి? అది వర్ణనాతీతం. ఈ పద్యాన్ని చూడండి;—

"పిల్లలు పాప లంగనలు వృద్ధ లటంచును జాలిలేక, భూ
వల్లభులందరున్ బ్రజలపై గురిపించిరి యగ్నివర్షముల్
తొల్లిట; గొందరందిపుడు ద్రోనకు వచ్చిరి, కాని, ఔంధుభూ
వల్లభు డొక్కఁడే సుగుణవంతుడు; తన్నృపు బోలరెవ్వరున్."

సంస్థానాధీశ్వరుల్ని గురించి చక్కగా నిజమాడినది. నేపధ్యం నుండి పలికించిన పలుకులు వినండి రాజు నుద్దేశించి;—

"మతవైషమ్యము లేల పెంచెదవు? సామ్రాజ్యమ్ములెన్నెన్నొ ఈ
మతవైషమ్యములం గదా తుదకు నామంబైన లేకుండ ని
ర్గత సర్వస్వములయ్యె దొల్లి; కొడుకా! త్వన్మాభర్త తా సర్వస
మ్మతుఁడై యుండుట శ్రేయ;మట్లయిన, అస్మద్రాజ్యమింపారెడిన్."

ఇక, మంత్రి నుద్దేశించి జైలులో మ్రగ్గుచున్న ఒక సత్యాగ్రహి పలికిన పలుకుల్ని కూడా చూద్దాం;—

"జానెడు పొట్టకై సచివసత్పధముం గడియించి తెట్టులో
ఈనరజన్మయందు; ఇటులే మనుజన్మనుగూడ నుండనే
మైనను జింతచేయక, నిజావనిసేమము గోరు శాంతి సే
నానివహమ్ము నిట్లు కఠినమ్ముగ బాధలు పెట్టి దేలొకో!"

ఇల్లా ఉదాహరణార్థం చూపదలిస్తే, కావ్యంలో ఉన్న పద్యా లన్నింటినీ వ్రాయవలసిందే. కాని, విషయవిస్తర భీతివల్ల ప్రస్తుతం ఇంతతో విరమిస్తున్నా.

ఆ శైలి, ఆనడక, ఆపాకం, ఆశయ్యా, ఆ శబ్దార్థాల పొందిక, ఆ భావగాంభీర్యం నిజంగా అవన్నీ అంతగొప్పవి. ఇక, మిగతావచన–గద్య–భాగమంతా చక్కని గ్రాంథిక మార్గంలో ముక్తసరిగా, అందంగా ఒప్పుతోంది. "జానెడు పొట్టకై, ముఖాముఖి, కొట్టినపిండి, అయ్యో గ్రహచారమా!, హక్కుదారులు, ఉన్నాడో మరిలేడో దేవుడు, పుట్టినిల్లై పెట్టి పుట్టి, పచారుచేయ, తినబోవుచు రుచినడుగన్పనియేటికి?,— ఇల్లాంటి ఎన్నో చక్కని జాతీయాలతో కలకలలాడుతూ ఈ శాంతిసమరం అటు పామరులకూ ఇటు పండితులకూ కూడా హర్షదాయకంగా సమకూరింది. మరియు, ఇంతవరకూ కనివిని యెరుగని ఒకవిధమైన క్రొంగ్రొత్త రూపాన్నిదాల్చి నేటి దృశ్యకావ్యరంగంలో నిగ్గయిన ప్రత్యేకత్వాన్నీ, సాటిలేని ఆదర్శకత్వాన్నీ సంపాదించుకో గలిగింది ఈ రాజకీయకావ్యం. ఇందులో గద్యపద్యరచనలు రెండూకూడా సమానహోదాలో మృదుమధురంగా ఇమిడి చదివేటప్పుడు పాఠకుల్ని పరవశుల్ని చేసివేస్తున్నాయి. ఇక, సంఘటనలు, సన్నివేశాలు, ఘట్టాలు, పాత్రపోషణ, కథాచిత్రణము మొదలైనవన్నీ అందచందాల్ని కురిపిస్తూ కవుల సిద్ధహస్తత్వాన్ని చూపిస్తున్నాయి. వీరి కవిత్వాన్ని విమర్శించడమంటే సముద్రానికి ఏతాం ఎత్తడం

లాంటిది. సంకల్పసిద్ధులు వీరు. కవి అంటే సంస్కర్త, కవి అంటే దేశోద్ధారకుడు, ఒకమాటలో చెప్పాలంటే, అతడు దేశానికీ సంఘానికీ వెన్నెముకవంటివాడు. ఈ నిరుక్తులు మన సత్య దుర్గ కవులలో మూర్తీభవించి ప్రకాశిస్తున్నాయి. ఇందుకు, మనగడ్డకు స్వారాజ్యంకోసం శాంతి సమరశంఖారావాన్ని బ్రహ్మాండంగా పూరిస్తూ ఉన్న ఈ "శాంతిసమర"మే సాక్షి. ఇవి కల్పితాలుకావు, యథార్థాలు. అయితే, ఇవి ఎక్కడో ఎప్పుడో పెట్టిపుట్టినవారికేకానీ అందరికీ లభించేవికావు.

కవి యేదైనా ఒక గ్రంథం వ్రాస్తున్నాడంటే, దానికి వెనుక ఒక పరమార్థం ఉండితీరాలి. అది దాని మూలసిద్ధాంతం. అదే మాదిరిగా, స్వారాజ్య సమార్జనాన్ని ముఖ్యప్రయోజనంగా చేసుకొని సత్య దుర్గ కవులు ఈ కావ్యాన్ని వ్రాసేరు. నిజంగా, ఈ రోజులలో ఈ గ్రంథాన్ని ఈ విధంగా వ్రాయడం కేవలం త్రాచుపాముతో సెలగాటమనే చెప్పాలి. కాంగ్రెస్సు పేరు ఉచ్చరిస్తేనే పేగులుతీసే గడ్డురోజులివి. ఈ సందర్భంలో వీరి ధైర్యస్థైర్యాలను మెచ్చుకోని ఆంధ్రుడు—ఆంధ్రుడిదాకా ఎందుకు? ఏ దేశీయుడూ ఉండడు. అదృష్టవశాత్తూ, మన సత్యదుర్గకవు లేవిషయాన్ని లోకానికి నేర్పదలచేరో, అల్లాంటి తరి రానే వచ్చింది. కలం పట్టనే పట్టేరు. తల లూపించి రొమ్ములు చరిపించి కృతార్థులైనారు. కర్తికంటెను కలం చాలా గొప్పదనిపించేరు. దేశమూ చాలా మట్టుకు గుర్తించింది. యథార్థంగా చూస్తే, ఇటువంటి రచనలు నే

డాంధ్రలోకానికి బహుధా కావాలి. లోకం వీరి నింకా ఎక్కువగా ప్రోత్సహించి ఇల్లాంటివీ ఇతోఽధికమైనవీ అయినగ్రంథాల్ని వెలువరింప జేయాలి. ఈ సందర్భంలో "ఆంధ్రవాణి" పత్రికను గురించికూడా కొంచెం చెప్పవలసివుంది. దాని వైభవమంతా రెండేండ్ల క్రిందటనే అని చెప్పాలి. ఆరోజులలో ప్రతివారు "ఎప్పుడు వస్తుంది! ఎప్పుడు వస్తుం" దంటూ దానికోసం తెరచిన రెప్పలు మూయకుండా ఎదురుచూస్తూ ఉండేవారు. ఎందుకు? శాంతిసమరం కోసం.

పువ్వు పుట్టగానే పరిమళిస్తుంది. అల్లాగే ఈ దృశ్యకావ్యం పుట్టీ పుట్టగానే ప్రసిద్ధమై పోయినది. ఇది దీని క్రొత్తదనం. భారతి సంచికారాజం సైతం ఇల్లాంటి గ్రంథం తెలుగులో లేదనీ, వీరే ప్రప్రథమ రచయితలనీ వ్రాసింది. అటువంటప్పుడు, నేను మళ్లీ పునరుద్ఘాటనచేయడం అనవసరం. ఒక పురోగమనికను మినహాయిస్తే ఈ దృశ్యకావ్యరచన—

"నిలువన్ నీడ, భుజింప నన్నమును, మేనిన్ దాల్ప నింపైనమే
ల్వలువల్లేక, యహర్నిశల్ వ్యాధిన దేశక్కున్ స్వదేశాంబచిం
తలపాలై కడు గుందుచుండ; మనసేదారిన్ సుఖింపంగ దా
దలపోయున్! నిరతాత్మదేశ జననీ తాత్పర్య సేవార్థికిన్".

ఇల్లా ఈ పద్యంతో ప్రారంభమై, ఈ—

"భారతీయులకుదుర్భరభయానకబంధనాగారభీతిబోనార్చె నెవడు
అన్నింటలోకాన కాదర్శమైతొల్లిపృధులసత్కీర్తినార్జించె నెవతె
తనవారలకు ధరాధామంబునం దున్నతిందెచ్చిపెట్టిపర్ధిల్లు నెవడు
యుగమహాత్ములకెల్లనుర్వీతలంబునన్ పుట్టినిల్లైపెట్టి పుట్టెనెవతె
అట్టిమాతాత గాంధి పరార్థపరుడు,
మనుత పదికాలములపాటు; మనుత భరత
మాత వెండియు లోకైకమాతయగుచు,
వెనుకటి మహోన్నతులు విడంబించి వెలగ."

పద్యంతో సమాప్త మవుతోంది. పైది భారతాంబయొక్క ప్రస్తుత స్థితిగతుల్ని చిత్రించి చూపుచూ, అసలైన దేశ భక్తుని కర్తవ్యాన్ని గురించి ప్రబోధిస్తోంది. క్రిందిది గాంధి మహాత్ముని ఔన్నత్యాన్నీ భారతభూమియొక్క ఆధిక్యాన్నీ ఉద్ఘాటిస్తూ, తదీయ యోగక్షేమాలను ఆశిస్తోంది. ఇది దీని ఆద్యంతాల సౌరభం. ఇది నిజంగా మనోహరమైన సౌరభం అని చెప్పక తప్పదు. క్రొత్తదనం కోరే ఈ రోజులలో సరి క్రొత్తమార్గంతొక్కి మార్గదర్శకులై చరిత్రలో చక్కని క్రొత్తచోటు కల్పించుకున్న శ్రీ సత్యదుర్గేశ్వరకవులను అభి నందిస్తూ వారి నాశీర్వదించమని ఆపరమాత్మను ప్రార్థిస్తున్నాను.

వేంసూరు,
(Via) ఖమ్మంమెట్టు,
11-10-1941.

బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి.

రమాదేవి:— ఇది సుప్రసిద్ధులగు శతావధానులు సత్యదుర్గేశ్వరకవులు రచించిన అయిదంకముల నాటకము. ఇది కల్పిత కథగా గనబడుచున్నది. కథాసందర్భమున భారతదేశాభిమానము, స్త్రీ విద్యావిషయములనుగురించిన ఉద్బోధనలు గలవు. కవిత, కథాగమనము రసవంతములుగా నున్నవి. కవిత్వశైలి తెలియుటకై ఒకపద్యము నుదహరించుచున్నాము.

ఉ॥ మెత్తని మేను, సున్నితముమీరినచేతులు, పూలరేకులన్
మొత్తగఁజాలునట్టిపదముల్, మెరపున్బహిపెట్టుకాంతి, రే
కెత్తినయౌవనమ్ము, మొలకెత్తిన సిగ్గు, శరీరపుష్టిసం
పత్తునుగల్గివెల్గు అలబాలిక, యేరికి దక్కనున్నదో!

గోలకొండపత్రిక, 1943. హైదరాబాద్.

శాంతిసమరము:— ఇది శతావధానులు సత్యదుర్గేశ్వరకవులచే రచింపబడినది. రాజకీయమగు ఏకాంకిక - నాటిక. ఇట్టిది మనభాషలో లేదనియే చెప్పవచ్చును. ఎంతసేపూ ప్రేమికాప్రేమికుల కట్టుకథలతో విసుగెత్తియున్న ఆంధ్రహృదయములకు ఇది నవ్యతనూ, దేశభక్తినీ, దేశసేవనూ, పురికొల్పుటకు సమర్థమైయున్నది.

భారతి. నవంబరు, 1940.

స్వరాజ్యసమరము:— రచయిత శ్రీ ద్వివేది సత్యకవి. ఈ దృశ్యకావ్యం ఝాన్సీలక్ష్మీభాయి జీవితచరిత్రకు సంబంధించినది. చరిత్రకు విరుద్ధంకాని కల్పనతో చక్కని ఆకృతినిచ్చి సహజమూ, సమంజసమూ అయిన ధోరణితో చివరివరకూ జాతీయతను పుష్టిగా పోషిస్తూ సత్యకవిగారు ఈ దృశ్యకావ్యాన్ని పవిత్రచరిత్ర గ్రంథంగా రూపొందించారు. వెట్టిమొట్టి వ్రాత

లతో పాఠకులను విసుగెత్తిస్తున్న నేటి ఆధునిక సాహిత్య రంగంలో ఈలాటి రచనలు ఎంతో ఉపకారులలయి ఉంటాయనడానికి దీనిని చదివినవారెవ్వరూ కాదనలేరు. ఉచితముతైన సంభాషణలూ, ఉదాత్తమైన ఇతివృత్తం, ఉన్నతములైన భావాలుగల ఈ స్వరాజ్యసమరము ప్రదర్శనీయమూ, పఠనీయమూ అయిఉంది.

యామిజాల పద్మనాభస్వామి.

ఆంధ్రపత్రిక : 28, అక్టోబరు, 1956.

శాంతసమరము:— పండితవర్యులు, శతావధానులుఅగు సత్యదుర్గేశ్వరకవులచే రచింపబడిన ఈ శాంతిసమరమును నేను "ఆంధ్రవాణీ" పత్రికలో పూర్తిగా చదివితిని. ఇయ్యది స్వాతంత్ర్యసాధనకు మార్గదర్శులై యలరారుచున్నదనుటకు అవంతయు సందేహములేదు. ఇది తేనెలొలుకు పద్యరత్నములతో ఒప్పారుచు వీరికవిత నిరుపమానమైనదిగా పాఠకలోకమునకు వ్యక్తముచేయుచున్నది. ఈ దృశ్యకావ్యమెంతటి నిరుత్సాహినైనను నిర్మల దేశభక్తిపూరితునిగజేసి అతని జన్మనిసార్థకపరచును. మన దేశపురోగమనానికి ఇట్టి నవ్యరాజకీయనాటకములు ఎంతో అవశ్యకములు. అట్టి దివ్యరచనలకు నేడు మన సత్యదుర్గేశ్వరకవులు మార్గదర్శకులైరి. వీరి భాష సరళమై సామాన్యజనులకును అవగాహమైయున్నది.

మిరియాలగూడెం,
నల్లగొండజిల్లా, నైజాం.
20—12—1939

జె. ఆదినారాయణగుప్త,
అడ్వకేట్.

స్వరాజ్యసమరము:— శతావధాని శ్రీ ద్వివేది సత్యకవి రచించిన చారిత్రకనాటకం. సుమారు నూరుసంవత్సరాలక్రితం భారత స్వాతంత్ర్యంకోసం ఆంగ్లేయులతో పోరిన వీరాంగన ఝాన్సీలక్ష్మీభాయి చరిత్ర ఆధారంగా వ్రాయబడిన చక్కని నాటకమిది. శ్రీ సత్యదుర్గేశ్వరకవులలో నొకరైన శ్రీ సత్యకవి గారి యీ నాటకంలో పాత్రపోషణ, పాత్రోన్మీలనము, శైలి, కవిత్వం, అన్నీ సమంగా మేళవించినవి.

రాధాకృష్ణ: ఆంధ్రప్రభ. 13, అక్టోబరు, 1956.

ఆంధ్రప్రతిష్ఠ: కాకతీయాంధ్ర సామ్రాజ్య వినాశానంతరము, మూడువందలయేండ్లకు పైబడు కాలము దనుక, దక్షిణ భరతఖండమును పరిపాలించిన సంగమ, సాళువ, తుళు, మరియు, ఆర్వీటివంశ్యులచరిత్ర ఇందలి యితివృత్తము; పద్యకావ్యము. పద్యములు కడంగడు హృద్యములుగానున్నవి. తిమ్మరుసును అతని తమ్మునికొడుకును అనుమానముచే బంధించి గ్రుడ్లు పెరికించిన ఘట్టము మిక్కిలి కరుణామయముగ ఉన్నది. ఈ కావ్యమును రచించినవారు శతావధానులు సత్యదుర్గేశ్వరకవులు.

త్రిలింగపత్రిక. 31-3-1947.

ఆత్మకథా:— శ్రీ గాంధీమహాత్ముని జీవితచరిత్ర యిందలి యితివృత్తము. సంస్కృతాంధ్రాంగ్లభాషలలో మంచి పండితులు, సుప్రసిద్ధులును అగు శ్రీ శతావధాని ద్వివేది సత్యకవిగారు దీనిని సంస్కృతభాషలో వ్రాశారు. గ్రంధం అంతా

వచనమయం. అక్కడక్కడ శ్లోకాలుకూడా ఉన్నవి. గ్రంథములో ఎక్కడచూచినా మనోహరమైన ఉపన్యాసచారిత్రకముల శైలి ప్రతిబింబించుచున్నది. గాంధీగారి ఆదేశముప్రకారము శ్రీ సత్యకవిగారు దీనిని వ్రాశారు. వీరు సత్యదుర్గేశ్వరకవులలో మొదటివారు. ఇది యింకను వ్రాతప్రతిగానే ఉన్నది. త్వరలో ఈ ఉద్గ్రంథము నాగరలిపిలో అచ్చయితే సంస్కృతప్రపంచానికి ఎంతో శ్రేయస్కరం. పాఠకులకు సంస్కృతభాషలో ఉపన్యసించేటంత మహత్తరశక్తిని కలిగించడానికి ఈ కృతి అన్నివిధాలా తగిఉన్నది. భారతప్రధాని శ్రీ జవహర్లాల్ నెహ్రూ ఈ కృతిపట్ల తమసంతోషాన్ని వెలిపుచ్చేరు.

త్రిలింగపత్రిక. 14-11-1955.

భావలహరి :— రచయితలు సత్యదుర్గేశ్వరకవులు. ఇది ఖండకావ్యముల గుచ్ఛము. అయినా, రచన నవీనమార్గములోనే నడిచింది. "ప్రబోధము" లోని— "ఈనాటి అమెరికాభూమి రైయెన, నిలువజాలునె? నాటి వెన్నెలదినాల," ఇత్యాదిపద్యాలు ప్రాచీనభారతప్రతిభను చక్కగా చాటుతున్నాయి. "కవీ"అని సంబోధిస్తూ రచించిన కాళిదాసుస్తుతిలో ప్రపంచప్రఖ్యాతిగన్న నాటకకర్త తన జీవితాన్ని రచించుకోలేదేమో అనే విచారాన్ని వెలిపుచ్చిన కవిపుంగవుని— "సుంతరైయెనను మాఘాది సూరులట్లు, ఆత్మకథ వ్రాయవైతికదా," అన్న పలుకులుచదివి అతని కవితాప్రవాహామందు విహరించు శుభసమయములందు కన్నీరుకార్చనివారెవరు? "ఊమపిశాచి"ని పొమ్మని అదలించే కవీంద్రుని వీరత్వము కవి నిరంకుశుడను లోకోక్తిని నిరూపించుకొన్నది. "పెండ్లికొడుకు", జగపతిఖడ్గమా"! మొదలగు చారిత్రక విషయములు చదువరుల రక్తనాళములలో మరుగుపడిన

శౌర్యాగ్నిని రగులుకొల్పును.

(శ్రీహరి కృష్ణ. శ్రమజీవిపత్రిక, రాజమండ్రి).

*Prof.* K. Seeta Ramayya, M.A.
*Secretary, Hydrabad Telugu Academy.*

Nampalli,
Hydrabad (Dn).
July 6, 1949.

Mr. Dwivedi, Satya Kavi, Satavadhani, comes from a learned family and himself is a sound scholar in both Sanskrit and Telugu. He is a Satavadhani and I attended some of his literary performances. He is an author of many and varied Telugu works. He has translated Mahatmaji's (Mahatma Gandhiji's) autobiography into Sanskriet. He is inherently more qualified than a degree holder.

Nizam College,
Hydersbad. (Dn.)

(Sd). K. Sitaramaiah,
*Retired Professor.*

సంపూర్ణ శతావధాన మహాసభలో విజయానంతరము పట్టణవర్తక సంఘముతరపున నుండి ఒసంగబడిన

సన్మాన పత్రిక.

శ్రీసత్యదుర్గ కవి మహాశయులారా!

మాపూర్వపుణ్యా ఫలము కతన బాలకవులగు మీశతావధాన కవితామకరందమును గ్రోలగలిగితిమి. ఇంతటి పిన్నవయస్సున తమరింతటి యపారపాండితీ కవితలను సంపాదించి బహిరంగ మహాసభలకెక్కి అనన్య ప్రఖ్యాతిని గడించుచున్నందులకు మేమెంతయు సంతసించుచున్నారము. మహాకవు లెప్పుడును మాననీయులే. సుపుత్రులగు మిమ్ముగనిన తమజననీజనకు లెంత యదృష్టవంతులో కదా! మిమ్ము ఆభగవంతు డాయురారోగ్యైశ్వర్యములను సమకూర్చి వీక్షించుగాక.

ఖమ్మంమెట్టు,
నైజాం, 1935.

ఇట్లు,
అరవపల్లి రామనరసయ్యగుప్త.

**An anxious letter for a Copy of Andhrapratista, a beautiful historical poem in 13 Chapters.**

To

**Brahmasri Dwivedi Satya Kavi garu,**
**Satavadhani,**
**Tallampadu, (via) Khammameth,**
**Hyderabad State.**

*Dear Panditjee,*

Coming to know of the Significance and the nice and laudable execution by your learned self of the Kavyam "Andhra Pratista" and prompted by exstreme Curiosity aroused by my friends interested in that book with all their commentaries and appreciations concomitent wlth the merits of this book, I approached Brahmasri Durgeswara Sastry garu at Bezawada with the request of supply of one copy of the same for my perusal for which I have evinced the greatest and uncontrolable interest, who was plesed to direct me to one at Rajahmundry by name Balabhadra Venkata Raju for the supply.

On writing to Mr. Venkataraju he expressed his inability to supply, as the stock with him was completely run out and as such I was directed by the self-same gentleman to apply to you furnishing your address (Rajahmundry) to which accordingly I have written. But later, in reply to my request for the book, I received a letter from one who signed himself as D. Gopalam, stating that you were absent from home and I may do well to write to you care of Desmukh Saheb, Tallampadu, Khammameth at which you were expected to be, to have a copy immediately and promising that he would make you comply with my request on return home. Therefore I am now Constrined to write to

you, thow I am not certain of your present correct address, due to my extreme anxiety and impatience, to peruse that work of your's, (a memorable masterpiece as I was informed) which please kindly supply me per V. P. P., immediately you receive this letter and oblige.

In as much as I was counting the whole region for the last six months for the book, please kindly do not put over this matter to a later date, if you can supply it, but in case delay is inevitable, do not forget to comply with any request at the earliest opportunity you come across. By this time, Dear panditjee, I think that you might have gauged the extent and depth of interest I evince in the book and the pains I have taken in constant search and enquiry for the same and as such I request you to do your willing according to the opportunity offered to you in the matter. Or, you may do well to direct your people at Rajahmundry, if possible, to despatch the book to the above given address, etc.,. and thereby releave me of my anxiety regarding the book of which I am very sick at heart

In as much as I am spending most anxious moments and sleepless nights, so to say, concerning the book, please expedite the despatch of the book at your earliest convenience. Soliciting your earliest favour in the shape of supply of a book and commending to your foremost and generous thoughts and sentiments,

*I am Yours,*

(Sd.) **Turaga Panakala Rao,**

M.A., LL.B.,

Pedaparimi (Expt. P.O.)

Guntur Taluka, Guntur Dt.

# తప్పొప్పుల పట్టిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 24 | గంగమ్మ | మంగమ్మ |
| 12 | 18 | లిజిమ్ము | ల్జిమ్ము |
| [illegible] | [illegible] | [illegible]హారము | |
| 10 | [illegible] | [illegible] | శరథ |
| 10 | [illegible] | [illegible]యము | పానీయము |
| 23 | 15 | శుభయుత్వ | శుభంయుత్వ |
| 24 | 18 | అభిజాన | అభిజ్ఞాన |
| | | కుమారసంభవము | |
| 24 | 17 | సంబంది | సంబంధి |
| 24 | 17 | నిమతరంబులగు | నిరంతరంబులగు |
| 24 | 15 | ముదటి | ముందటి |
| 32 | 18 | విశిష్టత | విశ్లిష్టత |
| | | మేఘదూతము | |
| 12 | 1 | సిది | సిద్ధి |
| 19 | 7 | యుంనును | యుండును |
| 22 | 5 | సందేశ | సందేశపు |
| 27 | 4 | కేవ | కేవల |
| 28 | 5 | స్పహాణీయ | స్పృహాణీయ |
| 35 | 15 | సురలత | సురభిలత |